# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

మే 1957

సంపుటము 34 : : సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1957

# కాలచక్రము

శ్రీ బి. అశ్వత్థనారాయణరావు

కాలమే ఒక కాలసర్పము
కాటు వేయును త్రాచువోలె—
కాలు జారిన కాలచక్రము
కర్మ ప్రేరన నాట్యమాడును
మేలు కీళ్లకు కాలదేవత
మానిసికి మర్యాద నిచ్చును.
వెలుగు-చీకటి బయట-లోపల
బ్రద్దలగు బ్రహ్మాండ మంతట.
కాలదేవత కన్ను దెరచిన
కాళరాత్రికి కళలు గూర్చును.

**2**

కాలమే ఒక కాలసర్పము
కాటు వేయును త్రాచువోలె.
కాలమే ఒక కల్పవృక్షము
అదరించును తల్లివోలె—
సూర్య చంద్రాదులకు సైతము
గతుల నుతులను గలుగజేయును;
మోడు మ్రాకుల మోదమేర్పడ
ముత్యముల చిగురింప జేయును—
మొగ్గలకు సౌరభము నింపుచు
మోదమున పలురంగు లల్లును;
ప్రకృతి కన్యకు పాడిమొదవుకు
పసిడి రంగుల పైటలల్లును.
కాలమే ఒక కల్పవృక్షము
ఆదరించును తల్లివోలె—

# అవరోహణ

శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

సూరిబాబు ప్రొద్దస్తమానం తల్లితో ఒకటే పోట్లాట. కారణం అంటూ ప్రత్యేకంగా చెప్పటానికేమీ కనిపించదు. శాంతమ్మకు ఒక్కొక్కప్పుడు తీవ్రంగా మనస్సుకు గాయంతగిలేట్లు కూడా, సూరిబాబు వెనకా ముందు చూడకుండా అనేస్తూవుంటాడు. సూరిబాబు పశ్చాత్తాపపడతాడేమో, తాను మనస్సులో యేమీ పెట్టుకోకుండా వుందా మని యెదురుచూస్తూవుండేది శాంతమ్మ. అతనికి ఆ దృష్టే లేదు. కోప్పడి గదమాయించి, బుజ్జగించి చెప్పేరోజులా కావు, పాతికేళ్లు దాటిపోయినాయి. చిర్రుబుస్సులాడుతూవుంటాడు. ఎందాకా అని సహించి వూరుకోవటమాఅని, శాంతమ్మ దీర్ఘంగా ఆలోచించుకుంటూ వుంటుంది.

ఇంతకీ సూరిబాబుకు పదిహేనవయేట టైఫాయిడువచ్చి, చావుతప్పి బైటపడ్డప్పుడు, ఆ యేడు చదువు మాన్పించిందట. అదొక నేరము శాంతమ్మది. అప్పుడే కనక చదువు మాన్పించకపోతే, తనకీ దుర్దశ పట్టివుండేదికాదని సూరిబాబు కసురుకుంటూవుంటాడు. అయినా బి. ఏ. తప్పి, పూర్తిచెయ్యలేకపోతున్నాడు. అంతకంటే యేమీ దుర్దశలేదు. అప్పుడైనా డాక్టరుగారువచ్చి, మీ అబ్బాయికి పూర్తివిశ్రాంతి యివ్వాలని గట్టిగా చెప్పబట్టి శాంతమ్మ పట్టుపట్టి సూరిబాబు చదువు మాన్పించిందిగాని, లేకపోతే తన కొడుకు యెక్కడ చదువుకుపోతాడోనని మాన్పించిందా మరి! తన అసమర్థతను కప్పిపుచ్చుకోవటానికి, సూరిబాబు తాను బి. ఏ తప్పటానికి కారణం, తన తల్లి ఆ రోజున చదువు మాన్పించడమే అంటాడు.

ఇంటర్మీడియట్ తప్పాడు. అప్పుడుకూడా తన తల్లిమీదే కోపము. వేళకు డబ్బు పంపించకుండా, సరియైన ట్యూషన్ చెప్పించకుండా, నన్ను అశ్రద్ధగా చూసింది. ఆ రోజుల్లో నాకేం తెలుసని? పెద్దవాళ్లు ఏది చెపితే అదే రైటని అనుకుంటూవుండేవాణ్ణి; ఆ వయస్సులోనే పెద్దవాళ్లు మంచిదారిన ప్రవేశపెట్టాలి. మా అమ్మ నన్ను మోసంచేసింది అంటూ చిర్రున లేస్తాడు. అమ్మ మోసంచెయ్యటమేమిటంటే యేవో చిరాకు పడతాడుకాని సరియైన సమాధానం చెప్పడు. ఇంటర్మీడియట్ యింకా ప్యాసు కానేలేదు, సూరిబాబు పెళ్ళయిపోయింది. మళ్ళీ తల్లిమీద యింకో నేరం వచ్చిపడింది. అసలు పెళ్ళంటే యేమిటి? అది యెప్పుడు జరగాలి. పెళ్ళిచేసుకునే వాళ్ళిద్దరు ఒకర్నొకరు యిష్టపడ్డారా! పెళ్ళిచేసిన తర్వాతకష్టసుఖాలు పంచుకునేది చేసిన పెద్దలా! చేసుకున్నవాళ్లా! సంబంధం నిశ్చయంచేసుకోవటానికి, ఆడపడుచు లాంఛనాలు, అత్తగారికి ముడుపు చెల్లించటం ముఖ్యమా? ఇంకేమున్నా ఆలోచించాల్సినవిషయాలు వున్నాయా! పెళ్లికి కట్నం ఒక్కటే ముఖ్యమా! ఇలాంటివి లక్షా తొంభై ఆలోచించాలిసినవి వున్నాయని సూరిబాబు అభిప్రాయం. అప్పుడు తనపెళ్లి జరిగినరోజుల్లో, ఇవేవీ ఆలోచించకుండా, తన తల్లికి, ఆ అమ్మాయి తల్లికీ చిన్నప్పటినుంచీ స్నేహితంట, అందుకని యీ సంబంధం అన్ని విధాల మంచిదని చేసిందిట. దానిమీద కసి.

ఇంటర్ ఐపోయింది. బి. ఏ. లోకి వచ్చాడు. భార్య కాపరానికి వచ్చింది. మొదటేడు అయిపోయింది. మగపిల్లాడు పుట్టాడు. రెండోయేడు పూర్తి అయ్యేసమయంలో ఆడపిల్ల పుట్టింది. ఈ పిల్లలు పుట్టటానికికూడా, సూరిబాబుకు, తన తల్లిమీదే కోపము. ఈ పిల్లలు పుట్టటంవల్లనే తాను బి. ఎ. తప్పాలసి వచ్చిందని సూరిబాబు చిటపటలాడిపోతూ వుంటాడు. అసలు తల్లి తనకు ఆ యీడప్పుడు పెళ్ళికనక చెయ్యకుండావుంటే, యీ పిల్లల జంఝాటన వుండేదినా అని సూరిబాబు తర్కం. అందువల్లనే తన తల్లే తనను అన్నివిధాలా అధోగతిపాలు చేసిందని హుంకరిస్తాడు.

ఇంకోవాదం : తనకే కనక ఇప్పుడున్న తెలివితేటలు, ఆ రోజుల్లోకనక వుంటే, చస్తే పెళ్లి చేసుకునేవాడుకాదు. తర్వాత—పెళ్లి చేసుకోవటం, పిల్లలు కనటానికేనా యేమిటి? శుద్ధ అవివేకం. కాని ఆ రోజుల్లో యింత విజ్ఞానం, యింత పుస్తక జ్ఞానం ఎక్కడిది! పదిమందితోపాటు పశువుల్లాగ ప్రవర్తించటమేకాని! వయస్సువచ్చిన తన తల్లికే తెలీదు. తన తల్లికి సలహాలు ఇచ్చేవాళ్లుకూడా అంతంతమాత్రమే.

ఇప్పుడేమో బి. ఎ. తప్పటం మొదలుపెట్టి మూడేళ్ళు గడిచినాయి. కొన్నింటికి పరీక్షకు వెళ్లక, వెళ్ళినవి ప్యాసుకాక ఈవిధంగా అవస్థ. బి ఎ. పుస్తకాలు మినహాయిస్తే, మిగతావి ఎన్నెన్నో, తీరిగ్గా చదివేస్తూవుంటాడు. ఆ పుస్తకాల్లో సెక్సును గురిం

చినవి వున్నాయి, రాజకీయ గ్రంథాలు వున్నాయి, మతానికి సంబంధించినవి వున్నాయి, ఇంకా ఇతరత్రాకూడా వున్నాయి. ఏ పుస్తకం చదివినా, సూరిబాబుకు పూర్తిగా అర్థం అవుతున్నట్టు కనపడదు. పూర్వాపరాలు పరిశీలించకుండా ఏదో ఒకవాక్యాన్ని పట్టుకోవటము, అదే గొప్ప విషయమని, పెదదార్లు పట్టటమూ జరుగుతోంది. కొన్ని కొన్నింటి మీద తీవ్రంగా ఆలోచించటమూ, అవసరమైనవాటిని వదిలెయ్యాటమూ జరుగుతోంది. ఈపుస్తకాలన్నీ చదవటం మూలాన, సూరిబాబుకు కొన్ని అభిప్రాయాలు నిశ్చితంగా నిలబడిపోయినాయి. రెండోఫలితం ఏమిటంటే,

చీటికి మాటికి బి.ఏ తప్పుతూ వుండటంతో అతనికి కలిగిన అభిప్రాయాల్లో అతిముఖ్యమైనవి కొన్ని వున్నాయి.

తల్లి, కుమారులశ్రేయస్సు చూడదని తల్లి ప్రేమ అనే మిషక్రింద, కన్న సంతానానికి, ఎంత దారుణమైన ద్రోహాన్ని తలపెట్టినా సంఘం హర్షించి వూరుకుంటుందని.

పెళ్ళి, యుక్తవయస్సు, యిద్దరికీ వచ్చిన తర్వాత జరిగినట్లయితే దాని ఆంతర్యము భార్యాభర్తలు గ్రహించి, పిల్లలు కనటానికే పెళ్లి చేసుకోవటం కాదని గ్రహిస్తారని.

సమిష్టి కుటుంబంవలన అనేక అనర్థాలు వున్నాయి. మన తన అనే భావంతో వ్యక్తిత్వాన్ని చంపేసి, ఒక వ్యక్తిని పైకిరాకుండా ఎప్పటికప్పుడు అధః పాతాళానికి త్రొక్కేస్తారు. వ్యక్తి వికాసానికి, సంబంధ బాంధవ్యాలను తెగతెంపులు చేసుకోవాలని.

ఇంకా కొన్ని తీవ్రమైన అభిప్రాయాలను పుస్తకాల్లోంచి సేకరించి, యెప్పటికప్పుడు మననం చేస్తూ వుంటాడు సూరిబాబు.

ఇప్పటి కప్పుడే సుజాతకు, సూరిబాబంటే అదో విధమైన అభిప్రాయం ఏర్పడిపోయింది. ఓనెల రోజుల్నుంచీ తన శరీరంలో కల్గుతున్న మార్పులనుగురించి భర్తతో చెప్పటానికి భయపడుతూ వుంది. సూరిబాబు వచ్చినప్పుడల్లా, అతనికి కన్పించకుండా తనలోని మార్పును, కప్పిపుచ్చటానికి ప్రయత్నం చేస్తూనే వుంది సుజాత. అప్పుడప్పుడు శాంతమ్మవుతే, కోడల్ని పట్టిపట్టి అడుగుతూనే వస్తోంది. శాంతమ్మకు సంతృప్తిగా, సుజాత సమాధానము యెన్నడూ చెప్పనేలేదు. తన కుమారునిచూచి భయపడుతూ వస్తున్న శాంతమ్మ యెక్కువగా, కోడల్ని గదమాయించి అడిగే హక్కు లేదేమో అని మెదలకుండా వూరుకుంది. కాని మనస్సులో శాంతమ్మ ఓ అభిప్రాయం ఏర్పరుచుకుంది. ఎంతైనా ఆడదేను! అయినా, నోరు నొక్కుకుని వూరుకుంది. సుజాత గట్టిగా దగ్గి ఆయాసపడుతున్న సమయంలో, సూరిబాబు అనుకోకుండా అక్కడికి వచ్చేశాడు. ఒక్కక్షణం అక్కడ వుండి ఆలోచనగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. శాంతమ్మ ముక్కుమీద వేలువేసుకుని అక్కడే నిలబడిపోయింది. సుజాత మెల్లిగాలేచి, అత్తగార్ని చూసి తల వంచేసుకుని ప్రక్కకు తప్పుకుంది. శాంతమ్మ దగ్గరకు వెళ్లబోతుంటే సుజాత దీనంగా అత్తగారి మొహంలోకి ఓసారి చూసి, అక్కడనుంచి వెళ్లి పోయింది. శాంతమ్మకు, సుజాత స్వభావము పూర్తిగా తెలుసు. తన స్నేహితురాలు ఎంతమంచిదో, సుజాతకూడా అంత ఉత్తమురాలు. అందువల్లనే ఆ సంబంధం అంటే అంతపట్టుపట్టి చేసింది. అలాంటి పిల్ల తనకోడలవుతే, తనకొడుకు సుఖపడిపోతాడని శాంతమ్మ అప్పట్లో దూరదృష్టితో ఆలోచించి, ఆర్థికంగా కూడా చేతనయినంతవరకు రాబట్టుకో కలిగింది. సుజాతను, పెళ్ళికాక మునుపునుంచీ బాగా యెరుగునుకాబట్టి, కోడలయిన తర్వాతచూసి ఆనందించాలిసిందిపోయి జాలిపడాలిసి వచ్చిందే అని విచారిస్తుంది. కాని మగవాణ్ణిబట్టె ఆడది! అందువల్లనే సుజాత, తన కొడుకునుబట్టి, ప్రవర్తన అంతా పూర్తిగా మార్చుకుంటోందని తనకు బాగాతెలుసు. అట్లా తనకోడలు మార్చుకోనక పోయినట్లయితే, పరిణామాలు యేవిధంగా వుంటాయోకూడా శాంతమ్మ ఊహించకలదు. సుజాత, కాపరానికి వచ్చినతర్వాత పూర్తిగా మారిపోవాలిసి వచ్చిందే అని తనలోతాను తీవ్రంగా బాధపడుతోందని కూడా శాంతమ్మకు తెలుసు. అందువల్లనే, తానుదగ్గరగా వెళ్లుతున్నప్పుడు సుజాత తప్పుకుని వెళ్ళుతుంటే యేమీ అనుకోలేదు. అట్లాగే నిలబడి కాసేపు ఆలోచనగాచూసి, తన పనిలోకి వెళ్ళిపోయింది శాంతమ్మ.

సుజాత వీధిగుమ్మందగ్గిర నుంచుని ఆయాసపడుతూండటం, గది కిటికీలోంచి సూరిబాబు చూస్తూనే వున్నాడు. సుజాత కనిపించిన తర్వాత, అతని ఆలోచనలు యింకా యెక్కువయినాయి. చూస్తూ, చూస్తూ మంచంమీద పడుకోలేకపోయాడు. చివాలున గదిలోంచి లేచివచ్చి, వీధితలుపు తీసుకుని వాకిట్లోకి వెళ్ళిపోయాడు. సుజాత భయంగా, పమిటకొంగును మూతికి అడ్డంపెట్టుకొని లోపలికి వెళ్ళబోతుండగా, కన్నీటితో శాంతమ్మ ఎదురొచ్చింది. సుజాత, శాంతమ్మకు చెప్పకూడదనుకున్నవి, చెపుదామా అనే సందిగ్ధావస్థలో పడుతున్న సమయంలోనే, సూరిబాబు బండీ తెచ్చి వాకిట్లో నిలబెట్టాడు. అతిచిరాకుగా లోపలికివెళ్లి, బండి నీకోసమే తెచ్చాను అన్నాడు, సుజాతవంక చూస్తూ. సుజాతకు అర్థమయింది. కాని సూరిబాబు విపులంగా చెపుదామనుకొంటే, తల్లి అడ్డంగా కనిపించింది. శాంతమ్మ గ్రహించుకుని చప్పున లోపలికి వెళ్లింది.

'వెళ్లి చూపెట్టుకురా'...అన్నాడు ముక్తసరిగా నూరిబాబు.

సుజాత యేమీ మారుమాటాడకుండా బండీ యెక్కింది. బండి సాగేసమయానికి, మథనపడుతూనే వాకిట్లోకి వచ్చి నిలబడ్డ నూరిబాబునుచూసి, చెప్పమంటారా అంది.

నూరిబాబు ముభావంగా సుజాత కళ్లల్లోకి చూశాడు. సుజాతకు అర్థమయి వుంటుందని, నూరిబాబు లోపలికి వెళ్లిపోయాడు సరాసరి తనగదిలోకి. పుస్తకాల బీరువాతీసి, అప్పటి పరిస్థితికి అనుగుణంగా ఓపుస్తకాన్ని తీసి తీవ్రంగా పేజీలు తిరగేస్తున్నాడు. ఓ నలభై పేజీలదాక చదివాడు. ఇంక చదవ బుద్ధిపుట్ట లేదు. అదివరకు అదిచదివిందే. క్రొత్తవిషయము యేమీ కనిపించకపోయేటప్పటికి విసుగనిపించింది. ఆ పుస్తకాన్ని గిర్రున బీరువాలోకి గిరాటుపెట్టి, కిటికీవైపుకు వత్తిగిలాడు. సుజాత బరువుగా మెట్లుయెక్కి వస్తోంది. కాంతమ్మ ఆదుర్దాగా యెదురెళ్లింది. ఆపుకోలేని దుఃఖము అమాంతం, సుజాత నిగ్రహశక్తిమీద దాడి చేసింది. కాంతమ్మ ఒళ్లోకితీసుకుని నీకెంత కష్టము వచ్చిందమ్మా అని మనస్సులో అనుకుంది. నూరిబాబుకు అనుకోకండా యెంతో భయంవేసినట్లనిపించింది. ఏమిటో గాభరాపడిపోయాడు. గుండెమీద చెయ్యిపెట్టుకుని చూసుకున్నాడు. గబగబా కొట్టుకుంటోంది. అటూ యిటూ గదిలో కలయతిరిగాడు. పుస్తకాల బీరువాతీసి ఒక్కసారిగా పుస్తకాలన్నింటినీ తేరిపార చూశాడు. ఏదో ఆలోచించుకున్నాడు. అప్పట్లో మనశ్శాంతి కలిగే సూచనలేవీ కనిపించటం లేదు. గదిలోపల్నుంచి బైటకువచ్చేశాడు. అప్పటికే కాంతమ్మ సుజాతను తీసుకుని లోపలికి వెళ్లిపోయింది. తల్లివలన కదా ఒంటరిగా సుజాతతో మాట్లాడే అవకాశము లభించలేదని, తన కోపాన్నంతా కాంతమ్మవైపుకు మరల్చుకున్నాడు. తాను సరాసరి లోపలికి వెళ్లి సుజాతతో మాట్లాడటానికి అభిమానం అడ్డువచ్చి ఆగిపోయాడు. మహా చిరాకుపడిపోతున్నాడు. ఏటూ తోచక వాకిట్లోకి వెళ్లిపోయాడు.

సుజాత వెక్కివెక్కి ఏడుస్తోంది. కాంతమ్మ ఓదార్చటానికి మాటలు వెతుక్కుంటోంది. తనకు మించినపని అయిపోయేటప్పటికి, కాంతమ్మకూడా, సుజాతతోపాటు, గాభరాపడటమేకాని, యింకేమీ తోచటంలేదు. సుజాతకంటే, యెక్కువగా వణికిపోతోంది. సుజాత యెక్కడ చూచిపోతుందో అని కాంతమ్మ భయపడిపోతోంది. వాకిటితలుపు వెయ్యటానికి కాంతమ్మ లేచివెళ్ళింది. తలుపు వెయ్యబోతుండగా, నూరిబాబు చ్రగున లోపలికి వచ్చేశాడు. సూటిగా తన గదిలోకి వెళుతూ, సుజాతవంక చూసి కనుసంజ్ఞ చేశాడు లోపలికిరమ్మని. లేనిఉత్సాహాన్ని తెచ్చుకుందామని వ్యర్థప్రయత్నంచేస్తూ, సుజాత, మెల్లిగా అడుగుతీసి అడుగువేస్తూ గదిలోకి వెళ్ళింది. కాంతమ్మ బైటనిలబడివుంది. ఆమెకు, మానవుడు ఊహించిన దేవుళ్లందరు జ్ఞాపకం వస్తున్నారు. లోపల్నుంచి మాటలవుతే వినిపిస్తున్నాయేకాని, యిదమిత్థంగా యేమీ తెలియటంలేదు. వినాలనే కుతూహలమవుతేవుందికాని, వీలుపడకపోయేటప్పటికి, భార్యాభర్తల మాటలు మనము యెందుకు వినాలి అని ఊరుకుంది.

'ఏమంటుంది ఇంతకీ...' నూరిబాబు ఆదుర్దాగా అడిగాడు.

సుజాత ఓ నిమిషం మాట్లాడ లేదు.

నూరిబాబు రెట్టించి అడిగాడు.

'ప్రమాదం...' అన్నది తడబడతూ సుజాత. ఇంకా చెప్పాలనుకున్నది యేమీ చెప్పలేకపోయింది. ఆమె వళ్ళంతా గజగజ వణికి పోతోంది. ఒళ్లంతా నిమిషంలో చెమటలు పట్టినాయి. మొహం అంతా పీక్కుపోయినట్లయింది. అంతకంటె నూరిబాబు నీరయిపోయాడు. పమిట కొంగులో మొహం అంతా తుడుచుకుని, ప్రక్కింటి రాజమ్మ, కూతుర్ని తీసుకువచ్చింది ఆస్పత్రికి అన్నది సుజాత అదో విధంగా చూస్తూ.

నూరిబాబు ఉలిక్కిపడ్డాడు. రాజమ్మకు తెలుస్తే యే విషయమైనా, ఆవూరంతా తెలిసినట్టే. బహుశా వాళ్ళు వచ్చారని సుజాత చెప్పటంలో ఉద్దేశం వాళ్లకు తెలిసిందని చెప్పటమే అని గ్రహించాడు నూరిబాబు. ఇంక నూరిబాబుకు తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది. సుజాతకు యీ విషయం నలుగురికి తెలిసి పోయిందే అనే బాధ యెక్కువయింది. నూరిబాబు చరచర గదిలోనుంచి వెళ్ళిపోయాడు. ఇట్టే వాకిట్లోకి వెళ్లితే, గుమ్మంలో బాహాటంగా నిలబడి, ఇరుగు పొరుగు వాళ్లు, మందు యిచ్చావుటమ్మా పిల్లలు కనకండా అని అనుకుంటున్నారు. నూరిబాబును చూసి, తలుపులు వేసుకుని లోపలికి వెళ్లిపోయారు ఒకళ్లిద్దరు. నూరిబాబుకు తలతీసేసినట్లయింది. తాను సంపాదించుకున్న విజ్ఞానము, తన సొంత విషయంలోనే ఉపయోగపడలేక పోయిందే అనే ఒక తీవ్ర అసంతృప్తి తనలో బయలుదేరింది. పదిమందిలో తాను ఒకడు కాదని గట్టిగా నమ్మకంతో నడుస్తున్నా, పదిమంది అనే మాటలకు తాను లోకువయిపోవటం తనకు యెంతో విచారాన్ని కలిగిస్తోంది. తాను తెలుసుకున్నాననుకున్న విషయం వలన తన భార్యకే ప్రాణానికి ముప్పురావటం మరింత ఆశ్చర్యంగా వుంది. తాను ఆలోచించటానికి ఏ విషయము కన్పించటం లేదు. సరాసరి తనకు స్నేహితుడైన డాక్టరు దగ్గరకు వెళ్ళి

జరిగిన విషయమంతా చెప్పాడు. డాక్టరు, సూరిబాబు అజ్ఞానాన్ని నిందిస్తూ దాని విషయంలో శాస్త్రానికి సంబంధించిన విషయాలన్నీ టూకీగా చెప్పాడు. సూరిబాబు తన ఆదుర్దా వెళ్లబుచ్చుతున్నాడు. ఇది సీరియస్ కేసే. అయినా చూస్తాను. నీ ఆదుర్దావల్ల యిప్పుడు పరిస్థితులేవీ మారేవి కావు. చేసి ఆదుర్దా పడడంకంటే, ముందుగానే జాగ్రత్త తీసుకుంటే బాగుండేది అన్నాడు డాక్టరు. సూరిబాబు ఏమీ సమాధానం చెప్పటానికి ప్రయత్నించ లేదు.

సుజాతను ఆసుపత్రికి చేర్చేటప్పటికి స్పృహ లేదు. కాంతమ్మకు మతి తప్పిపోయింది. సూరిబాబు ప్రాణాన్ని పిడికిళ్ళలో పట్టుకుని గజగజలాడి పోతున్నాడు. డాక్టరు ఏం చెప్పినా శిరసావహించాలిసిన ఘడియ. సూరిబాబు తు చ తప్పకుండా చేశాడు. ఇరుగు పొరుగువాళ్ళు కూడా చాలామంది ఆసుపత్రి దగ్గరకు వచ్చేసి వున్నారు. సూరిబాబు వాళ్ళను చూసి కూడా అటువైపు తనమనస్సు మరల్చలేదు. అంతకంటె ఆదుర్దా అయిన విషయము సుజాత బ్రతికి బైట పడడము.

ఏ దేవుడో అడ్డుపడ్డా డనుకుంది కాంతమ్మ. సూరిబాబు, డాక్టరును ప్రశంసించుకున్నాడు లోలోపల. వచ్చిన నలుగురు నాలుగు రకాలుగా వ్యాఖ్యానించుకున్నారు. పిల్లలిద్దరు ప్రక్కగదిలోనుంచి అమ్మా అమ్మా అనే ఒకటే ఏడుపు. ఇద్దర్నీ అమాంతం కౌగలించుకుంది కాంతమ్మ.

సూరిబాబు యింటికి వచ్చినప్పటి నుంచీ అదో విధంగా వుంటున్నాడు. తన తల్లిమీద కోపం తగ్గకపోయినా యింకా ఎన్నో మార్పులు సూరిబాబులో వచ్చినట్లు కనిపిస్తున్నాయి. వేళకు అన్నం తినటం లేదు. తిన్నా, సయించీ సయించకుండా తింటున్నాడు. పిల్లలిద్దరు దగ్గరకు వస్తే, ఒక్కొక్కప్పుడు చీదరించుకుంటాడు. ఒక్కొక్కప్పుడు ఎవ్వరూ లేని సమయంలో ఇద్దర్నీ కౌగలించుకుని ఏడుస్తాడు. కాంతమ్మకయితే కడుపులో తీవ్రమయిన బాధ వుంది, తనకొడుకు రోజురోజుకు యిదయి పోతున్నాడే అని. కాని సాహసించి సూరిబాబును ఏమీ అడగలేకపోతోంది. సుజాతేమో చిక్కి శల్యమై వుంది. కూర్చున్న చోటునుంచి లేవడమే బ్రహ్మాండమయిపోతోంది. పిల్లాడు నాన్నా అని పిలిచి దగ్గరకు వెళితే సూరిబాబు ఆప్యాయంగా దగ్గరకు తీసుకోవటానికి, తన తల్లి చూసిపోతుందేమో అని జంకుతున్నాడు. ఒక్కొక్కప్పుడు తనతల్లి చూడటానికేమో అన్నట్లు, పిల్లల్ని అకారణంగా కొడతాడు. సుజాత యే విషయములో యేమీ కల్పించుకోనే కల్పించుకోవటం లేదు. సుజాత తనతో ఏ విషయమూ మాటాడకపోతూ వుంటే సూరిబాబుకు పిచ్చి యెత్తినట్లనిపిస్తోంది. మొట్టమొదటనుంచి సూరిబాబు, సుజాతను అలా తయారు చేసి వుంచాడు. సుజాత అడుగులకు మడుగులు వత్తుతూ నడుస్తూ వచ్చింది. చప్పున తనలో మార్పులు వస్తుంటే టప్పటికి, సూరిబాబు, సుజాతలో కూడా మార్పులు రావాలని మనస్సులో అనుకుంటున్నాడే కాని పైకి తనభార్యతో ఏమీ చెప్పటం లేదు. సుజాతవుతే సూక్ష్మంగా, తన భర్తలో యేదో మార్పును గమనిస్తున్నా అవసరము వచ్చేటంత వరకు తాను అట్లాగే వుండిపోదామని అనుకున్నట్లుంది. సూరిబాబుకు పగలుకు రాత్రికి తేడాయే కనిపించటం లేదు. కళ్ళు జ్యోతుల్లాగ యెర్రబడి పోయినాయి. మనస్సు అటూ ఇటూ వూగిపోతోంది. తాను యెంతో ధైర్యంగా కొన్ని అభిప్రాయాలను బాహాటంగా చెప్పకలిగాడు. కాని ఇప్పుడతనికి అంతధైర్యం వున్నట్లు కనిపించదు. చివాలున లేచి సుజాత! సుజాత! అని పిలిచాడు. సుజాత గాఢనిద్రలో వుంది. పిల్లలు మైకంతప్పి నిద్రపోతున్నారు. నిద్రపోగామని ప్రయత్నం చేశాడు. కాని సాధ్యపడలేదు. చివరకు సుజాతనుబలవంతగా లేపటం తప్పిందికాదు. క్యావు క్యావుమని ఒకటే ధ్వని. నాకు నిద్రపట్టటంలేదుఅన్నాడు సూరిబాబు. భయంగా చూసింది సుజాత. చప్పున తన పిల్లలిద్దరు పడుకున్న మంచంమీదికి వెళ్ళింది. భర్త, భయంకరంగా కనిపిస్తున్నాడు. సూరిబాబుకు ఏమీ తోచక తన మంచం మీదనుంచి లేచాడు. సుజాత కెవ్వున కేక పెట్టింది. సూరిబాబు అదిరిపోయాడు. కాంతమ్మ గాభరాగా లేచింది.

ఏదో పాడుకల వచ్చిందని సుజాత తప్పించుకోవటానికి ప్రయత్నంచేసింది.

వేసవి శెలవలు యివ్వంగానే, మధు యింటికి వచ్చేశాడు.

'ఏం వదినా అట్లావున్నావు' అన్నాడు మధు.

'ఎట్లావున్నానేమిటి......' అని బలవంతాన అన్నది నవ్వు తెచ్చుకుంటూ.

ఆ నవ్వులో అసహజతను కనిపెట్టిన మధు యింక యేమీ అడగలేదు.

ఏమిటే అమ్మా అన్నాడు మధు, కాంతమ్మను చూసి.

'పెద్ద జబ్బుచేసిందిరా నాయనా, బ్రతుకుతుందనుకున్నామా...' కాంతమ్మ యింకా ముందుకు సాగలేకపోయింది.

సుజాత బెదురుగా చూసింది మధువైపుకు.

'నాకు ఉత్తరం రాయటానికేం, అన్నయ్య సంగతి తెలుసుకదా, నువ్వు రాయటానికేం...' మధు చిటపటలాడుతూ అన్నాడు.

'ఇప్పుడు బాగా కులాసాగా వుందికదా, వాడేడి...' మధు సమాధానంకోసం పట్టించుకోలేదు.

సూరిబాబు వచ్చినతర్వాత, మధును మామూలుగా అడిగే ప్రశ్నలేవో అడిగాడు. మధుకూడా సూటిగా సమాధానాలు చెప్పి వూరుకున్నాడు.

ఈ వేసవిలో యీ వూరు వదిలిపెట్టి, యెక్కడికైనా రికామీగా వుండటానికి వెళ్లిపోదామనిఅదివరలో గట్టిగా నిశ్చయం చేసుకున్నాడు సూరిబాబు. ఆమాట చెప్పిన జ్ఞాపకం వచ్చిందేకాని వెంటనే తన మనస్సు యితర విషయాలమీద వెళ్ళింది. ప్రస్తుతం, విడిగా వుండిపోవాలనే అభిప్రాయానికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వటంలేదు సూరిబాబు. ఒంటరిగా వుండిపోవాలంటే ఏదో భయం అనిపిస్తుంది. తనలో తనకు తెలీకుండా, తనను క్రుంగతీసే కొన్ని శక్తులు ప్రవేశించినట్లనిపిస్తోంది, సూరిబాబుకు. ఎన్నోగంటలు గదిలో కూర్చుని తీవ్రంగా ఆలోచించుకున్నాడే కాని, అతనికి యే విషయము బోధపడటంలేదు.

సూరిబాబు గది గుమ్మంలో నిలబడివున్నాడు. వసంత అడుగులు వేసుకుంటూవచ్చి దభేలున క్రింద పడింది. సూరిబాబు ఎంతో ఆదుర్దాగా వసంత దగ్గరకు రాబోతుండగానే, పిల్ల ఏడుపు విని, యింట్లోనుంచి, శాంతమ్మ పరుగెత్తుకుంటూ వచ్చింది. సూరిబాబు చప్పున వసంతను తీసుకోవటానికి వంగినవాడల్లా, లేచి వాకిట్లోకి వెళ్లిపోయాడు. ఆవాడల్లా సూరిబాబు చాలా బాధపడ్డాడు. ఇంతవరకు యెప్పుడూకూడా, తన ఓటమిని ఇతరులు చూడలేదనుకుంటున్నాడు. ఈనాడవుతే తన తల్లే తనను స్వయంగా చూసింది, వసంతను లేవదీయబోవటం. తన అభిప్రాయానికి యిలాంటి ప్రవర్తన చాలావిరుద్ధంగా కనిపిస్తుందని అనుకున్నాడు. కృత్రిమ వాతావరణంలో పెంపొందించుకున్న ఏ అభిప్రాయాలుకూడా, స్వభావసిద్ధమైన ఏ విషయాల్నికూడా కప్పిపుచ్చలేక పోయినాయి. సూరిబాబుకు మనన రోజురోజుకు యెక్కువయిపోతోంది.

మధేమో, పొలం వెళ్లి, ధాన్యాన్ని బళ్లమీద యెక్కించుకొని వచ్చాడు. పాతరకు మించిన ధాన్యాన్ని, యింట్లో గంపపెట్టె నిండాపోయించాడు. అమ్మిన ధాన్యం బాపతు డబ్బు, కొంత తన చదువుకు వుంచుకుని, మిగతాది తల్లికి యిచ్చేశాడు.

సూరిబాబుకు, తాను నమ్ముకున్న అభిప్రాయాలు తనను ద్రోహంచేసినాయి. తాను తృణీకరించిన తన తల్లి ఓర్పును భరించలేక పోతున్నాడు. తన తమ్ముని ప్రవర్తన తన స్వాభిమానాన్ని పెద్ద దెబ్బ కొట్టింది. సుజాత, తాను తనంతట చెప్పకుండావుంటే ప్రవర్తనలో మార్పు కన్పిస్తుందనే ఆశ, సూరిబాబుకు కలగటంలేదు. తనకున్న పిల్లలమీద ప్రేమ చంపుకుని తన తల్లిని నిరసించే కార్యక్రమము యెక్కువకాలం సాగుతుందని తోచటంలేదు. రోజురోజుకు పిరికివాడయిపోతున్నాడు. అందరూకూడా తనకంటె తెలివికలవాళ్లుగా కనిపిస్తున్నారు. ఇది మరింత బాధగా వుంది. ఆత్మవంచన చేసుకుంటున్నంతకాలం, అభిమానం అడ్డు వస్తోందనుకుంటూవున్నాడు సూరిబాబు. అందువల్లనే అనుభవంవలన తాను నేర్చుకున్నవాటిని, తాను యితరత్రా తెలుసుకున్నవాటిని సమన్వయం చేయలేకపోతున్నాడు. కాలగమనంలో తాను యెన్ని విషయాలు చదివినా, తెలుసుకున్నా, అనుభవంమీద తెలుసుకోవలసిన విషయాలు యెన్నో వున్నాయని మాత్రం సూరిబాబుకు స్పష్టంగా అర్థమయింది.

వసంత, అమ్మా అంటూ పెద్దకేక పెట్టుకుంటూ వచ్చింది. ఏమీలేదు పిల్లినిచూసి భయపడింది. శాంతమ్మ, దగ్గరకు తీసుకుని యీపాడు పిల్లి యెక్కడి దాపరించిందో, యేది పెట్టినా నిలవనీయటంలేదు అని పిల్లివెంట పడింది. ఈసారిదానీ ఏం చేస్తానో అన్నాడు మధు. 'నువ్వేమీ చెయ్యక నాయనా, మన కోపంలో యేదైనా అయితే, అంత ఘోరమైంది యింకోటేమీ వుండదు...ఒరేయ్ మధుసూదనా, నీకే చెప్పేది, దానిజోలికి మాత్రం పోక...' అంటూ గట్టిగా అన్నది శాంతమ్మ.

వాకిట్లోకి యెవరోవస్తే, సూరిబాబు, దోసెడు వడ్లు పెడదామని, గంపదగ్గరకు వెళ్ళి, కుర్చీపీట వేసుకుని, గంపలో చెయ్యిపెట్టాడు. మ్యావుఅని భయంకరంగా అరచి పిల్లి, తన పంజాతో, సూరిబాబు చేతిమీద కొట్టింది. చెయ్యంతా గాట్లుపడి నెత్తురు కారటం మొదలుపెట్టింది. తీరాచూస్తే, నాలుగు పిల్లిపిల్లలు, తల్లిపిల్లి పిల్లకు పాలిస్తోంది. చేతిని యెవరికీ కనిపించనీయకుండా గుడ్డ కప్పేసి తన గదిలోకి వెళ్లిపోయాడు సూరిబాబు. ఆనాలుగు పిల్లలు అతని కళ్లల్లో నిలబడిపోయినాయి. ఆతల్లిపిల్లి కళ్లు మిరుమిట్లు గొల్పుతున్నాయి. ఎంతో క్రోధంగా, మీదకువచ్చి, తన చేతిని కొట్టింది. నిజానికి ఆదెబ్బ తన చేతికి తగిలింది కాదు, సూరిబాబు హృదయానికి తగిలింది. సూరి

బాబుకు ఏ ఆలోచనాపాలు పోవటంలేదు. నిశ్చేష్టుడయి గదిలో అట్లాగే కూర్చుని వున్నాడు.

'అమ్మా మళ్ళీ వచ్చిందే పిల్లి...' అన్నాడు మధు పిల్లివైపుకు గబగబ నడుస్తూ.

'అయ్యో! అటువెళ్ళక. గంపలో పిల్లల్ని పెట్టింది' అన్నది సుజాత.

'వీణ్ణి కొంచెం పట్టుకో, మధు పిల్లిపిల్లల్ని చూడాలంటాడు. ఇంకేమైనా వుందా, పిల్లి కళ్ళు పీకేస్తుంది. వాటంతట అవి పోయేదాకా మనమేమీ చెయ్యకూడదు...' సుజాత, రవిని మధుకుఅప్పగించి లోపలికి వెళ్ళిపోయింది.

మధు పరీక్షగా పిల్లిని, పిల్లిపిల్లల్ని కొంచెం దూరంనుంచే చూస్తున్నాడు.

'వదినా, మనం పిల్లల్ని ఏమన్నా చేస్తామనేనా దాని భయం'...అన్నాడు మధు.

'మనం ముద్దుకు పిల్లను ముట్టుకున్నా సరే పీకి పెడుతుంది. అటువైపుకు వెళ్ళకు'...అంటూనే సుజాత లోపలికి వెళ్ళిపోయింది.

సూరిబాబు అప్పుడే అటువైపుకు వచ్చాడు.

'ఆ గంపదగ్గిరకు వెళ్ళక, పిల్లిపిల్లలున్నాయి'... అంటూ అరిచాడు మధు.

ఏమీ తెలియనివానివాదిరిగా ఉలిక్కిపడి, సూరిబాబు ప్రక్కనుంచి వెళ్ళాడు. పిల్లి, పిల్లిపిల్లలు, అతని దృష్టిపథాన్నుంచి మరలేరు.

సాయంత్రం పిల్లి ఆదుర్దాగా, పరుగెత్తుకుంటూ వచ్చేటప్పటికి, పిల్లిపిల్లలు గంపలో లేవు. అమాంతం గంపమీదనుంచి క్రిందకు దూకింది. అదోరకంగా మ్యావు, మ్యావంటూ గది, సావిడి, వరండా అంతా కలయతిరిగిపోతోంది. ఆపిల్లి మ్యావు అరుపుకు పెద్దవాళ్ళే భయపడిపోతున్నారు, ఏం చేస్తుందో యేమో అని. పిల్లి పిల్లలు వంటింట్లోకి వాటిష్టము వచ్చినట్లు పచార్లు చేస్తున్నాయి. రెండు పిల్లలు తప్పించుకుని, సందులోంచి ప్రక్కింట్లోకి వెళ్ళినాయి. శాంతమ్మవుతే లోపలున్న పిల్లిపిల్లల్నే చూడకుండా వంటింటి తలుపు వేసింది. లోపల పిల్లికూనలు సన్నటిస్వరంతో మ్యావు, మ్యావంటున్నాయి. పిల్లలధ్వని పసికట్టి, అమాంతం వంటింటితలుపుదగ్గరకు పిల్లి పరుగెత్తుకుంటూవచ్చేసింది. భయంకరమైనధ్వని చేసుకుంటూ, ఆ తలుపువీదికి యెగబ్రాకుతోంది. తలుపుల్ని రక్కేసేస్తోంది. గండు పిల్లి అరిచినట్లు గుండెలు అదిరేటట్లు అరుస్తోంది. ఆ మ్యావు అనే శబ్దంలో కరుణ జాలి, ఆదుర్దా, ప్రేమ అన్నీకూడా మిళితమయినట్లనిపిస్తోంది.

శాంతమ్మ, సుజాతలు, యీ చోద్యాన్ని విడ్డూరంగా చూస్తూ నిలబడ్డారు. పిల్లలిద్దరూ కళ్ళార్పకుండా ఆదేపనిగా చూస్తున్నారు. మధు గది తలుపు చాటునుంచి భయంగా తొంగి తొంగి చూస్తున్నాడు. సూరిబాబు కళ్ళు అప్పచెప్పి తదేకధ్యానంతో చూస్తున్నాడు. అతని బుర్రలో వలయాకారంగా ఎన్నో ఆలోచనలు తిరిగిపోతున్నాయి. ఆ పిల్లి పిల్లిపిల్లల దీనాలాపాలు, యితనిలో తీవ్రంగా సంఘర్షణ తెచ్చి పెట్టేస్తున్నాయి. చేతులుకాళ్ళు వణికిపోతున్నాయి. ఆ పిల్లి దీనంగా అరవటాన్ని చూసి భరించలేకపోతున్నాడు సూరిబాబు. లోపల్నుంచి ఆ పిల్లిపిల్లలు యెంతో జాలిగా మ్యావు మ్యావంటున్నాయి. ఆ ధ్వని అంతకంటె హృదయవిదారకంగావుంది.

శాంతమ్మ వున్నట్టుండి వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది.

'నోరులేని జంతువే. దానికే పిల్లలమీద అంత ప్రేమవుంటే, నాకు నా కన్న సంతానంమీద ప్రేమ వుండదూ! నేను యెంత లోపలలోపల కుమిలిపోతున్నానో వాడికేమన్నా తెలుసా! చూడు ఆ పిల్లి యెట్లా ఏడుస్తోందో...శాంతమ్మ హృదయావేదనను ఆపుకోలేకపోయింది. సుజాత దీనంగా, శాంతమ్మ మొహంలోకి చూసింది.

ప్రక్కగదిలో నిలబడ్డ సూరిబాబు తన తల్లి మాటలు విని, నిలువునా నీరయిపోయాడు. ఏమి అనటానికీ నోరు పెగిలిరాలేదు. కళ్ళు చీకట్లు క్రమ్మాయి. తొచ్చుకుంటూవచ్చి వంటింటిగొళ్ళెం, గభాలున తీశాడు. పిల్లి అమాంతం, పిల్లలదగ్గరకు దూకింది. సత్తువతో కాళ్ళను, బలవంతాన నిలబెట్టుకుని, శాంతమ్మ మొహం చూడకుండానే అమాంతంగా అమ్మా, అమ్మా అని సగంసగంఅంటూ తల్లి కాళ్ళమీద పడ్డాడు. శాంతమ్మ పెద్ద నిట్టూర్పువిడిచి క్రింద కూలబడిపోయింది. ఒళ్ళో సూరిబాబు పడుకున్నాడు, ఉంగరాల జుట్టులోకి చేతినిపోనిచ్చి నిమురుతోంది. సుజాత కళ్ళ నెంబడి ఏకధారగా నీళ్ళు కారుతున్నాయి.

వంటింట్లో పిల్లి, తన పిల్లలకు పాలిస్తూ, కూనల వళ్ళంతా నాకుతోంది.

# అంత్యఘట్టం

శ్రీ శింగీతం శ్రీనివాసరావు




**పాత్రలు:**

రాజు
డైరక్టరు సత్యారావు
రంగయ్య
శంకరబాబు
సబ్ఇన్స్పెక్టరు
ఇద్దరు పోలీసులు
నౌకరు

---

$C_1$ = ముందు కర్టను.
$C_2$ = స్టేజిలోని కర్టను.
$S_1$ = $S_2$ = } P, Q ల ముందుండే సైడ్ కర్టన్లు, M వైపుకు తిప్పబడి ఉన్నాయి.

P, Q, R, S, T లు ఊరికే సదుపాయం కోసం ఏర్పర్చుకున్న స్థలాలు.

* * స్టేజిముందు తెర ($C_1$) వేసి ఉంటుంది. ఉన్నట్టుండి, తెర వెనుకనుంచి—ఇంకా సరిగ్గా చెప్పాలంటే—లోన ఎడమవైపు (M) నుంచి చప్పట్లు వినబడతై. చప్పట్లు కొన్ని వందల మంది కొట్టినట్టుగా ఉంది.

---

* 1950 వ సం॥ నవంబరులో మద్రాసు [illegible] అంతర్ కళాశాల నాటికలపోటీలో లాకాలేజివారిచే ప్రదర్శింపబడి ప్రథమ బహుమతి పొందినది.

# అంత్యఘట్టం

ఒకగొంతు : మహాశయులారా : (చప్పట్లు నిలువలేదు.) (గట్టిగా) మహాశయులారా - (చప్పట్లు కొద్దికొద్దిగా త్వరగా తగ్గిపోతాయి — ముందు తెర ($C_1$) ఇప్పుడు తీయబడ్తుంది.

తెర తీస్తుంటే, రాజు స్టేజి మధ్య R దగ్గర వ్రేలాడ కట్టబడిన మైక్ దగ్గర నిలబడి, ఎడమవైపుకు, అంటే (M) వైపుకు తిరిగి మాట్లాడుతున్నాడు. అక్కడ ఒక తెర ($C_2$) వేయబడి ఉంది. అంటే ఆ తెర వెనుకనుంచి చప్పట్లు వినబడుతున్నాయన్నమాట. తెర వెనుక ఉన్న ప్రేక్షకులకు (ప్రేక్షకులు కనబడరు-వారి అరుపులు మాత్రం వినబడతాయి.) రాజు మైక్‌లో చెబ్తున్నాడు. ఇవికాక ($C_2$) అనే తెర ప్రక్క రెండు సైడ్ కర్టన్లు ($S_1$, $S_2$) ఉన్నాయి. వీటిపైన బొమ్మలవేవో అటువైపుకు ఉన్నాయిగాని, మనకు వాటి వెనుకభాగం మాత్రం కనబడుతుంది.

రాజు : మ-హా-శయు-లా-రా! (అంతా నిశ్శబ్దం). ఈరోజు మేము ప్రదర్శించ బూనుకున్న "అంత్యఘట్టం" అనే నాటకంలోని నాలుగు అంకాలు—అతి శ్రద్ధతో, అతి ఉత్సాహంతో మీరందరూ చూచారు. ఇకమీరు దేనికోసం అయితే నిరీక్షిస్తున్నారో, ఆ అఖరు అంకం,—ఈ "అంత్యఘట్టం" అనేనాటకంలోని అంత్యఘట్టం, ఇంకొక కొద్దినిముషాల్లో మొదలెడ్తాం. (తెర $C_2$ వెనుకనుంచి చప్పట్లు)—కాస్త ఓపికపట్టమని ప్రార్థన. (చప్పట్లు—దూరంనుంచి"అలాగేలేవోయి" అనే కేక) (రాజు తనమాటలు ముగియగానే త్వరగా $S_2$ వైపుకు పరుగెత్తి) — కానియ్యండి, కానియ్యండి! ఆలస్యం అయిందంటే ఒకటే గోలపెడ్తారు.

డైరక్టరు సత్యారావు : [ప్రవేశించి స్టేజిలో సామాన్లు సర్దుతూ] ఊ—త్వరగా—త్వరగా.

రాజు ఆ మూడుకుర్చీలు చాలవూ

డైర చాలు, చాలు.

రాజు ఈ రేడియో పొసిషన్ సరిగ్గాఉందా ?

డైర

రాజు ఓ డైరకరుగారూ !

డైర ఆ

రాజు ఈ రేడియోపొసిషన్ సరిగ్గా—

డైర ఆ—ఆ—కొద్దిగా ఆమూలగాపెట్టు. తరువాత, రాజూ—రేడియో 'ఆన్' చెయ్యగానే కొన్నిక్షణాలు ఆగి—

రాజు : రేడియోకు వేడిఎక్కినట్టుగా !

డైర : అవును ! కొన్నిక్షణాలుఆగి నువ్వు పాట మొదలెట్టాలి.

[రంగయ్య ప్రవేశం]

ఏంరంగయ్యా ! కానీ, కానీ. ఏం?—మేకప్ సరిగ్గాఉందా ?

రంగ : (మీసాలు సర్దుకుంటూ)—చూడండి—

డైర : ఆ ఏదీ—కొద్దిగా—ఆ—ఆ—అంతే (ఆగి) అసలు శంకరబాబు ఏడి ?

రంగ : గ్రీన్‌రూమ్‌లోకి వెళ్ళాడేమో ?

డైర ష్—అబ్బబ్బ : (గట్టిగా పిలుస్తూ)—శంకరబాబూ—శంకర—

రంగ : వచ్చేస్తాడు లెండి. ఆ—ఇందాకటి సీను ఎలాఉంది ?

డైర : ఒకటోరకంగావుంది; శంకరబాబు నటన మాంచిరక్తి కట్టింది. అందుకే రంగయ్యా ! ఈఆఖరు అంకం—భద్రం ! ఇందాకటి అంకంకంటె ఏమాత్రం నాసిగాఉన్నా—

రాజు : ఈ టేబిల్ ఇంకా మూలకు లాగాలా ?

డైర : ఎందుకు?—అలాగే బాగుంది.

[బయట చప్పట్లు]

రాజు : అబ్బబ్బ ! ఇంకా ఎందుకు ఆలస్యం—

డైర : శంకరబాబూ—

రాజు : (లోపలికి T ద్వారా పరుగెట్తూ) నేను పిలుచుకొస్తా. అక్కడ బయటఅందురూ—(అంటూ వెళ్ళిపోతాడు)

డైర : రంగయ్యా! నే చెప్పింది జ్ఞాపకం ఉందికదూ? ఇదుగో, మరి క్లైమాక్సు సీనుకదా! నాటకం అంతా దీనిమీద ఆధారపడుతుంది.

రంగ : (తలఊపుతాడు)

డైర : ఆ, శంకరబాబు ఆత్మహత్య చేసుకునే టప్పుడు—

రంగ : (శ్రద్ధగా) ఆ, ఆ—

డైర : ఇలా కత్తితీసినప్పుడు, కేకవద్దు! ఏదో అర్థం కానట్టు భావం చూపించు. ఆ, ఆ, అలాగే! తరువాత కత్తితీసి ఆత్మహత్య చేసుకోగానే ఒక్క క్షణం ఆగి గట్టిగా కేక వేయి. అందరూ అదిరిపోవాలి!

రంగ : [గట్టిగా కేక వేసినట్లు నోరు తెరచి, ముఖం మీద ఆ భావం ప్రకటిస్తాడు]

డైర : ఆ— ఆ— ఎందుకంటున్నానంటే—

రంగ : అంత్యఘట్టం!

డైర : అంత్య ఘట్టం సరే—ఇంకొకటి—

రంగ : క్లైమాక్సు!

డైర : క్లైమాక్స్ సరే!—నే చెప్పేది వినూ! ఇందాకటి సీనులో శంకరబాబు తనభార్యను హత్యచేసిన ఘట్టం బ్రహ్మాండంగా ఉంది. ఇప్పుడు దానిమీద ఈ ఆత్మహత్య ఘట్టం ఇంకా ఒక మెట్టు ఎక్కువగా తయారైతేనే రక్తి కట్టుంది. లేకపోతే అసలు నాటకం అంతా పేలవంగా తయారవుతుంది.

రంగ : కాదు మరీ!—అమ్మో—(మీసాలు సర్దుకుంటాడు)

రాజు : (ప్రవేశిస్తూ)—ఏం—మీరంతా సిద్ధంగా వున్నట్టేనా?

డైర : "మీరంతా" ఏమిటి?— ఇప్పుడిక ఏక్టు చేసేవారు ఇద్దరే—శంకరబాబు--రంగయ్య; శంకరబాబు ఏడి?

రాజు : వస్తున్నాడు. ఆ పోయిన హత్యసీనులో ఏమైందో ఏమో తల తిరిగిందట. పోయి లోపల పడుకున్నాడు. వస్తాడు!—ఆ, ఈ కుర్చీ ఇక్కడ ఇలా ఉండాలా?

డైర : ఆ! — తరువాత — చాల ముఖ్యం — డ్రాయర్‌లో కత్తి పెట్టావా?

రాజు : (డ్రాయర్‌లో నుంచి కత్తి బయటకు తీసి చూపెడ్తూ) ఇదుగో!—

డైర : అది లేకపోతే ఈ అంకమేలేదు. అదుగో శంకర బాబు!

[శంకరబాబు లోపలికి వస్తాడు. మేకప్‌లో ఉన్నాడు. అంటే మేకప్‌లో అతని వయస్సు (నిజంగా అతనివయస్సుకూడా అంతే) ముప్ఫై సంవత్సరాలు. గడ్డంకూడా కొద్దిగా పెరిగినట్టుంది. తల వెంట్రుకలు బాగా పెరిగి ఉన్నాయి. ముంగురులు ఒకటి రెండు నుదురు మీదికివచ్చి వ్యక్తికి ప్రత్యేకత నిస్తున్నాయి. వేసుకొన్న జుబ్బా (చాలా ఖరీదైంది) వదులుగా ఉండడంవల్ల మనిషి ఇంకా భారీగా అగుపడుతున్నాడు]

డైర : ఏం, శంకరబాబు! ఒంట్లో బాగాలేదూ—

శం : ఏ—మీ—లే—దు.

డైర : (శంకరబాబు చెంపమీద చెయ్యివేసి ఉష్ణాన్ని చూస్తూ ధైర్యంగా) జ్వరం లేదు!

శం : ఉందికాని ఫరవాలేదు. ఇక ఒక్క అంకమేగా మిగిలి ఉంది?

డైర : ఒక్కటే!

శం : ఒక్కటే!

డైర : ఇదికూడా అంతా సక్రమంగా సాగిపోతే—

శం : సాగిపోతే!

డైర : ఏమిటి శంకర బాబు!—ఏమిటా మాటలు?

రాజు : అబ్బ, ఏమిటి శంకరబాబు! — ఈరోజు నీలో ఏదో అసాధారణంగా—

డైర : ష్-(రాజును ఊరకోమని సైగచేస్తూ) ఏమీ లేదు. అసాధారణం ఏమిటి? ఇంత సీరియస్ సీన్లువేస్తే ఎవ్వరికైనా తలతిరుగుతుంది. అలాంటప్పుడు శంకరబాబు-పాత్రలో లీనమై-తనే ఆ పాత్ర అయి, ఆస్థితిలో జీవించినట్టు-

శం : నిజం!—ఆ పాత్ర అయి, ఆ స్థితిలో జీవించేటట్టు!

డైర : మరి అలానటిస్తే—

శం : "నటిస్తే"

డైర : అవును. అంతమహత్తరంగా నటిస్తే ఆవేశం రాదూ?-అది రసావేశం. అంతే! శంకరబాబు! ఈ అంత్యఘట్టంలో మనం ఊహించిన-ఆ-అంతస్తు అందుకున్నామంటే నాసంతోషం, ప్రజల సంతోషం అలా ఉంచు—నీ సంతో

షం-(శంకరబాబు ముఖంమీద ఒక చిరునవ్వు) అవును, నీసంతోషం. నిన్ను మళ్లీ మాలో వానిగా చేస్తుంది. (భుజం మీద తట్టూ) జ్వరం లేదు, ఏమీ లేదు. ఏం రెడీనా?- మొదలెడ్దామా?

[బయట అరుపులు—శంకరబాబు తల ఊపుతాడు]

డైర : భలె-రాజు! రెడీ?-రంగయ్యా!

రంగ : ఆ-ఆ, రెడీ!

[రాజు పరుగెత్తి అవతలి వైపు సైడ్ కర్టన్ $s_2$ దగ్గరకుపోయి Q దగ్గర నిలబట్టాడు. డైరక్టరు త్వరగా ఒకపర్యాయం స్టేజిలో సామాన్లంతా మాచి, తృప్తిపడి, రంగయ్య, శంకరబాబులతో P దగ్గరకు వచ్చి నిలబడ్తారు. డైరక్టరు నాటకం పుస్తకం తీసి 'ప్రాంప్ట్' చెయ్యడానికి సిద్ధం అవుతాడు. డైరక్టరు రెడీ అన్నట్టుగా చెయ్యి మాపడంలో అటువైపు రాజు తాడు పట్టుకొని లాగుతాడు. కర్టన్ $c_2$ తెరువబడుతుంది. దాని వెనుక ఉన్న దీపాలు (Foot-lights) వెలగడంతో స్టేజికాంతివంతం అవుతుంది. అంటే M దగ్గర ఉంటే ప్రేక్షకులకు వీరెవ్వరూ కనబడటం లేదు. ఖాళీస్టేజీతప్ప. ప్రేక్షకులు అంతా నిశ్శబ్దంగా అయినారని తెలుసుకొని శంకరబాబు చిన్నగా ఆలోచిస్తూ, క్రిందికి చూస్తూ, ఏదో మనోవికారాన్ని వెల్లడిస్తూ, రెండు చేతులు వెనుక కట్టుకొని P నుంచి R వైపుకు నడుస్తాడు. అంతా నిశ్శబ్దం.]

శం : (చేతిగడియారం మాడుకొని) ఇంకా రాలేదు రామం, రామం.

డైర (అందిస్తూ)-ఎంతపని...

శం (అందుకొని) - ఎంతపని చేసావు! - కాదు, నాచేత ఎంతపని చేయించావు!

డైర శాంతి...

శం శాంతి. శాంతి!-దూరం అయిపోయింది!-ఆ-ఆ-పని-నే నే చేసానా?-

డైర ఈ చేతుల్తో...

శం ఈ చేతులతో నే నే చేసానా? ఏ విధంగానూ అనుమానించ లేని శాంతిని-శాంతిని చంపి-ఇంకా నేను బ్రతికే వున్నాను.

డైర : బ్రతికి చేసిన...

శం : బ్రతికి, చేసిన తప్పుకు పరితపించటం శిక్షలలో ఘోరమైన శిక్ష. శాంతి ప్రపంచంలో లేదు. కాదు! శాంతిస్వరూపం నాలో ఉండి నాలో శాంతిని నాశనం చేసింది.

డైర : ఏమిటీ మాటలు?

శం : ఏ-మి-టీ—మా-ట-లు!

[అర్థం లేకుండా అవీ ఇవి చూస్తూ ఆ వస్తువూ ఈవస్తువూ ముట్టుకుంటూ, అవ్యక్తంగా దగ్గరఉన్న రేడియోను 'ఆన్' చేస్తాడు. రేడియోలో నుంచి వచ్చేపాటవింటూ మౌనంగా కుర్చీలో కూలబడ్తాడు.

రేడియోలో నుంచి పాట వచ్చినట్టుగా Q దగ్గర నిలబడ్డ రాజు పాడ్తాడు. అంటే రాజు పాడటం మనకు స్పష్టంగా కనబడ్తుంది. కానీ M దగ్గర ఉంటే ప్రేక్షకులకు అది రేడియోలోనుంచి వచ్చే పాట.)

రాజు : (పాడ్తూ)
స్వప్నంలో నూత్న శకం
యత్నంతో కొత్త రకం
మూల విరాట్ వాలకం
కాలంలో లోలకం—

శం : (తనలో)—ఎవడో-పాడే వాడికీ-నాలాగే జీవితో ద్దేశ్యం అర్థం కావటం లేదు. (పాట వింటూంటాడు.)

[ఉన్నట్టుండి కుడివైపునుంచి T నుంచి ఒక నౌకరు కుఱ్ఱవాడు చాలా ఆతురతతో P దగ్గర ఉన్న డైరెక్టరు దగ్గరకు వచ్చి]

నౌకరు : (చిన్నగా, భయంగా) సార్, సార్. మీకోసం ఒక సబ్ ఇన్స్పెక్టరు ఇద్దరు పోలీసులు వచ్చారు!

డైర : (ఆశ్చర్యంగా) నా కోసమా?-సబ్ ఇన్స్పెక్టరు--

నౌకరు : అవును సార్, అదుగో ఇక్కడికే వచ్చేసారు!

[సబ్ ఇన్స్పెక్టరు, ఇద్దరు పోలీసులు T నుంచి ప్రవేశిస్తారు]

రాజు : (పాట)
ఆ—ఆ—లలో అరాజకం
ఆదిలోన అవివేకం—

డైర : (సబ్ ఇన్స్పెక్టరు దగ్గరకు వెళ్తూ)—ఏమి టండీ?

సబ్ : (గట్టిగా—అటు స్టేజిలో మైకులు ఉన్నా యనే సంగతి జ్ఞాపకం లేక) ఎవరండి?— ఈ నాటకానికి డైరక్టరైన సత్యారావు—

డైర : ష్, చిన్నగా (దగ్గరకు వచ్చి) నే నేనండి. నేనే, ఏమన్నా—

సబ్ : (తన మామూలు ధోరణిలో బిగ్గరగా) మీరేనా ఈ నాటకం—

డైర : ష్ చిన్నగా! మైక్ లో అందరికి వినబడ్తుంది,

రాజు : (పాట)
అంతులేని నాటకం
అంకంలో ఆటంకం—

డైర : అదుగో-అప్పుడే "అంకంలో ఆటంకం"-

సబ్ : (కోపంగా) ఆటంకం!

డైర : అబ్బెబ్బె, నాటకం అంతవరకు వచ్చిం దంటున్నా—

సబ్ : మీ నాటకంలో వేషంవేసే శంకరబాబు గారు ఎక్కడున్నారు?

డైర ఎందుకు?

సబ్ ఎక్కడున్నారండి? వారిని పిలిపించండి, పనుంది.

డైర ఆ!

సబ్ అవును.

డైర ఆదెలాగండి? నాటకం అంత్యఘట్టంలో—

సబ్ అంత్యఘట్టం అయితే మాకేమండీ!

డైర ష్, చిన్నగా? (ఒకరినొకరు తేరిపార చూచు కుంటారు). (ఆతురతతో) ఏవండీ, మరేం ప్రమాదం—

సబ్ : బయటకు పిలిపించండి—

డైర : ఆ!

రాజు : [పాట]
విశ్వపు టంచులకు బాట
విజ్ఞానుల భజన పాట—

డైర : రంగయ్యా! రంగయ్యా! మరి ఎలాచేస్తాం, ఉన్నట్టుండి కారణం లేకుండా అతను ఇలా వచ్చేస్తే—

సబ్ : కారణం లేకుండా ఏమిటి?

డైర : ప్రేక్షకుల కండి! వారికి కారణం ఎలా తెలుస్తుంది? ఏం, రంగయ్యా! ఈవిషయం ప్రేక్షకుల కేమాత్రం తెలియకుండా అంతా నాటకంలోలాగే, నువ్వు - రంగయ్యా - నువ్వు, స్టేజిలోకి పోయినట్టు పోయి—

రంగ : ఇప్పుడు నా 'ఎన్ట్రెన్సు' కాదే - అతని 'స్పీచ్' ఒకటుంది.

సబ్ : ఇదుగో, మీరు చెయ్యకపోతే, మేమే—

డైర : ఒద్దండి, ఒద్దండి. రంగయ్యా, ఏలాగో ఓలాగు, నీదే 'ఎంట్రెన్స్' అని పిచ్చు, మాటలమధ్యలో చిన్నగా, శంకరబాబుకు ఈసంగతి చెప్పేయి. త్వరగా—

రంగ : నాటకం ఎలా తయారవుతుందో, అంత్య ఘట్టం!

[స్టేజిలోకి వెళ్ళినట్టుగా P నుంచి R వైపుకు వెళ్తాడు.]

రాజు : (పాట)
భవిష్యత్తు లేనిచోట
భావకవుల గాలిమూట—

[రంగయ్య ప్రవేశించగానే అటు దగ్గర నిలబడి పాడుతున్న రాజుకు ఏం అర్థం కావటంలేదు. రంగయ్య ఎందుకు ప్రవేశిం చాడా అని శంకరబాబుకు కూడా అర్థంకాక పోయినా, తన మానసిక స్థితిలో ఇవిఏవి అతనికి తట్టవం లేదు.]

శం : [రంగయ్యను, అంటే నాటకంలో "రాము"ను చూచి లేస్తు] ఎవరు? రాము! ఆ, రాము, నిన్నుగురించే ఆలోచిస్తున్నా. [రేడియోను ఆపేస్తాడు. రాజు పాట నిలిపేస్తాడు.]

రంగ : నన్ను గురించా?

శం : అవును నిన్నుగురించి ఆలోచిస్తూ పిచ్చి వానిలా ఆ రేడియో వెయ్యగానే నాలాంటి పిచ్చివాడు నా భావాలే పాడుతున్నాడు. లోకంఅంతా పిచ్చి. ఇదే వేళప్పుడు, ఆరోజు నేను శాంతిని—

రంగ : బాబు! అంతా మరచిపో, హృదయంలో శాంతాన్ని—

శం : (తనలో నవ్వుకుంటూ) శాంతాన్ని!- శాంతి చనిపోయింది. నీకు తెలీదు కాబోలు-

రంగ : అంతా తెలిసింది. (దగ్గరకువచ్చి) మరచిపో- బాబు-(అని దగ్గరకువెళ్ళి భుజంమీద చెయ్యి వేసి M దగ్గర ప్రేక్షకులకు తెలియకుండా,

(మనకందరికీ బాగానే వినబడేటట్టు, శూన్యంగా చూస్తున్న శంకరబాబు చెవిలో పోలీసులు వచ్చినసంగతి ఊదుతాడు.)

శం : [ఆశ్చర్యంగా] ఆ!— (చిన్నగా అయోమయంగా P వైపుకు నడుస్తాడు.)

రంగ : [నటన అనిపిస్తూ]—బాబూ! ఎక్కడికి? ఆవేశం వద్దు—

[శంకరబాబు P దగ్గరకు వచ్చేస్తాడు. చేసేది లేక రంగయ్య కుర్చీమీద కూర్చొని మళ్ళీ రేడియో 'ఆన్' చేస్తాడు.]

రాజు : [పాట]

సర్వజ్ఞుల కలం అటూ
సామాన్యుల బలం ఇటూ

శం : (చిన్నగా) పిలిచారా?

సబ్ మీరేనా శంకరబాబు?

శం అ-వు-ను.

సబ్ మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాం.

డైర (అదిరిపడి) ఆ?—అరెస్టా!

సబ్ మీమీద నేరం—

శం తె-లు-సు. (శూన్యంగా, విషాదంగా పైకి చూస్తాడు.)

డైర ఏమిటి, శంకరబాబు!—ఏమిటి దంతా?

సబ్ మూడు సంవత్సరాల వెనుక మీరు మీ భార్యను ఖూనీచేశారు!

డైర ఆ!

సబ్ అప్పుడు మీ పేరు సురేష్. ఖూనీ చేసింది మీరని పోలీసులకు తెలియగానే వారికి చిక్కకుండా పారిపోయారు. అప్పట్నుంచీ మిమ్మల్ని వెంటాడుతూ—

శం : ఇన్‌స్పెక్టరుగారూ! ఈ మూడుసంవత్సరాల్లో మనిషి మారటానికి వీల్లేదా?

సబ్ : (ఆ మాటలు చెవి కెక్కించుకోక)—అప్పట్నుంచీ మిమ్మల్ని వెంటాడుతూ ఈరోజుకు ఆ సురేష్, శంకరబాబు పేరుతో ఈ "అంత్యఘట్టం"లో నటించే మీరు—ఒక్కరే అనే తార్కాణాలు దొరికాయి.

శం : నాదొక్కమాట! (చిన్నగా) మీరే శిక్ష అయినా విధించుకోవచ్చు. కానీ, చేసిన పనికి ప్రాయశ్చిత్తం ఎప్పుడో అనుభవించాను. జీవించి, పరితపించి, కుళ్ళిపోవడం! ఇంకా—

డైర : శంకరబాబు!

శం : క్షమించ-ండి. డైరెక్టరుగారు, నాకెందుకో అనిపించింది ఈరోజు అంత్యఘట్టం అని! వెళ్ళకతప్పదు. మరొక్క క్షణం నాలో నేనే కుమిలిపోయి బాధపడలేను! (సబ్ ఇన్‌స్పెక్టరుతో)—మీ ఇష్టం!

డైర : శంకరబాబు, నాటకం సంగతి! ఇక నన్ను బ్రతకనియ్యరు. యిది—యింక కొన్ని క్షణాలు—అంత్యఘట్టం—

శం : అంత్యఘట్టం?

సబ్ : ఏం? ఎక్కడికీ పారిపోవడావడానికి వీలుండదులెండి. అంతా బందోబస్తుచేసాం.

శం : ఇక పారిపోవాలనిలేదులెండి.

డైర : (ప్రాధేయపడ్తూ) శంకరబాబు! – ఏదో విధంగా ఈ అంకం పూర్తిచేసి నన్ను కాపాడండి!-ఇదంతా ఎందుకో అయోమయంగా ఉంది.

శం : ............

సబ్ : ఏమిటీ ఆలస్యం?

డైర : శంకర బాబు!

రాజు : [పాట]-

ఆర్భాటపు ఆటుపోటు,
అటూ ఇటూ వెళ్ళేదెటు?

[ఈ ఆఖరు చరణం 'అటూ ఇటూ వెళ్ళేదెటు' పలుమారు పోనుపోను త్వర త్వరగా పాడటం మూలాన, అప్పటప్పటికే ఒక మానసిక స్థితిలో ఉన్న శంకరబాబులో మరింత సంచలనం కలిగిస్తుంది. అతని కేమీఅర్థంకాదు. పాట చరణం సాగుతూనే ఉంటుంది]

శం : (ఇక ఆపుకోలేక, అరుస్తూ)-ఆపండి!, ఆ పాట!

[అంటూ స్టేజిలోకి పరుగెత్తి రేడియో 'ఆఫ్' చేస్తాడు. రాజు వెంటనే పాట నిలిపేస్తాడు. సబ్ ఇన్‌స్పెక్టరుకు శంకరబాబు ఉన్నట్టుండి వెళ్లడం అనుకోకుండా జరిగింది. తను వెంటాడబోయే టప్పటికి అతన్ని డైరక్టరు వెనక్కులాగి బలవంతాన P దగ్గరనే ఒక కుర్చీలో కూర్చోబెడతాడు.]

రం : ఏమిటి బాబు! - ఆవేశంలో ఎక్కడికో వెళ్ళిపోతే దిగులుతో ప్రతిక్షణం యుగంగా గడిపా!

శం : అవును—(కూర్చుంటాడు.)

సబ్ : డైరక్టరుగారూ—

డైర : కాస్త కనికరించండి. ఇది కానియ్యండి, మా కోసం, మా ప్రాణం కోసం!

సబ్ : మాకు టైము లేదండీ!

డైర : ష్, చిన్నగా.

[సబ్ ఇన్స్పెక్టరు పళ్లు కొరుకుతాడు. అతను, ఇద్దరు పోలీసులు శంకరబాబు ప్రతి అడుగును తదేకదృష్టితో చూస్తుంటారు.]

డైర : [నాటకం పుస్తకం త్వరగా తీసి, అందిస్తూ] బాబు, జరిగిపోయింది—

రంగ (అందుకొని) - బాబు - జరిగిపోయింది ఏదో జరిగిపోయింది, మళ్ళీ-

డైర దాన్ని జ్ఞప్తికి—

రంగ దాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని కుమిలిపొమ్మని ఏ శాస్త్రం చెప్పింది?

డైర అవును

శం అ-వు-ను!

డైర నువ్వు-చెప్పింది నిజం.

శం నిజం! - అనమంటావా

డైర (దిగ్భ్రమతోంది చూస్తాడు)

శం ఏం?-"అవును, నిజం" అనమంటావా?

రం (ఏం చెప్పాలో అర్థంకాక) అ. హా నువ్వే నేరమూ చెయ్యలేదనుకో.

శం చేసి చెయ్యలేదని ఎలా అనుకోమంటావు? అంతా గాలిమాటలు. చేసింది జ్ఞప్తికి తెచ్చుకొని కుమిలిపొమ్మని ఏ శాస్త్రం చెప్పిందని అడిగావు. అడిగావా? కుమిలిపోకుండా చెయ్యటానికి ఏకైకమార్గం ఏ శాస్త్రం చెప్పింది?

[డైరెక్టరుకు పూర్తిగా అర్థమైపోయింది. శంకరబాబు తన కిచ్చువచ్చినట్టు మాట్లాడు తున్నాడని తెలుసుకొని, పుస్తకం మూసి, అంతా మంచిగా కానీ అని కోరుతూ ఊరకే ఆతురతతో నిలబడతాడు.]

శం మరచిపోదాం అనుకున్నా లాభం లేదు. కానీ ప్రయత్నం మీద కొంత మరచిపోయినా ఈ రోజు మళ్ళీ నా నేరం నా కళ్లముందు బాకుల్లా వచ్చి నిలబడ్డాయి. నేరం చెయ్యలేదనుకొని సంతోషపడ్డా మను కున్న "నన్ను" నేరస్థుణ్ని చేసారు—

రంగ : ఆ!

శం : చేసిన హత్య చేసాను. మరచి పొమ్మంటావా? గతించింది జ్ఞాపకం తెచ్చుకొని చేసిందానికి చింతిస్తే అదొక ఆనందం! అదొక తృప్తి! పరితపించడం శాంతించడం కోసం. అందుకే పరితపిస్తున్నాను. శాంతి దొరుకుతుందని, శా-ం-తి—

[చిన్నగా డ్రాయరు దగ్గరకు వెళ్ళి కత్తి తీస్తాడు. సబ్ ఇన్స్పెక్టరుకు దిగులు పుడు తుంది. డైరెక్టరు భయాన్ని అణుచుకోటా నికి ప్రయత్నిస్తాడు.]

శం : ఇదుగో, దీన్ని చూచినప్పుడల్లా ఇందులో క్షణానికి ఒక ప్రతిబింబం అపపడుతుంది. భ్రమ అంటావా? నేచెప్పేదంతా నాటకం లోని మాస్టరుగా వున్నదంటావా? అయితే నీ కర్థంకాలేదు. నాలో రేగుతున్న భావా లలాంటివి. ఆఖరుసారి అవి ఇక్కడ చెబు దాం అనుకున్నా.

రం : బాబు!

శం : అవును—విను. (రంగయ్య లేవబోతూంటే) కూర్చో, ఎవ్వరూ లేవనక్కరలేదు. శాంతి కోసం, నా మనశ్శాంతి కోసం! నేను చెప్ప వలసిన మాటలు సంతోషంగా నే వినవచ్చు. (ఆగి) ఆరోజు శాంతి ఏకాంతంగా కూర్చుని ఉంది. అప్పటిదాకా నాకు శాంతిమీద అసూయ ఉందనే సంగతి నాకు తెలీదు. అసలు అందరి ఉద్దేశ్యం తెలుసా? నేను శాంతిని హత్యచేసింది అనుమానంతో అని అందరి అభిప్రాయం. "అనుమానంతో- ఛీ! ఛీ! అనుమానం, ధనాపేక్ష, స్వలాభం- ఇలాంటి కారణాలకు హత్యలు చేసేవాళ్ళు క్షుద్రులు!—అది విజ్ఞాన సంపన్నులు,— 'ఇంటలెక్చ్యువల్సు'- చెయ్యవలసిన హత్య కాదు!—(విషాదంగా) ఈ భావాలు అప్ప టివి! ఇప్పటివి కాదు!—నేను 'సైకో' గా

కోసం, సంఘంకోసం ఎలాంటి మాటలాడుతున్నప్పటికీ — నా హృదయాంతరంలో ఉన్న ఆవేశం వేరు. పైకి స్త్రీకి సమాన హక్కులు ఉండాలన్నా, లోపల మాత్రం నాకు కావలసింది నాకన్న మేధాశక్తిలో ప్రతిభలో తక్కువై నేనే ఎక్కువ అని నాకు తృప్తి కలిగించే స్త్రీ! నీతినియమాలను గురించి బాహ్యంగా నేను ఎన్ని స్వచ్ఛమైన విప్లవభావాలను వెల్లడించినా, మనస్సులో దాక్కున్నవన్నీ పుచ్చిపోయిన పాత ఉద్దేశ్యాలే. ఒక్క ముక్కలో-పైకి మేధావిలా అగుపడాలన్నా, లోపల అజ్ఞానంతో నిండిన బూటక వ్యాపారస్తుణ్ణి. ఈ సంగతి ఇప్పుడు తెలుసు కానీ- అప్పుడు — కాంతికి ఉన్న స్వేచ్ఛ, కాంతి విజ్ఞానం, కాంతి చూపిన అధికారం, కాంతి అందుకున్న శిఖరం— చూస్తూ, దాన్ని చూసి మురిసిపోవడం పోనిచ్చి, అసూయపడ్డా. ప్రక్కనే నా చిన్న ఆకారం అద్దంలో చూచుకున్నట్టు కనబడేటప్పటికి కృంగిపోయా. గాయపడ్డా. మనస్సులో ఎక్కడలేని రోషం వచ్చింది!

మానవనైజం!— నేను తక్కువ, కాంతి ఎక్కువ అని చెప్పుకోటానికి నోరు ఆడలేదు, మనస్సురాలేదు-సరికదా!-నాదే అగ్రస్థానం అనిపించాలని-ఆవేశం నాలో నిండింది. నాలో చెలరేగే ఈ ఆటు పోటు లేవీ కాంతికి తెలియవు!

[సబ్ ఇన్స్పెక్టరు ఎందుకో చిరునవ్వు నవ్వాడు]

నాకు కాంతిమీద ప్రబలద్వేషం బయలుదేరింది. దాంతో కాంతి అంటే భయం!— అందుమీద నేను జీవించాలంటే కాంతి ఉండకూడదనే చెప్పరాని మనోవికారం. ఆ రోజు కాంతి పదింతలు భయానకంగా అగుపడింది. ఎందుకో, చెప్పలేను. అది నా మనోవికారం కావచ్చు. కాని అలా అగుపడింది సత్యం. ఆఖరుకు అడగవలసిన ప్రశ్న కాంతిని అడిగాను. "నీకు జీవించాలని ఇష్టం ఉందా?" అని. పెద్ద ప్రశ్న!-(ఆగి) ఏం చెప్తుంది?- "ఉండకపోతే మనవులమా?—కిరాతులం" అంది. ఆ!—నా ప్రశ్నతో నన్నే సుడిగుండంలో తోసింది. హృదయాంతరంలో కూరుకున్న రోషం ఒక్కసారి పైకి ఉబికి నా కళ్లు తిరిగినై.

ఆతరువాత ఏమైందో నాకు తెలీదు. అంతా తెరకప్పినట్టుగా తోచింది. ఏదో ఒక గద్గద స్వరం...ఏదో అరుపు, ఏదో ఆపలేని సంచలనం తేరుకొని కళ్లుతెరచి చూచే టప్పటికి నా ముందు కాంతిలేదు. కాంతికి బదులు,ప్రజ్ఞ, మేధాశక్తి—అధికారంగల కాంతికిబదులు- స్వాతంత్ర్యంపోయి, శక్తిలేక నిర్జీవంగా పడున్న కాంతి భౌతికదేహం నేలమీద పడుంది. కాంతి!- కాంతి!!

[సోఫామీద కూలబడ్డాడు. సబ్ ఇన్స్పెక్టరు ఒక్క అడుగు ముందుకు వేస్తాడు. కాని డైరక్టరు అతన్ని వెనక్కు లాగుతాడు.]

శం : అదీ నే చేసిన తప్పు. అంతా మరచిపోదాం అనుకున్నా. కాంతిని మరచిపోయి కాంతి సంపాదించడం! ఎలా సాధ్యం? ఇప్పుడు నా భావాలు వేరు!-మనిషిని మారాను. అనుభవం సంపాదించి విజ్ఞానం కన్న ముఖ్యమైన జ్ఞానంవల్ల తప్పును మనస్సులో అంతర్భాగానికి నెట్టి మంచిగా జీవిస్తున్నా. కానీ—

రం : కానీ—

రం : కానీ—చెడుగా ఉన్నప్పుడు నేరస్తుణ్ణి పట్టుకొని బాగు చెయ్యలేని పోలీసులు బాగుపడ్డ తరువాత పట్టుకోటానికి వచ్చారు! [సబ్ ఇన్స్పెక్టరు కళ్లెఱ్ఱ చేస్తాడు] బయటనే ఉన్నారు! నేనిప్పుడు బాగుపడ్డానంటే ఒప్పుకోరు. నన్ను ఖైదుచేసి మళ్ళీ రాతిగుండె వాణ్ణిగా చెయ్యటమే వాళ్ళ ప్రస్తుత ధర్మం. లేదు,-మళ్ళీ దుర్మార్గానికి వెళ్ళలేను. తెలిసి-తెలిసి- వెళ్ళలేను. వెళ్ళను! జీవించి కాంతిని సంపాదించలేను. అందుకని— ఇక ఒకటే మార్గం, ఒక్కటే, ఒక్కటే—

రంగ : బాబూ!

శం : (కత్తిని ఝుళిపించి) నన్నెవ్వరూ అడ్డుపెట్టకండి!

రంగ : బాబూ!

శం : ఇది నాస్వాతంత్ర్యం. నాజీవితం! నాకోసం నా శాంతికోసం— శాంతి!— శాంతి!!

[రంగయ్య శంకరంబాబును గట్టిగా పట్టుకుంటాడు]

రంగ : వద్దు, వద్దు—

డైర : [భయం, ఆవేశంతో] ఆ!

శంక : వదలండి—

సబ్ : [డైరెక్టరును వదలించుకుని, ఆవేశంతో విజిల్ వేస్తూ]— ఆగండి;— ఆగండి!—

[స్టేజిలోకి దూకుతాడు: ఇద్దరు పోలీసులు కూడా దూకి పారిపోబోయే శంకర బాబును గట్టిగా పట్టుకుంటారు.]

శం : [విడిలించుకోవటానికి అన్నివిధాలా ప్రయత్నిస్తూ]—వదిలి పెట్టండి, నన్ను వదిలి పెట్టండి— నాశాంతి కోసం— నేను చేసే కార్యానికి; స్వాతంత్ర్యం ఇవ్వండి! స్వాతంత్ర్యం—నాకోసం!—

[శంకరబాబు అరుస్తుంటే ఇద్దరు పోలీసులు అతిన్ని పట్టుకొని R నుండి P కి, అక్కడ నుంచి T ద్వారా తీసుకొని వెళ్ళిపోతారు. పోలీసులు P చేరగానే డైరెక్టరు ఆవేశంతో చేసిన సంజ్ఞప్రకారం, రాజు $C_2$ అనే కర్టన్ వేసేస్తాడు. వెంటనే ఆవెనుకనుంచి ఉత్సాహపూరితంగా చప్పట్లువినిపించుతాయి. చప్పట్ల మధ్యలో "శంకరబాబు స్టేజిమీదకురావాలి" అనే అరుపులు వినబడతాయి. శంకరబాబు పోతూపోతూ ఈమాట విని విషాదంగా చిరునవ్వు నవ్వి వెళ్ళిపోతాడు.]

రాజు : [అర్థంకాక, డైరెక్టరుదగ్గరకు పరుగెట్టూ] డైరెక్టరుగారు! ఏమిటిదంతా! పోలీసులు—

డైర : అవును! శంకరబాబును అరెస్టుచేసారు.

రం : చూచారా?— పాపం!— జనం, ఇదంతా నాటకమే అనుకుంటున్నారు.

రాజు : అదేలా!

డైర : ఎందుకనుకోరూ?— పాపం! శంకరబాబు కథ, నాటకంలో తను వేసే పాత్రకథ అంతా ఒకటే అయింది. అందుకని శంకరబాబు తన కథ చెప్పినా,— అది నాటకానికీ, తనకు అంత్యఘట్టం అయింది. (ఆగి, ఆలోచించి) ఇప్పుడర్థం అయింది!

రాజు : ఏమిటి?

డైర : శంకరబాబు చెప్పిన అంతపెద్ద స్పీచ్— నాటకంలో వాస్తవికత అనిపించుకుంటుందా?— కానీ మనకు తెలుసుగా— అది అక్షరాలా వాస్తవమని!

రాజు : అవును, అయితే.

డైర : అయితే, ఇంతే!— మనకింకా నాటకంలో వాస్తవికత అంటే ఏమిటో అర్థకాలేదని!-

రాజు : ఏమిటో,—మరి జనం అద్భుతంగానటించిన శంకరబాబును—

రం : నటించిన!

రాజు : ఆ— శంకరబాబును చూడాలని గోలపెడుతున్నారు. ఏం చేద్దాం?

డైర : ఇంకా చప్పట్లు కొడ్తూనే ఉన్నారు. రాజు!— నిజం చెప్పక తప్పదు. ఈ సంగతి మైక్ లో చెప్తావా?

[రాజు తల ఊపి, చిన్నగా మైక్ దగ్గిరకు వెళ్ళి అంకం ప్రారంభంలో ఎలా నిలబడ్డాడో అదేవిధముగా నిలబడి మాటలాడుతాడు. లోపల నుంచి చప్పట్లు కొట్తూనే ఉన్నారు.]

రాజు : మహాశయులారా— [ఇంకా చప్పట్లు]— మ-హా-శ-యు-లా-రా [చప్పట్లు తగ్గిపోతాయి] ఒక చిన్న మనవి! ఈరోజు అంత్యఘట్టంలో—[వాక్యం మొదలుపెట్టేటప్పటికి ముందు తెర లాగబడి, రాజు మాట్లాడుతుంటే మెల్లిదిగా మూసుకుంటుంది.]

# ఉలూచి: వరూధిని

శ్రీమతి వి. రాజేశ్వరి

మన ప్రబంధ నాయికలలో కలభాషిణిని విడిచి చూచినచో జడత్వ స్పర్శలేని కదలికగల యువతులలో చెప్పుకోదగినవారు ఉలూచీ వరూధినులు మాత్రమే అని సాహసించి చెప్పవచ్చును. ఇద్దరికిద్దరు ముగ్ధమోహన మూర్తులు. తరతమ పరీక్షకు గడగినచో ఈ యిరువురిలో నెవరు మిన్నయో ఎంచి చెప్పుట కష్టము. వారు శృంగారమున కెంతి పరసీమలో ఆదర్శ ప్రణయమున కంత అధిదేవతలు. శృంగారమునకును, ప్రణయమునకును కొంత భేదమున్నది. కాని శృంగారము లేనిదే ప్రణయముండదు. ప్రణయమున శృంగారముండును. ఒకవేళ ప్రణయరహితమైనే శృంగారమున్నచో అది కామోద్రేకమే యనిపించుకొనును గాని శృంగారమనిపించుకొనదు. అట్లయిన ఆ రెండిటికి భేదమేమని యడుగవచ్చును. శారీరకమైన వాంఛలో నెక్కువపాలు శృంగారమునను, హృదయగ్రంథుల స్పందనములలో నెక్కువపాలు ప్రణయమునను అధికము. అట్లని శృంగారములో హృదయ స్పందనమే యుండదనిగాని, ప్రణయములో శారీరక వాంఛ అసలే లేదనిగాని అర్థము సేయరాదు. ఇట్టిచోట్ల అన్యతర ప్రాధాన్యమునుబట్టి విషయ నిర్ణయము జరుగును.

ఉలూచీ వరూధినులకు కావలసినంత భేదమున్నను ఏదియో అవ్యక్తమగు సామ్యరేఖయు భాసిల్లకమానదు. అది కొంతవరకు మాత్రమే.

ఇద్దరును 'తనంత తావలచి వచ్చిన' వారి వర్గమునకు చెందినవారే. వరూధిని తనప్రౌఢిని తాగుర్తింపలేని ముద్దరాలు. ఉలూచి ప్రౌఢ భావాచ్ఛాదితయైన ముగ్ధ. ఆమె నాగవాసపు నాగరికత లెరిగిన వాకమృగీనేత్ర. ఈమె నాగలోకపు నాజూకుల మేల్బంతి. వరూధిని గానము రహిపుట్ట రాల్గరగించునది. ఉలూచి స్వర్గాధి దేవత. ఆమె సౌందర్య రసపిపాసిని. ఈమె సౌందర్యరసాస్వాదిని.

వరూధిని తలవని తలంపుగా ప్రవరుని చూచినది. ఉలూచి తలచి తలచి క్రీడిని తటాలున చూచినది. ఏమైననేమి ఆకస్మికమైన ప్రియాగమనములు ఇరువురకును అచ్చెరువు పుట్టించు ఘట్టములే.

అబ్బురపాటుతో నయనాంబుజములు వికసిల్ల కోరిక లుప్పతిల్ల మకరాంక శశాంకమనోజ్ఞమూర్తిని ప్రవరునిచూచి జయంత వసంతులతో సరితూచుకొనినది వరూధిని. రాచకీవికల రాజశేఖరుని జూచి రసోచితముగ తలయూచినది ఉలూచి. వరూధిని చూచిన రూపమును హృదయమున చిత్రించుకొనినది. ఉలూచి చిత్రించుకొనిన రూపమును చూచి మురిసినది. "ఏలని బంటుగా మరుం డక్కఁ గొనంగరాదె యకటా!" అని యామె యువ్విళ్లూరినది. అకటా నన్నితడేలుకొనునా యని ఉలూచి సందేహించినది. ఆ భావనలో బాహిరముగ నెంత సామ్యమున్నదో ఆంతరముగ నంత భేదమున్నది.

వరూధినికి ప్రవరునిపై దృఢమైన నమ్మకము. అసలామెకు నాయకునిపై మొదట సందేహమే లేదు. తన్నేలుకొనక మానడనుకొన్నది. అంత నిబ్బరపడినది కావుననే సిగ్గుచే ఝళంఝళత్కటక సూచిత వేగపదారవిందయై పూచిన పోకమ్రానుకడ నాజూకుగ నొత్తిగిలి దాగుకొనినది, ప్రియుడు పలుకరింపక పోవడను నమ్మకముతో. కాని అతడట్లు పలుకరింపలేదు, సరిగదా "పురంబుజేర తెరువెద్ది......శుభంబు నీకగున్" అనినాడు. సరసతా శూన్యమైన ఆ మాటలో వరూధిని లేని భావము నూహించుకొనినది. 'అంత మనోహరాంగుడెంతయో కోమల హృదయుడై యుండవలయును, ఈ తెరువడుగుటలో బహుశః "అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని" యేదైన నున్నదేమో అనుకొని కాబోలు 'ఏకాంతమునందు నున్న జవరాండ్రను ఏదో యొక నెపంబిడి పలుకరించుటగాని లేనిచో వచ్చిన త్రోవ

తెలియకపోదు.' అన్నది. బెండువంటి ఆతని మాటకు పండువంటి సమాధానమది. ఏమైన నేమి కడకది దివాంధమునకు వెలుగైనది.

'ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు?' ఎంత అందమైన కన్నులు అనలేక వ్యాజస్తుతిగా రూపమును మెచ్చితి నన్నది. తెరువెవ్వరి వేడెదు (నిరుపహతి స్థలమున) ఎవ్వరును తెరువు చెప్పువారు లేరు. నీకు తెరువు చెప్పి (నేను కాదు) ఎవరైనను చేతులార బయటికి పంపుకొందురా యనుభావము ధ్వన్యాత్మకము.

ఇల్లు-ఇల్లాలు-అగ్నులు-సమిధలు అరణులు ఏమేమియో ఏ కరువు పెట్టినాడు భూసురోత్తముడు. ఆ మాటలు విన్న వరూధిని యాశాసౌధము సగమునకు పయిగా కూలిపోయినది. పోవుటయేల ? ఈ రత్నకందరములు, ఈ లతానికుంజములు, ఈ నందన చందనోత్కరము సరిరాకపోయెనా ? అని యుద్దీపనాదులను భంగ్యంతరముగా పరికింపుచున్నది ఆలంబనములో లోపము నెరుగని అమాయికురాలు. కొంతసేపటికి విషయ మవగతమైనది. పూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకువలె ఎందుల కబ్బ! ఈతని కింత చక్కదనము అని ఆ రూపము అస్థాన పతితమైనట్లు చింతించినది.

వాదన వేదాంతమునకు త్రోవదీసినది. మీసాలపై తేనియలనినా డాతడు—'ఆనందో బ్రహ్మ' అన్నదామె. ఇటు ప్రాంచద్భూషణములలో పొంగారిన తనువుజాడ—అటు ఓరమోము. ఆమె అరమోడ్పుకను దోయిలో పారవశ్య విభ్రమము నందినది. అతడు కనులుమూసి 'హా! స్వాహావధూవల్లభా!' యని అదృశ్యుడైపోయినాడు.

ఊలూచి మొదటనుండియు నాయకుని శంకించుచునే యున్నది. కాని ఇప్పట్టిన క్రీడితీరే వేరు. మాట వరుసకు వ్రతమని వాదించినను వాదనలో బింకము సడలనీక ప్రియురాలి ఆ వేదనను కనులార చూచి మనసార ఆనందించినవాడు. అప్పటికే ఊలూచి చాల విన్నబోయినది. అంకి లెరిగిన ప్రియుడు రాచపాలుపు తోలుకొడ మదన తంత్రజ్ఞుడై అనునయించినాడు.

ఈ ఘట్టము ఊలూచి ఆనందమునకు ఎత్తిన పతాక. ఆ ఘట్టము వరూధిని దుఃఖమునకు దింపిన గాలము, ఈ స్థితిలో ఊలూచీ వరూధినుల కేటి సామ్యము? ఆమె సానందబాష్ప. ఈమె నిరాశాందోళితబాష్ప. ఆమె సవరించుకొనిన వీణపలికినది. ఈమె అమర్చుకొన్న వీణతంతువు బిగిసి తెగినది. ఆ నాదము పంచమము, ఈ నాదము సప్తమము. ఊలూచి బ్రతుకు అందుకొన్న ఆరని నీరాజనము. వరూధిని బ్రతుకు శూన్యగేహమున కత్తిన దీపిక. ఆమె నాగకాంత యయ్యు ఆనందములో నమరత్వము గాంచినది. ఈమె దేవకాంతయయ్యు దుఃఖములో మర్త్యభామలనే మెచ్చుకొనినది. ఇంత యేల, ఊలూచి చావులేని బ్రతుకు కోరినది. వరూధిని చావులేక బ్రతికినది. ఇంతవరకే ఆ యిరువురి నాయికలకు భిన్నత్వములో నేకత్వము. తరువాత నాయా ఘట్టముల ఎత్తుగడలు ఉత్తర దక్షిణ ధ్రువములు

కవితాపితామహుడు నిజముగ నార్షకవి. ఆముష్మికమునకు అడ్డులేని ఐహిక చింతనము కలవాడు. ఆర్షకవు లనగా కేవలము ఋషి కవులనియే కాదు. ఆ సంప్రదాయము ననుసరించినవారందరు ఆర్షకవులే యగుదురు. చేమకూర లౌకిక కవి. అనుభవ శృంగార రసాస్వాదకులైన నాయకరాజుల భావములను పుడికిపుచ్చుకొన్నవాడు. కవిత్వమందు ఆర్షత్వ లౌకికత్వములపట్ల కవికుల గురువగు కాళిదాసునకును రాజ కవియగు నన్నెచోడునకును ఏ వ్యత్యాసమున్నదో కవితా పితామహునకును చేమకూరకవికిని ఆ వ్యత్యాసమే యున్నది.

పెద్దన్న పేరు కృష్ణరాయల కీర్తిధ్వజమునకు పెట్టిన కల్యాణ కింకిణి. చేమకూర కవిత్వము రఘునాథుని సభాంగణమున విజృంభించిన సరస్వతీ మధుర మంజీర శింజితము. అల్లసానివారి కవిత్వము రాయల మాత్రిక రహస్య సందేశము నందుకొన్నచో చేమకూర కవిత్వము క్షీణయుగపు చిహ్నములను కొంతలోకొంత వరకు అరికట్టగల్గిన శ్రీరామ రక్ష.

మను చరిత్రమున మాయాప్రవరుని మాట మనకు వద్దు. ఇంతకు ఎటనో చివరతప్ప వరూధినికి మాత్ర మాతడు నిజమైనవాడే.

స్వారోచిష మనుసంభవములో అననురూపములైనవాటికి సంఘటనము ఘటించి అందేది జయించునా యను నాతురత రేకెత్తించినాడు కవి. ఔత్సుక్యము అద్భుతముగ పోషింపబడినది. బలీయములైన

శాంత శృంగారములకు నేర్పడిన వైరుధ్యము అద్దానికి ఆటపట్టు. శాంతము రసమగునా యను నాలంకారిక ప్రకాండుల ఓగాములను అటుంచి అద్దానిని రసశ్రేణిలో చేర్చి చూచినచో నిజమునకు శృంగారములో శాంత రసమునకు వైరుధ్యమే కన్పట్టదు. అట్లని వానికి జన్య జనక సంబంధమును లేదు. కాని ఒక రసమునకు వేరొకటి ప్రతిద్వంద్విగ కోరి నిలుపుటచేత విరోధము భాసిల్లి ఆ వైరుధ్యపు బంధము బిగిసిపోయినది. ఆ పోరాటమునకు వరూధినీ ప్రవరులు కథానాయికా నాయకులు. అజరామర శృంగార వాహినియైన నిర్జర వనువును శృంగారమునకై ఏర్చి కూర్చుకొనినాడు కవి. పుడమి వేల్పులను నింగికి నెత్తగల్గు పరమ నిష్ఠాగరిష్ఠుడైన భూసురోత్తమునకు శాంతరసరూపము నిచ్చి శృంగారమునకు ప్రతిద్వంద్విగ నిలిపినాడు. ఆ నాయికా నాయకులలో నొకరికొక్క దీర్చి యొకరిని విడచుట ధర్మముగాదు. కాంక్షించుట వరూధిని కెంత సహజమో కాదనుట ప్రవరునకు అంత ధర్మము. ఆమె రసైక జీవన. అతడు ధర్మైకబద్ధుడు. ఒప్పించినగాని నాయికకు తృప్తిలేదు, తప్పించినగాని నాయకునకు ముక్తిలేదు. ఇది గ్రంథపు ఎత్తుగడలోనే ఇమిడిపోయిన గడ్డు సమస్య. తత్పరిష్కారముపట్ల రసాంతరముచే రసమును కథాంతరముచే కథను పొడిగించి వైరుధ్యమును తొలగించినాడు కవి. కావుననే కావ్యము స్వయం సంపూర్ణమైనది.

విజయవిలాసము అట్టి సమస్యలకు తావీయలేదు. అంగిరసమగు శృంగారము సహజముగపొంగి మూడు పాయలై (ముగ్వురు నాయికలు) ఒడిదుడుకులు లేని లోయలలో నిమ్నాభిముఖముగ ప్రవహించినది. వీరాగ్రేసరుడైన నాయకుడు శృంగారమునకు ఓటమిపాటు ఎరుగనివాడే. మర్త్యభామినుల విలాసవైఖరులు, దేవకాంతల శోభన కాంతి వైభవములు నాగకాంతల నాజూకులు తమకంబు పెల్లు దీపాడగ నాస్వాదించిన అతి రసికుడు. అట్లని స్త్రీలోలుడు గాదు. ఊర్వశినే ఒకప్పుడు కాదనినాడు. ఇప్పటున క్రీడినిగూర్చి ఒక్కమాటలో చెప్పవలయునన్న రసికత యందు అతని జ్ఞానము నాయికల శృంగార భంగిమల వైవిధ్యమును ఊచముట్టుగ గ్రహింప గల్గినదనవలయును. ఉలూచిని చూచిమాచి మోహించినాడు. చిత్రాంగదనుమాచి చలించినాడు. సుభద్రయందు లగ్నమనస్కుడై నిలిచిపోయినాడు. పాంచాలిని లాలించి పాలించుకొనినాడు.

వరూధినీ ప్రవరుల సమాగమోద్దేశము సామాన్యమయినది కాదు. ఘనమైన యొక ప్రయోజనాంతరము గలది. కవితాపితామహుడు నిర్మించిన కాంతాసమ్మితమగు నీరసగుళికకు పునాది బ్రహ్మాండమైన ధర్మప్రబోధము. అంతియే గాదు; అయ్యది బ్రాహ్మణ తేజముచే పునీతమై దేవతా స్పర్శవలన యుగయుగములకు ధ్రువతారగా నిలచిపోయిన ధర్మశాస్త్రకర్త మనువు జననమునకు ఆకరమైనది. ప్రవరుడు మాయాప్రవరుడందురేమో. శిశువులు నూటికి డెబ్బది పాళ్ళు మాతృభావననే పుణికి పుచ్చుకొందురని పెద్దలందురు. ఆదృష్టితో చూచినచో నాటి వరూధిని హృదయమును పాలించువాడు వివిధాధ్వరనిర్మల ధర్మకర్త, భాషాపరశేషభోగి, అంబురుహగర్భకులాభరణుడు అగు ప్రవరాఖ్యుడే. ఇక మిగిలిన ముప్పది పాళ్ళకు పోనిమ్ము ప్రవరాఖ్యునే ఎత్తుకొందము. అతడు మాత్రము సామాన్యుడా! ఆమూర్తి ప్రవరుని ఆభాసమే. జన్మచే గాంధర్వాంశ నిండుగ గలవాడు. వరూధినియందు పరిపూర్ణానురక్తుడైయున్నవాడు. శాంబరీవరప్రసాదోపజీవి. ఈశక్తులన్నిటి సమాహార రూపమే మనువు.

ఉలూచీధనంజయుల సమాగమోద్దేశ మట్టిది గాదు. అందు రసికులైన నాయికా నాయకులకు హఠాత్సంఘటనము. నాయిక యుబలాటమునకు వన్నె దెచ్చు నాయకుని మురిపెము మాత్రమే యిందు చెప్పకోదగ్గది. తత్ఫలితముగాజన్మించిన ఇలావంతుడు ఉండవలసినవాడేగాని యుండకతీరనివాడు కాదు.

# విశ్వదాత సంస్మృతి

శ్రీ సి. నారాయణ రెడ్డి

ఓ విశ్వదాత! ఒహో యశస్స్నాత! నీ
అమృతస్మృతికి అక్షరాంజలి నివేదింతు.

నిన్నగాక మొన్న మొల్చిన నేను నీ చిరం
తనమూర్తినే వృత్తమున గాన మొనరింతు.

నేడు హాసియించి మర్నాడు వాడెడు మల్లె
పూలు నీ శాశ్వత యశోలాంఛనములవున ?

కాల్జారి పడినట్టి గగనఝరి నీ మహో
న్నతకీర్తిమూర్తికే గతిని ఉపమానమగు!

గాలితాకిడికి గగ్గోలువడు తెలిమబ్బు
తున్క నీ స్థిరకీర్తితో నెటుల తులదూగు.

ఒకమారు నీ కళాత్మక ముఖము కన్పింప
కలుష హృదయమ్మైన కలశాబ్ధియైపోవు.

ఒకమారు ధ్యానముద్రికనున్న నిన్నెన్న
లఘు చిత్తమైన కైలాసగిరియైపోవు.

కలుషిత జగత్తులో కాలూని ఆత్మను శి
వాంకితము చేసితివి పంకాన పద్మమటు.

నీవు మణిముకురమవు! నీలోన మా తెన్గు
సాహితికి ఆత్మదర్శనము కల్గినదయ్యా!

## విశ్వదాత సంస్మృతి

నీ మొముక లేనట్టిచేయి ఎందరో నర
స్వతుల దరిజేర్చి శ్రీయుతుల చేసినదయ్యా!

ప్రాపంచికవిభూతితో బాటు సచ్చిదా
నందానుభూతి పెంపొందజేసిన మునివి!

ఒకవంక నిగమసమ్ముఖుడవై వేర్వంక
ఉప్పుసత్యాగ్రహపుటుద్యమము నడిపితివి.

సతతలింగార్చనా సంతృప్తు డవుగాక
నరుడె పరమేశుడని హరిజనుల చేరితివి!

ఎట నుంటివో నేడు ఎటనుందు వో శివా
నందలహరీ ఖేలన మరాళరాజమవు!

ఏమందువో నేడు ఏమందు వోంకార
మంజుల క్రేంకారమయమయూరమవీవు!

# చాళుక్యులనాటి ఆంధ్రదేశము

శ్రీ కొత్త భావయ్యచౌదరి

వేంగిరాజ్యమని పిలువబడుచున్న ఆంధ్రదేశభాగము చాళుక్య రాజులలోని రెండవ పులకేశి క్రిందకు క్రీ. శ. 618 ప్రాంతమున వచ్చియుండెను. * ఈతని తమ్ముడగు కుబ్జవిష్ణువర్ధనుడే దీనికి పాలకుడయ్యెను. అప్పటివరకు పాలించుచు వచ్చిన విష్ణుకుండిరాజు విక్రమేంద్రుడు హిందూమతాభిమానియై, బౌద్ధమతమును దేశములో క్షీణింపజేసినను, హుయాన్‌త్సాంగ్ వచ్చువరకును అది కొంతవరకు వ్యాపించియుండెను. ధాన్యకటకము మున్నగుచోట్లనున్న బౌద్ధచైత్యములను స్వాధీనపరచుకొని బ్రాహ్మణులచటనే అమరేశ్వరాలయమును నిర్మించిరి. బౌద్ధశిల్పము లన్నియు పైకి కానరాకుండ ప్రతిచోటను పూడ్చివేయుచుండిరి. ఆ కాలములో భూమినివర్తనాలను పేరిటవిభజింపబడుచుండెను. రెండవపులకేశి వేంగిదేశమున వేంగిరాష్ట్రము, కర్మరాష్ట్రము మొదలగు రాష్ట్ర విభజనను మామూలుగానే నిలిపెను. ఈ వంశీయులు పరమభాగవతులమనియు, పరమ బ్రహ్మణ్యులమనియు, కౌశికీవరప్రసాదులమనియు మహాసేన భక్తులమనియు మాతృపితృ పాదారవిందధ్యానులమనియు చెప్పుకొనిరి. పులకేశి ఇర్బులియనుచోట వేదశర్మయను బ్రాహ్మణునికి 8 వందల నివర్తనాల భూమినిచ్చి తామ్రశాసనము వ్రాయించెను.

ఆ కాలములో బ్రాహ్మణమతములో ననేక యజ్ఞయాగములు రాజులు, బ్రాహ్మణులు చేయు పద్ధతి యమలునకు వచ్చెను. గుప్తరాజులు 4 వ శతాబ్దిని పాలించు కాలమునుండి యుత్తరదేశమున నివి వృద్ధియయ్యెను. 3 వ శతాబ్దిని యిక్ష్వాకువంశరాజులు కమ్మరాష్ట్రములో పాలించుచున్నప్పటినుండి యివి ఆంధ్రదేశమున జరుపబడుచు వచ్చెను. కుబ్జవిష్ణువర్ధనుడు దిగ్విజయ సూచకముగా నొక అశ్వమేధయాగము గూడ కావించెనట. ఇతడు గ్రహణములు మొదలగు పర్వదినములలో వేదశాస్త్రములు నేర్చిన బ్రాహ్మణులకు చాల మందికి భూములనిచ్చెను. ఇతని భార్య అయ్యన మహాదేవి జైనమతమునందు విశ్వాసముగల దగుటవల్ల ఆమె విజయవాడలో "విజయవాడ నడుంబ వసతి" యనుపేరుగల జినాలయము నిర్మించెను. ఈ కాలములో యుద్ధము లనివార్యములయ్యెను. రాష్ట్రములందు సీమలు, నాడులు, విషయములు మొదలగు విభాగములుండి వాని వానికి వేర్వేరు అధిపతు లుండెడి వారు. యుద్ధములందోడిపోయిన రాజుల సుందర కన్యలను తీసుకొనివచ్చి విజేతలగు రాజులు వివాహమాడు నాచారముండెను. జయసింహుడు త్రికళింగములోని కనకమేఖలయను కన్యనట్లే తెచ్చి పరిణయమయ్యెను. సంస్కృతిభాషయే నాడు రాజభాషగా నుండెను. వేదములు నేర్పుటకు ఘటికాస్థానములప్పటినుండి యేర్పాటు చేయబడుచుండెను. తర్కము మున్నగు శాస్త్రములందారి తేరిన విద్వాంసులు జయసింహుని కాలములో (636-69) నుండెడివారు. అట్టి శాస్త్రజ్ఞులకు, వేదాధ్యయన పరులకు నీతడు భూముల నిచ్చి యా విద్యలను చక్కగా పోషించుచు వచ్చెను. ఈ కాలమునుండి క్రమముగా తెలుగు భాషకూడ రాజశాసనములలో నమలునకు వచ్చెను. దానితోపాటు దేశి కవితయు నేర్పడెను. దీనిలో తరువోజలు, సీసములు, గీతములు, రగడలు మున్నగునవి కలవు. బోయలను పేరు ధరించిన బ్రాహ్మణులప్పుడు ప్రసిద్ధులైయుండిరి. వారు గూడ వేద శాస్త్రముల నేర్చిన వారలే. రెండవవిష్ణువర్ధనుడిట్టి వారికగ్రహారము లిచ్చెను. ఆకాలములో గూడ టంకసాల లేర్పడెను. అందులో నాణెములు వేయుచు వచ్చిరి. ఈకాలము 669-78 మధ్యనై యుండెను. బోయ బ్రాహ్మణులు 700 A. D. వరకు ప్రసిద్ధులుగానే యుండిరి. బ్రాహ్మణభక్తి క్రమముగా రాజులయందు హెచ్చయ్యెను. దానితోబాటు రాజులకు కీర్తియందు కాంక్షగూడ పెంపొందెను. అందుచేత మూడవ విష్ణువర్ధనుని కాలములో బంగారు నాణెములతో తులాభారము దూగి బ్రాహ్మణులకు పంచిపెట్టు పద్ధతి వచ్చెను. ఆకాలములో నిష్కములు, గద్యాణములు అనే నాణెములుండేవి. వాని నే తులాభారములందు తూచెడి వారు. 8 వ శతాబ్దినిగూడ జైన దేవాలయములను రాజులు సకృతుగా పోషించుచు

* ఈ వ్యాసమున 11వ శతాబ్దివరకు మాత్రమే విషయపరిశీలన జరిగినది.

వచ్చిరి. ఏనను వర్ణవ్యవస్థ క్రమముగా దృఢమై, జైన మతస్థులు తగ్గిపోసాగిరి. వైశ్యవర్ణములోని వాసవీకన్యను విష్ణువర్ధనుడు వివాహమాడగోరగా, దిరస్కరించుటయే గాక, వైశ్యులు రాజొనరించిన దండయాత్రకు నిలువలేక, ఇతరవర్ణములలో కలిసిపోయిరి. కమ్మవారిలోను, గొల్లలలోను హెచ్చుగా కలిసిపోయిరి. ఈ రాజ్యమున 8 వ శతాబ్దిని పన్నెండువేల గ్రామములుండెను. కాని 9 వ శతాబ్దిలో రణములు హెచ్చయ్యెను, ఒక్క నరేంద్రమృగరాజు కాలములోనే (807-47) 108 యుద్ధములు చేయబడెను. అందుననే రాజ్యముయొక్క శక్తి తగ్గెననవచ్చును. కాని ఆ కాలములోనే దేవాలయనిర్మాణములు హెచ్చయ్యెను. ఆరాజు 108 దేవళములు కట్టించెను. ఇవియన్నియు శైవాలయములే. ఈ శతాబ్దమునుండి దేశికవిత యను పేరిట తెలుగుకవిత్వ మభివృద్ధిజెందెను. జనులు ముఖ్యముగా ద్విజులు ఒక వర్ణమునుండి వేరొక వర్ణమునకు మారుటకు కాణ్వశతపథబ్రాహ్మణములో లోగడ అవకాశమేర్పరుపబడినది. కాని దానిని విస్తారముగా నుపయోగింపక, యేకులమువారు ఆకులములోనే స్థిరత్వమును పొందెడివారు. ఆపద్ధర్మములలో మాత్రమే తమ కులములను మార్పుచేసుకొనుచుండిరి. రాజులలో జ్యేష్ఠునుమాత్రమే రాజగు నాచారముండుటవల్ల, సోదరులు రాజ్యభాగములకొరకై తరచుగా యుద్ధములు కలిగించుచుండిరి. రాజుల కెక్కుడలేని గర్వము నుండెను. వీరిలో "త్రిభువనాంకుశుడు" మున్నగుబిరుదులు కొందరు ధరించెడివారు. యుద్ధములందీకాలములో మంచిమంచి యేనుగులు పాల్గొనేవి. వీనిని నడపుటలోను, యుద్ధముచేయుటలోను రాజులు ప్రత్యేక శిక్షణ నందుచుండిరి. అశ్వసైన్యములు గూడ ఆశతాబ్దిలో నుండెను. కలివిష్ణువర్ధనుకు (847-8) అశ్వసైన్య, మాతంగసైన్య పోరాటములందు మిక్కిలి శక్తి గలిగియుండెను. పురాణములలోని పరాక్రమవంతులగు రాజన్యులపేరిట రాజులు బిరుదులు ధరించుచు వచ్చిరి. యుద్ధములందు వైరి రాజుల పురములను తగుల బెట్టుట మామూలు ఆచారములలో నొకటి. బ్రాహ్మణులలో వేదశాస్త్ర పారంగతులకు అగ్రహారము లిచ్చుట, తులాభారములుతూగి పంచిపెట్టుట చాళుక్యరాజులలో వరుసగా 10 లేక 11 శతాబివరకును జరగుచుండెను. స్థలదుర్గ, గిరిదుర్గములే రాజుల రాజధానులుగా నుండెను. బోయరాజులు కొందరు 9 వ శతాబ్దిని గిరిదుర్గములందు వసించుచు వచ్చిరి. శైవమతములో భిక్షా మఠములు, వానిలో శైవాలయములు, అన్న సత్రములు నిర్మింపబడుచు వచ్చెను. శైవాలయములందు రాజులు తమ పేరను, తమ పూర్వుల పేళ్ళతోను లింగప్రతిష్ఠలు చేయుచు వచ్చిరి. రాజులు శాలివాహన శకమును తమ శాసనములలో వాడుచు వచ్చిరి. ఇది 6 వ శతాబ్దినుండియున్నను, సకృతుగా నుండెను. చనిపోయిన వారికి నిత్య శ్రాద్ధములు చేయు పద్ధతిగూడ నప్పుడుండెను. చాళుక్య భీమరాజు తన పుత్రునకట్లే చేయుచువచ్చెను.

10 వ శతాబ్దినుండి సేనాధిపతులకుగూడ గ్రామములను అగ్రహారములుగా రాజు లిచ్చుచు వచ్చిరి. మొదటి అమ్మరాజట్లే యొసంగెను. యుద్ధకాలములలో వారగోష్ఠులు జరుపుచు వచ్చిరి. ఇవి మహాజనములు చేసి వారి యభిప్రాయములు రాజున కెరిగించుచుండిరి. దేశరట్టోడి, దళవాయి, సేనాధిపతి, ప్రధాని లేక ప్రెగ్గడ మున్నగు ముఖ్య పదవులు రాజులవద్ద పనిచేయు వారిలో నుండెను. వారందరును రాజు చెప్పినటులే వర్తించువారు. రాజులు మహాజనుల తీర్మానములను తెలిసికొని, కర్తవ్యమును చేయువారు.

10వ శతాబ్దములో ఆంధ్రదేశమున జైన, శైవ మతములను రాజులు సమముగా పోషించుచుండిరి. రెండవ అమ్మరాజిటి (945-70) వారిలో నొకడు. ఈయన కాలములో కేవలవేదశాస్త్ర పారీణులగు బ్రాహ్మణులే కాక, కవి పండితులు గూడ పోషింపబడిరట. ఈయనకు "కవిగాయక కల్పతరువు" అను బిరుదుండుటవల్ల నితడు కవులనుమాత్రమే గాక, సంగీత విద్వాంసులనుగూడ ఆదరించి పోషించినట్లు కనబడుచున్నది. ఈ కాలములోనే భట్టదేవుడను కవి చక్రవర్తియుండి ప్రభుశాసనములను రచించుచు వచ్చెను. దేవాలయ నిర్మాణము, పోషణము యీ 10వ శతాబ్దిలో జరుగుచునేయుండెను. బంగారు నాణెములను రాజులు టంకసాలలయందు వేయించుటయేగాక వానిని విదేశములకు దిగుమతిచేసుకొన్న వస్తువుల మూల్యముక్రింద పంపుచు వచ్చిరి. శక్తివర్మ 1 (999-1011) బంగారు నాణెములు అరకాన్, సయామ్ దేశములందు లభించుటకు కారణమిదియే ననవచ్చును. పశ్చిమ చాళుక్యరాజులు కన్నడ మహారాష్ట్ర ప్రాంతీ

యులయ్యెను, వేంగీ దేశముపై కన్ను వేయుటయు, దక్షిణ చోళ రాజులును, రాష్ట్రకూట రాజులును, కళింగ గాంగరాజులును అదేవిధముగా నుండుటవల్ల, ఆంధ్ర దేశమున నిరంతరము యుద్ధ సన్నాహములు, యుద్ధములు చేయుట నిత్యకృత్యములైపోయెను. దీనికి తోడు ఇచటి దాయాదులగు రాజుల అంతః కలహములు వృద్ధియైన కాలములో పరరాజులకు సమయము చిక్కుచుండెను. 10, 11 శతాబ్దములలో నిట్టిపోరాటములు హెచ్చుగా కనబడుచున్నవి. అందుచే అభివృద్ధి కార్యములు తక్కువయ్యె నన వచ్చును.

రాజరాజనరేంద్రుడాంధ్రమున మహాభారతమును నన్నయభట్టారకునిచే వ్రాయించ నారంభించెను. ఇది 11 వ శతాబ్దిలో జరిగెను. ఆకాలమున అయిదారు భాషలు సాధారణముగా నేర్చిన పండితులుండెడివారు. నన్నయభట్టునకు మహాభారతము వ్రాయుటలో తోడ్పడిన నన్నివారాయణభట్టు అయిదు భాషలలో ప్రవీణుడు. నన్నయభట్టు ఎనిమిది భాషలందు సిద్ధహస్తుడు. ఇట్టి కవిచక్రవర్తుల కగ్రహారములిచ్చి రాజరాజు పోషించుచువచ్చెను. శాస్త్రవిద్య లభ్యసించెడివారికి దేవాలయములందు ప్రత్యేకముగా నుంచిన ధర్మసత్రములలో భోజనము లేర్పాటు చేయుచుండిరి. మఠములలోనే కేవాలయము లుండెడివి. అందువనే "సత్రములో భోజనము, మఠములో నిద్ర" యను లోకోక్తి విద్యార్థులకు ముఖ్యముగా నన్వయించును. గణితశాస్త్రము గూడ ఆ కాలమున వృద్ధినొందెను. పావులూరి మల్లన తన గణితశాస్త్ర మాశతాబ్దిలోనే రచించి, రాజరాజుచే భూములను బహూకృతిగా నందెను.

ఈశతాబ్దివరకు రాజులుగానే వర్ణమువారున్నను, వర్మశబ్దధారకులుగా నుండిరి. వారందరు క్షత్రియులందరితో వివాహములు బాహాటముగా చేయుచు వచ్చిరి. అనగా వృత్తివల్లనే వర్ణము చూచుచుండిరి. వేశ్యావృత్తి ప్రత్యేకముగానుండి క్రమముగా నది యొక కులముగా మారెను. బహుభార్యాత్వ పద్ధతి యుండెను. సంస్కృతభాషలో నుండిన ధర్మశాస్త్రములు, వేదాంత గ్రంథములు, నీతిశాస్త్రములు, మహాకావ్యములు, లక్షణగ్రంథములు, ఇతిహాసములు, పురాణములు మొదలగువానిని నేర్చిన యుద్దండులగువారు ఆంధ్రులలో ముఖ్యముగా బ్రాహ్మణులలో నుండిరి. అట్టివారు రాజులచే పోషింపబడుచు వచ్చిరి. ఇట్టివారు 11 వ శతాబ్దినాటికి చాలమంది యున్నారని చెప్పవచ్చును.

మూడవ విజయాదిత్యుని కాలము (848—91) నాటికే దేవాలయములకు ప్రాకారములు, అచట మఠములు నిర్మించు నాచారముండెను. తామ్రశాసనములను చక్కగా తయారుచేసి వానిమీద ఆకాలపు తెలుగు వేంగీలిపిలో సంస్కృతభాషను చెక్కగల మంచి శిల్పులుండెడివారు. రాజుల పట్టాభిషేకములు గొప్ప యుత్సవములతో చేయుచు, ఆకాలములో మంచి దానములను చేయుచువచ్చిరి. పట్వర్ధన వంశజులు, దుర్జయవంశజులు, బ్రాహ్మణులు, శబరులు, పల్లవులు, నాగులు, చోళులు మొదలగువారు సేనాధిపత్యము వహించుచు వచ్చిరి. లకులీశ్వర శాఖలోని కాలాముఖశైవమతమునకు సింహాగోపరిషత్తులుండేవి. అమరేశ్వరాలయమువంటి ముఖ్యస్థలములందివి యుండెడివి. జైనమతములో సంఘములు, గచ్ఛలు, గణములు అను శాఖలుండేవి. కార్పటివ్రతమును కొందరు చేయుచుండిరి ఇది త్రిరాత్రవ్రతము. శమదమాదిసద్గుణములతో నుండువారు చేయునది. కామధేను, కల్పవృక్షము, చింతామణి మున్నగు వానిపై విశ్వాసము రెండవ అమ్మరాజు కాలమునకే యుండెను. ఉత్తరాయణ సంక్రాంతి, గ్రహణములు మిక్కిలి యుత్తమకాలములని విశ్వసించి రాజులు బ్రహ్మణులకు దానములిచ్చుచుండిరి. పట్టుశేరాలు, పంచమహాశబ్దములు, బిరుదులు కత్తులు మొదలైనవి యుద్ధకాలములందు వాడేవారు. పట్టాభిషేకముల కాలములకు మంచిలగ్నములు జ్యోతిషశాస్త్రముప్రకారము నిర్ణయించుకొనేవారు. శైవమతస్థులు జైనమతములోనికిని, జైనులు శైవమతములోనికి మారుచుండెడివారు. అందుచే మతముల కన్యోన్య వైరము లుండెడివి. యాగము లొనర్చిన బ్రాహ్మణులు యూపస్తంభములు నిలిపేవారు. పండితులను భట్టారకులనియు, విజ్ఞానులను బ్రహ్మణ్యులనియు, శైవమతప్రముఖులను మాహేశ్వరులనియు, రాజశ్రేష్ఠులను రాజపరమేశ్వరులనియు, కవులు వర్ణించుచుండిరి. అష్టావశావధారణ చేయగల కవిచక్రవర్తులు 11 వ శతాబ్దిలో పేరొందిరి. సోమయాజి బిరుదమాకాలమువరకు యజ్ఞములు చేయువారే ధరించుచుండిరి. కాని పేరు సోమయాజులు కానరారు.

ధాన్యము కొల్తలోను, భూమి కొల్తయందును పుట్టి యనునది వాడుకలో నుండెను. 64 కళలు లేక విద్యలని ఆకాలమున నములులో నుండెను. ద్వివేదులు, త్రివేదులు, చతుర్వేదులు బ్రాహ్మణులలో నుండిరి. శిల్పులు ఆచార్యశబ్దవాచ్యులుగా నుండిరి. రాజులు భూదానములేగాక గో, హిరణ్యదానములను గూడ చేయుచువచ్చిరి. మొత్తముమీద చాళుక్య రాజుల కాలములో బ్రాహ్మణమతము, దేవాలయ నిర్మాణ కార్యము బాగుగ విజృంభించె ననవచ్చును.

# నాగనృత్యం

శ్రీ భాగవతుల సూర్యనారాయణశాస్త్రి

"'కన్నెపిల్ల మననూ వెన్నపూస సొగనూ కలిపి రంగరించిన సోయగంతో కలకాలం ఇల్లాలను కున్నాను. మాలిమిచేసి కూరిమిపొందే మనుగడ మాదైనా మనసుకలిసిన చోట మనువు నిలుపుకోవాలనుకున్నాను. పలకం వున్నానికి పూచిన చింతల్లే పుణ్యంపండిన పురుషుడితో ఒక్కముచ్చటలోనయినా మక్కువ తీరితే జీవితానికి చాలునని తలచేను. అందుకే మన్నేలే వాడు నన్నేలేవాడు కాకూడదని మీనాక్షీదేవికి మొక్కులిచ్చుకున్నాను. వరమిచ్చిన వేలుపల్లె వరదరాజ స్వామి ఆలయంలో కనుపించిన తమకి—నిండు సువాసినిని, పువ్వంటిపుని స్త్రీని, మన్నించాల్సిన మాన వతిని వెతలపాలుచేసిన పండంటి మారాజని తెలీక-మన సిచ్చుకున్నాను. కాని ఆ ఉత్తమయిల్లాలి ఉసురు తగిలితే జయంకలుగదు కదయ్యా! కనుక పోయి రండయ్యా! పుణ్యవతిని కలిసి వుండయ్యా! అంటూ ఆనాడు నాంచారి పలికిన పలుకులు ఈనాటికీ మరుక రానివి." అన్నాడు తాతయ్య.

నిజమే ఆపాటిపాటి యెరిగున్నవాళ్ళెవరూ నాంచారి రూపాన్నిగాని, నాంచారి పలికిన పలుకుల్నిగాని, నాంచారి సుగుణాల్నిగాని, ఎలా మరిచి పోగలరు! అనిపిస్తుంది నామట్టుకు నాకు.

కాని తాతయ్య కేవలం ఈ ఒక్కసారే అనడం కాదే! ఇంకా యిలా ఎన్నోసార్లు ఈ మాటలే అన్నాడు.

పోనీ తాతయ్య అలా అనడం ఎలాగూ సహజం అని సరిపెట్టుకుందామా అంటే, అవ్వకు కూడా నాంచారిని చూస్తే వల్లమాలిన గౌరవం, అభిమాన మూను. అందుచేత నాంచారినిగురించిన పూర్తి వివరాలేమిటో ఆ కథాకమామీషులు తెలుసుకోవాలను కున్నాను.

అయితే ఎవరినడిగి తెలుసుకోవడం? తాతయ్య నడుగుదామంటే, నా కతనిదగ్గర చెప్పరానంత భయం భక్తీ రెండూను. అందువల్ల ఎలాగూ ధైర్యం చాలదు. ఇక నాంచారినే అడుగుదా మనుకుంటే చెప్తుందో చెప్పదో అని అనుమానం. ఇలాంటప్పుడు ఏం చెయ్యాలి? ఎలాగైతేనేం అవ్వనడిగి తెలుసుకుందా మని నిశ్చయించి అవ్వదగ్గిరికి వెళ్లేను.

ఎడమకాలు ముడుచుకుని, ఎడమకాలి పాదానికి కుడికాలి పాదం ఆనిస్తూ, పూటీగా నిలబెట్టి కుడికాలి ముణుకుమీద కుడిచేతి నానించి పద్మం పట్టిన పార్వతీ దేవి హస్తంలాగ హస్తం పెట్టి వొత్తులు వలుపుతూ వంటింటి ద్వారబంధాని కానుకుని అవ్వ కూర్చుంది.

పండుతమలపాకులాంటి మొగముతో, పచ్చని పసినిమ్మపండురంగు ఛాయతో, నెరిసీనెరవని జుట్టుతో ముఖానికి పచ్చగా పసుపు రాచుకుని, ఎర్రగా దమ్మిడీఅంత బొట్టు పెట్టుకుని, సన్నని కాటుక రేఖతోవున్న అవ్వ పార్వతీదేవిలాగ కలకలలాడుతూ కళ్లకి కనుపించింది.

మెల్లగా అవ్వదగ్గిరకెళ్లి కూర్చుంటూ "అవ్వా! నాంచారిచరిత్ర ఏమిటో పూర్తిగా చెప్పవ్?!" అని అడిగేను.

ఈ ప్రశ్నవిని అవ్వ పకాలుమని నవ్వి వూరు కుంది. ఏమైనాసరే చెప్తేగాని వీల్లేదని పట్టుపట్టేను.

"నాంచారికథ చెప్పాలంటే నాకథా, మీతాత కథా అంతా చెప్పాలి. అంచేత ముందూ వెనకా లంకంతకథ వుంది, చెప్పాలంటే" అంది అవ్వ. అయినా చెప్పమన్నాను. సరేకదాఅని చెప్పడం మొదలుపెట్టింది అవ్వ.

"ఆరోజులలో, అంటే మీతాత చిన్నతనం రోజులలో చదువూ సంధ్యా లేకుండా, ఇంటిపట్టున వుండకుండా అల్లరిపిల్లల్తో ఆడుతూ ఇంట్లోవాళ్లని ఆయన నానాబాధ పెడుతూ వుండేవారు. కొట్టి, తిట్టి, ఎన్నివిధాలప్రయత్నించినా లాభంలేకపోయేసరికి

వంశాన్నుద్ధరించవలసిన ఒక్కగా నొక్క కొడుకూ ఎందుకూ కొరగాకుండాపోయేనే అని వాళ్ళమ్మా నాన్నా బెంగపెట్టుకుని ఎప్పుడు చూసినా దిగాలుగా వుండేవారు.

అప్పుడు మానాన్న 'పిల్లవాడిని నాతో తీసుకు వెళ్లి నేను బాగుచేస్తా' నని చెప్పి ఆయిద్దరినీ సముదాయించి, మీ తాతని తనతోకూడా యింటికి తీసుకు వచ్చేడు. మానాన్న ఆలా చెయ్యడానికి కారణం నేనూ, మీతాత మేనత్తమేనమామపిల్లల మవడమే.

ఆప్రకారంగా మానాన్న ఇంటికి తీసుకొచ్చేక నయాన్నీ భయాన్నీ ఎన్నోవిధాల నచ్చజెప్పి మీతాతని ఇంట్లో అట్టేబెట్టుకున్నాడు. ఉన్నట్టుగాఉండి మీ తాతకునన్నిచ్చిపెళ్ళిచెయ్యాలని నిశ్చయించుకున్నాడు మానాన్న; ఇలా అనుకోవడమేమిటి 'డబ్బయిరెండు వినియోగాల' తాను తలపెట్టినకార్యం నిర్విఘ్నంగా నెరవేర్చేడు. అప్పుడు నా వయస్సు మూడేళ్ళు, మీ తాతవయస్సు పదిహేనేళ్ళు.

మా పెళ్లికి పెట్టిన మేజువాణీలో లంపాలత, చంపావతి, అనే అక్కచెల్లెళ్లిద్దరూ 'భామపతంగం' అభినయిస్తూవుండగా మీ తాత చూసేరు. అంతతో ఆయనకి ఏవేవో భావాలు కలగడం మొదలుపెట్టేయి. అందువల్ల మళ్లుతోరణానికి ఎళ్లి మళ్ళుదలయి వస్తూ వుండగా మధ్యదారిలో మీ తాత మాయమయేరు.

ఈ సంగతి ఇంటికి వచ్చేక తెలుసుకున్న మా వాళ్ళు, వూరూ, నాడూ గాలించేరు; వాడవాడలా వెతికించేరు. కాని ఎన్నివిధాల ప్రయత్నించినా ఏం లాభం లేకపోయింది. ఏం చేయడానికి పాలుపోక ఎప్పటికైనా కాలం కలిసిరాకపోతుందా అనేభావంతో ఎదురుతెన్నులుచూస్తూ వున్నారు.

క్రమంగా నేను పెరిగి ఏడేళ్లదాని నవడంతో ఊహతెలిసేప్రాయం వచ్చింది. అప్పటినుంచి మా వాళ్ళు నాకు ఏ తరహామనుష్యులతో ఎటువంటిమోస్తరుగా మసులుతూ ఎలా మాట్లాడాలో మప్పి చెప్పడం మొదలుపెట్టేరు. పుష్పతాంబూలం, ఫలతాంబూలం, పసుపుతాంబూలం, నిత్యతాంబూలం అరుగుకు పసుపు, అట్లతద్దె, నిత్యశృంగారం చిట్టింబొట్లు, మోచేతి పద్మం, శ్రావణమంగళవారాలు, ఉదయకుంకం లాంటి కన్నెనోములన్నీ నోపించేరు. ఆటవాడు ఆటనేర్పి, పాటవాడు పాట నేర్పి- ఒకరిల్లు వదిలి ఒకరిల్లు చొచ్చి, ఒకడాలినని చెప్పుకుంటూ వుండడానికి తగ్గ-వంటా వార్పు, పనీ పాటు సమస్తం చెప్పించేరు.

ఈమోస్తరుగా మావాళ్లు నాకు మన్నెం మర్యాదలు మప్పిచెప్పి, కన్నెనోములన్నీ నోపించి, అయినింటిఆడపడుచుకి అక్కరకొచ్చే విద్య నేర్పించడంతో, ఒకరిచేత వేలుమడిపించుకోకుండా, ఓయిల్లాలా! అని పదిమందిచేత అనిపించుకుని జాతికి తగ్గ నీతి నిల్పుకుంటూ పరువుగా బ్రతకడానికి వీలుగా తయారుచేసేరు; కాని మీతాత అప్పటికీ తిరిగిరాలేదు.

ఆనాడు అలా మధ్యలోనే మాయమైపోయిన మీతాత ఎక్కడెక్కడో తిరుగుతూ మేజువాణీగాని, భరతనాట్యముగాని, భాగవతాలుగాని ఎక్కడ ఏది జరిగితే అక్కడికల్లా హాజరవుతూ వుండేవారు.

ఈప్రకారముగా ఉన్నవూళ్లో తినకుండా, తిన్నవూళ్లో పడుకోకుండా ఛప్పన్నదేశాలూ సంచారం చేస్తూవుండగా దారిలో ఒకసిద్ధపురుషుడు మీతాతకుకనిపించేడు, ఆ సిద్ధపురుషుడు మీతాతను చూసీచూడ్డంతోనే ఏమనుకున్నాడో ఏమోగాని, ఆరోజునుంచి ఆయన్ని తనవెంట తిప్పుకుంటూ సకల చదువులూ చదివించేడు, నాట్యవిద్య నేర్పించేడు. తుదకు మంత్రోపదేశంకూడాచేసి "ఇక నీమానాన నువు బ్రతుకు." అని చెప్పి తనదారిని తాను పోయేడు.

కాలికి బలపం కట్టుకున్నట్టుగా కాలానకుండా తిరుగుతూవుండే మీ తాత కాంచీపురానికి చేరుకుని వరదరాజస్వామి ఆలయానికి విజయంచేసేరు. ఆ సమయంలో ఆలయం అంతా కోలాహలంతో నిండివుంది. ఏమిటా అని అనుకుంటూ, అడుగుల్లో అడుగు వేసుకుంటూ కళ్యాణమంటపం ఆవరణకి చేరుకున్నారు మీ తాత.

ఆ ఆవరణంతా ఇసకవేస్తే రాలనంతగా జనంతో క్రిక్కిరిసి కిటకిటలాడుతూవుంది. ఎదురుగావున్న వేదిక దగ్గర పురోహితులు ఆశీర్వచనపనసలు చదువుతున్నారు. కంచురంగు కంచుకం తొడిగి, గోచీపోసి కట్టిన కొర్నాటిపట్టుమీద పద్మాలపట్టు పైటవేసుకొని పన్నెండేళ్ళ బాలాకుమార్తె నిటారుగా నిలుచోనుంది. పందుముత్తయిదువు లొక్కొక్కళే వేదికమీదికి వచ్చి

ఆ పిల్లదానిచేతిలో పళ్ళూ, పూవులు పెట్టి నెత్తిన అక్షింతలు చల్లి వెళ్లిపోతున్నారు. అక్కడున్న వారిలో ఒకరిని విషయమేమిటని మీ తాత అడిగేరు.

"నాగమణి కూతురు నాంచారికి 'గజ్జెలపూజ సంబరం' చేస్తున్నారు." అని ఆ పెద్దమనిషి చెప్పేడు. అంటే ఏమిటో వివరంగా చెప్పమన్నారు మీ తాత.

"ఏముందీ, కళావంతులలో పిల్లదానికి అక్షరాభ్యాసం అయేక కులంలోవున్న పెద్దముత్తయిదువని గురువుగాయెంచి, ఆవిడకిపిల్లదాన్ని అప్పగించి, నాట్యవిద్య నేర్పించుతారు. విద్యంతా పూర్తికాగానే ఒక మంచి ముహూర్తం చూచి, ఆనాటి ఉదయం కుల పెద్దల ఎదుట పిల్లదానిచేత నాట్యంచేయించుతారు. ఆరోజున కులస్థులందరినీ భోజనాలకి పిలుస్తారు. ఆ సాయంత్రం దేవాలయంలో పూజలు చేయించి కళ్యాణమంటపంలో గజ్జెలకి కూడా పిల్లదానిచేత పూజచేయించి, ఆశీర్వచనం అయినతరువాత, స్వామివారి యెదుట నృత్యంచేయిస్తారు. ఈ నృత్యం చూడ్డానికి కులపెద్దలతోబాటు పురప్రముఖుల్ని కూడా ఆహ్వానిస్తారు. స్వామివారి సన్నిధిని, అందరి సమక్షంలోనూ చేసిన నృత్యానికి, అందరి మన్ననా పొందిన తరువాత—గురువుగాని, లేక కులపెద్దలలో మరెవరైనా గాని వేదికమీదికి వచ్చి పిల్లది పూజచేసిన గజ్జెల్ని పిల్లదాని కాలికి కడ్తారు. ఆలా కాలికి గజ్జెకట్టడమంటే నాటినుంచి పిల్లది మేళంకట్టడానికి అర్హురాలుగా ప్రకటించడమన్నమాట. 'గజ్జలపూజ సంబరం' అంటే ఇది. ఇప్పుడు నాంచారికి అదే జరిపిస్తున్నా"రని ఆ పెద్దమనిషి చెప్పేడు.

ఆ మాటలు విన్నమీదట నాంచారి నృత్యం ఆరంభించబోయేసమయానికి మీ తాత అక్కడి జనాన్ని తప్పించుకుని మంటపానికి దగ్గరగా వెళ్ళికూర్చున్నారు. నాంచారి నానారకాలుగా నాట్యంచేస్తూవుంటేచూడ్డానికివచ్చిన పురప్రముఖులు, నట్టువరాండ్రు అందరూ తన్మయత్వంలో లీనమై ఉన్నారు. కన్ను చెదరనీకుండా కన్నుల వైభవంగా చేస్తున్న నాంచారి నాట్యం అందరి మన్ననలు పొందకుండా వుంటుందా! వచ్చినవాళ్ళందరూ సెబాసని హర్షించేరు.

కులపెద్దలలో ఒకామె వచ్చి నాంచారి కాలికి గజ్జెకట్టింది. నలుగురు పేరంటాండ్రు వచ్చి నివాళితో నీరాజన మిచ్చేరు. వచ్చినవాళ్ళందరూ ఒక్కొక్కరే జారుకుంటున్నారు.

అప్పుడు నాంచారి వాళ్ళమ్మ నాగమణిని పిలిచి చెవిలో యేదో చెప్పింది. నాగమణి సరేనని నవ్వుకుని మీ తాతని పిలిచింది; తమతో ఇంటికి రమ్మంది. మీ తాత వాళ్ళతోకూడా వెళ్లేరు. ఇంటికి వెళ్ళిన తరువాత నాగమణి మీ తాతతో ఇలా చెప్పింది:

"అబ్బాయిగారు అన్యథా తలంచకుండావుంటే బుద్ధిపూర్వకంగా ఒక్క మనవి."

ఏమిటన్నట్టుగా చూసేరు మీ తాత. నాగమణి మళ్ళీ చెప్పసాగింది: "మాకులదైవం, యీ వంశానికి మూలం అయిన రత్నావతీదేవినాటినుంచి నిన్నటి నావరకూ యీ వంశములో పుట్టిన ఆడకూతుళ్లు కులవృత్తిని చేపట్టినవాళ్ళు కొందరైతే, కుల విద్యనుమాత్రమే నమ్ముకున్నవాళ్ళు కొందరు. అయితే మా తల్లిగాని, నేనుగాని కేవలం కులవిద్యను మాత్రమే నమ్ముకుని జీవించేము గాని మరోవిధముగా మనడంలేదు. అందుకే నాంచారికికూడా 'పైటసంబరం' నాడు మత్స్యపాపిట తీయించి కుడిపైటవేయించి నివాళి ఇప్పించేను. వేదవేదాంగపారంగతులు, సకలశాస్త్రకోవిదులు, సర్వవిద్యాపరిపూర్ణులు అయిన బ్రాహ్మణోత్తమునిరక్తసంజాతయిన నాంచారి తనకి బ్రాహ్మణచిన్నవాడే కంకణం కట్టాలని కోరుకున్నందుకు నాలో నేనే గర్వపడుతున్నాను.

"నాంచారికి కేవలం నాట్యవిద్య నేర్పించడమే కాకుండా అమరం చదివించేను, ఆదికావ్యం చెప్పించేను; పంచకావ్యాలూ పరింపజేసేను. అంతేకాదు, కులగౌరవ కుటుంబగౌరవాలు బోధించేను; మన్నన మర్యాదలు మప్పిదల జేసేను; మానవతిగా బ్రతుకమని హితవు చెప్పేను; గుణవతి ననిపించుకోగల గురుతుకి వచ్చేట్టుగా తయారుచేసేను. ఆ చిన్నది ఇంగితమెరిగి, ఈడేరి ఇప్పటికి ఆరుమాసాలే అయినప్పటికీ గజ్జెలపూజ సంబరంకాగానే కంకణంకట్టించడానికి నిశ్చయించేను.

చంపకి చారడేసివున్న చక్రాలలాంటి కళ్లు, సెన్నుదుటి మచ్చ, నేవళీకమైన ముక్కు, చూడముచ్చటయిన చుబుకం, విశాలమైన వక్షం, వంపులు తిరిగిన ఆ తలకట్టు, మణికట్టు గలిగిన రూపురేఖా విలాసాల్ని తిలకించిన అమ్మాయి తన హృదయాన్ని అంకితం చేసుకున్నదంటే అబ్బురమేమీ లేదు. కను

బొమలమధ్య కనుపించే ఆ కళాకాంతుల్ని గమనిస్తే అబ్బాయిగారివిద్యాపాటవంఏపాటిదో అర్థంఅవుతూనే వుంది. కనుక తమరు అన్యథా భావించకుండా అవునని అంగీకరించినట్లయితే ధన్యనైతినని తలంచి కంకణాల సంబరానికి ముహూర్త మేర్పాటు చేయిస్తాను. మన్నించండి, మరోవిధంగా భావించకండి. అనుజ్ఞ దయచేయించండి;" అని చెప్పి దోసిలొగ్గి నిలచింది నాగమణి.

సిగ్గుతో శిరస్సాంచిన నాంచారి నవ్వుముఖం గమనించి అంగీకారం సూచిస్తూనే దేశద్రిమ్మరినని తెలియజేసేరు మీ తాత. అయినా ఫర్వాలేదనుకున్నారు ఆ తల్లీకూతుళ్లు.

పురప్రముఖుల్ని, శ్రేష్ఠులైన నగరంవాళ్లని చూపడానికి పిలిచి ఆ అందరి సమక్షంలో నెత్తిమీద జీలకర్ర, బెల్లం ప్రమాణం చేయించిన చిన్నవాడిచేత నల్లపూసలు గుచ్చిన నాను మెడకీ చేతికి కంకణము కట్టేస్తారు. పిల్లదానికి ఆ రోజున బ్రాహ్మణచిన్నవాడు కంకణం కట్టినట్టయితే—తెలుపు నీలంరంగు పూవులు తురుముతూ అయిదుపాయలతో జడవేసి పంచవన్నెల పూలచెండు తలలో ముడుస్తారు. అలాగే రాచవాళ్ళచిన్నవా డయినట్లయితే - తెలుపు, ఎరుపు రంగు పూలు తురుముతూ నాలుగుపాయలజడ వేస్తారు. నగరంవారిబాలు డయితే, అంటే కోమటిబిడ్డయితే తెలుపు యెరుపు నీలిరంగు పూలు తురుముతూ మూడు పాయలజడ వేస్తారు. ఒక్కకులస్థుడైన చిన్నవాడు తాళికట్టడానికి తప్పిస్తే, కడమ ఏజాతికీ కంకణం కట్టే అర్హత లేదు.

'కంకణాల సంబరం' వాడు ఈమోస్తరుగా పాటించడం అనాదినుంచీ వస్తూవున్న ఆచారం కాబట్టి మీ తాతను వూరి పొలిమేర తోటలో విడిది చేయించేరు. టకోరా, గనిశెట్టు మేళాలతో ఎదురు సన్నాహమవుతూ, జిల్లగోడుగువేసి వల్లభంపట్టి బాజాభజంత్రీలతో పాడుకురాగా—తెలుపూ నీలంరంగు పూలు తురిమి, అయిదుపాయల జడవేసి—నాంచారికి ఆ మహనీయుడిచేత కంకణం కట్టించి, అందరిసమక్షంలోనూ అతివైభవంగా సంబరం జరిపించేరు.

అయితే, వూరూరాతిరిగే ఆ ఉత్తమపురుషుడు నాటిరాత్రి కొంగున కట్టిందికి బంగారం ఎక్కణ్ణించి తేగలరు! అందుచేత చెక్కిలిమీద చెయ్యివేసి శిరస్సువే చెంగున ముడిపెట్టేరు. ఆకారణంవల్ల ఆయన ఆజన్మం అదిడ ఆజ్ఞాబద్ధుడై వుండవలసిందే. కాని ఆ సుగుణవతి తన కన్నులతో మన్నించి, మనస్సా ధ్యానించి, భక్తితో ఆయన పాదపూజ చేయడమే పరమావధిగా భావించింది. కనుకనే ఆ మారాజు నాగనృత్యం చేర్పించి, కట్నంగా నాంచారికి మంత్రోపదేశం చేసేరు.

కనికరించి కన్నెచెరబాపిన మహనీయుడు కొద్దికాలంపాటే నిభాయించుకు నిలబడ్డారు. కాని ఒక అర్ధరాత్రివేళ చెప్పాచెయ్యకుండా వెళ్లిపోయారు. మొదటనే దేశద్రిమ్మరినని తెలియజేసేరు కనుక పాపం చేసేదేమీ లేక చింతిస్తూ, ఆయన రూపాన్నే చిత్రించుకుంటూ - తాను ఉపదేశం పొందిన మంత్రం జపిస్తూ- ఆయనరాక కెదురుచూస్తూ నాంచారి కాలం గడుపుతూ వుంది.

అక్కడనుంచి అలా బయలుదేరిన మీ తాత మళ్లీ దేశాలన్నీ తిరిగి తిరిగి ఎలాగైతే నేం మావాళ్ళింటికి చేరుకున్నారు.

అప్పటికి నాకు పదేళ్లు నిండి పదకొండో ఏడు వచ్చింది. ఇంగితజ్ఞానం కలిగింది; ఇల్లూ, వాకిలీ చక్కబెట్టుకోగల నేర్పు తెలిసింది. ఈ తేరడం కూడా అయింది. అంతవరకూ మీ తాత రాకకోసం ఎదురు చూస్తూ వున్న మావాళ్ళందరూ ఆయన రావడంతో ఆపై కాగలకార్యం నెరవేర్చడానికి సిద్ధపడ్డారు.

మనసుపెట్టిన ఆ మారాజు కనికరం చూపుతూ కంటితో లాలించి, పంటితో పాలించి, ఆలనతో ఆదరించేరు. ఆయన కరుణరసమే గడ్డకట్టి మీ నాన్న రూపు ఏర్పడింది. కానీ, పొత్తిళ్లలో పాపణ్ని చూసి పొంగిపోకుండా మూడువారాలు తిరిగేసరికి మీ తాత మళ్ళీ ఇల్లు వదలి వెళ్ళిపోయారు.

ఏ జన్మలో చేసిన పాపమో ఈ జన్మలో అనుభవిస్తున్నామని దుఃఖిస్తూ తులసిపూజలు చేసేను; అశ్వత్థప్రదక్షిణాలు ఆచరించేను; అభిషేకాలు చేయించేను; గ్రహశాంతులూ, జపాలూ జరిపించేను.

అంతేకాకుండా ఈ జన్మలో సుఖంమాట ఎలా వున్నా మరుజన్మలోనన్నా ఇటువంటి దుఃఖం లేకుండా వుండాలని- 'భక్తి తప్పినా ఫలం తప్పరాదు. వాక్కు తప్పినా వరం తప్పరాదు. వ్రతంలో లోపమున్నా ఫలంలో లోపం వుండరాదు' అని ఉద్యాపన

సంకల్పం చెప్పుకుంటూ గౌరీపూజ, వరలక్ష్మీవ్రతాలు చేసేను. ఫలాలగౌరి, దంపత్తాంబూలాల నోములు నోచేను. ఆకలన్నవాళ్ళకి అన్నం పెట్టేను; దప్పిగొన్న వాళ్లకి నీళ్ళిచ్చేను; చలితో బాధ పడుతున్నవాళ్ళకి బట్టలిచ్చేను; వెలుగు వేసినవారికి వెలుగు కనిపిస్తుందన్న నమ్మకతో సందె వెలుగులు వేశాను; సంధ్యాస్నానాలు చేసేను. ఇంకా ఎన్నెన్నో నోములునోచి, ఏవేవో వ్రతాలు చేస్తూ వెయ్యి దేవుళ్ళకి మొక్కుతూ మీ తాత దర్శనం ఎప్పటికి అవుతుందా అని ఎదురు చూస్తూ వున్నాను.

ఆ వెళ్ళడం వెళ్ళడం మీ తాత తిన్నగా నాంచారి ఇంటికి వెళ్ళేరు.

ప్రతినిత్యమూ ప్రభాతకాలంలో అసలు సిసలైన నాగుపాము తూర్పుదిక్కుముఖమై, తోక మీదుగా లేచినిటారుగా నిలబడి, ఉదయసూర్యుడికి పడగతో ప్రణమిల్లుతూ కొద్ది లిప్త లుంటుంది. ఆ తర్వాత దగ్గరలోనున్న చెట్టుకొమ్మకి తోకని చుట్టుకొని సూర్యాభిముఖంగా సాగిలబడి మొక్కుతుంది ఆ పిమ్మట భూమిమీద ప్రాకుతూ పుట్టలోకి వెళ్లిపోతుంది. సిసలైన నాగుపాము సూర్యదేవుడికి ఆ ప్రకారంగా నమస్కరిస్తున్నప్పుడు 'నా జోలికి నరులూ, నరులజోలికి నేనూ పోకూడ'దనే భావంతో ప్రార్థిస్తుందనిన్నీ, నరుల కంటబడ్డ నల్లనాగు నెత్తి నేలని కొట్టుకుని చచ్చిపోతుందని చెప్పుకుంటూ వుండడం పరిపాటి.

నిజానికి, సూర్యనమస్కారాలు చేసే సర్పరాజుని దృష్టిలో పెట్టుకోవడంవల్లనే, స్వచ్ఛందమరణాన్ని పొందగోరే నర్తకులు నాగనృత్యం నేర్చుకునేందుకు సిద్ధపడేవారు. దైహికంగా ఆరోగ్యాన్నీ, ఐహికాముష్మికానందాన్నీ, స్వచ్ఛందమరణాన్నీ పొందగల్గడమే నాగనృత్యానికి విశిష్టత. అందుకనే నాట్యవిద్యలో ఆరితేరినవాళ్లు నాగనృత్యాన్ని అభ్యసించడానికి ఉద్దేశించేవారు. అయితే అందరికీ అది అంత సులువుగా అందుబాటులో వుంటుందా, ఎక్కడో అదృష్టవంతులకి తప్పితే? అందువల్ల అందరికీ అలభ్యమైన విద్య, పూర్వజన్మసుకృతంవల్ల తనకి లభ్యమయినట్టుగా భావించి. అప్పటికే మీ తాతవల్ల ఉపదేశం పొందినమంత్రాన్ని పునశ్చరణచేస్తూవుండడం వల్ల మంత్రసిద్ధి అవడంతో నాంచారి నాగనృత్యంలో దిట్ట అనిపించుకుంది.

ఆకాలంలో ఈ మన ఉత్తరాదిని కంపాలత, చంపావతి అనే అక్కచెల్లెళ్ళు భామపశంగం పట్టడంలోనూ, మాణిక్యం మోడీనృత్యాలు చెయ్యడంలోనూ, సుందరి దశావతారీ పట్టడంలోనూ పేరు గడించి వున్నారు. అలాగే నాంచారికూడా నాగనృత్యంలో పేరు సంపాదించుకుంది.

'అందరూ ఒక ఎత్తు, అగస్త్యుడొక్కడే ఒక ఎత్తు' అనే సామెత చెప్పినట్టుగా ఉత్తరాదిని పేరుబడసిన ఆ ముగ్గురితో దీటుగా దక్షిణాదిని నాంచారి ఒకత్తే వుంది తప్ప అంతకుముందుగాని, ఆ తర్వాతగాని నాగనృత్యంలో నాంచారిని తలదన్నదగ్గ మనిషి ఇటు ఉత్తరాదినీ, దక్షిణాదినీకూడా లేకపోయింది.

అలా పేరుప్రఖ్యాతులుగన్న ఆ నలుగురు నారీరత్నాలు ఎప్పుడు ఎక్కడ నృత్యం చేసినా దేశమంతా, తిరగబడి, కనకం కురించేవారు.

ఆరీతిగా కులవిద్యనిమాత్రమే నమ్ముకుని నాగనృత్యప్రదర్శనతో కాలంగడుపుతున్న నాంచారికి నృత్యాని బయలుదేరేముందు నాగమణి జడవేస్తూవుండేది. ఆ జడవెయ్యడంలో ఒక ప్రత్యేకత వుంది. పంచవన్నెలపూలు తురుముతూ నాలుగు పాయల జడవెయ్యడం ఆ జడమీద తెలుపు, ఎరుపు రంగుల పూలచెండు ముడవడం దానిప్రత్యేకత.

అయితే, అప్పుడే నాగమణి కాలంచెయ్యడాన్ని అటుపైని 'ఎవరు జడవెయ్యగలరా' అని నాంచారి దుఃఖభారంలో ఆలోచిస్తున్న సమయంలో మీతాత అక్కడికి చేరుకున్నారు.

మీతాతని చూడగానే - ఏనుగంత సత్తువ, గుర్రమంత పరుగు వచ్చినంత ఉత్సాహంతో నాంచారి ఉప్పొంగిపోయింది. నాటినుండి నాగనృత్యం చేయబోయేముందు నాంచారికి జడవేస్తూ, స్థిరంలేకుండా తిరుగుతూవుండే మీతాత అక్కడే వుండిపోయేరు.

ఈసంగతి ఆనోటా ఆనోటా చెప్పుకోగా ఎలాగయితేనేం మాకందరికీ తెలిసింది. కాని మాకు తెలిసేసరికే పదేళ్లకాలం గడిచిపోయింది.

అప్పుడు మానాన్న అల్లుడిని తీసుకొస్తానని బయలుదేరబోయాడు, కాని నేనే అడ్డుపడ్డాను. అన్నిరకాల తర్జనభర్జనలు అయినమీదట పిల్లవాడిని వెంటబెట్టుకుని నేనూ మానాన్న బయలుదేరిందికి నిశ్చయించుకుని ప్రయాణమయేము.

మేము ఆవూరు చేరుకునేసరికి సాయంత్రం అయింది. నాటిరాత్రి ఆవూళ్లో నాగనృత్యం జరుగుతుందని మాకు తెలిసింది. మేము సరాసరి నాంచారి ఇంటికి బయలుదేరాము. ఎప్పుడూలాగానే మీతాత నాంచారికి జడవేస్తూవుండగా ఆసమయంలో మేము అక్కడికొచ్చేము.

ద్వారం దాటగానే ఈ సంఘటన చూసిన నేను, అడుగు ముందుకి వెయ్యలేక, పిల్లవాడిని చేతబట్టుకుని అక్కడే నిలబడిపోయేను. మమ్మల్ని చూడడంతోనే అల్లుతూఅల్లుతూవున్న జడపట్టుని వదిలిపెట్టేశారు మీ తాత. మాలో ఏ ఒక్కరమూ మాట్లాడకుండా అటు ప్రక్క నాంచారీ, మీతాతా-ఇటుప్రక్క పిల్లవాడితో బాటు నేనూ, మానాన్నా - మొత్తం అయిదుగురం స్తబ్ధుగా వుండిపోయేము.

ఎలాగైతేనేం కొంతసేపటికి నేనే మెల్లిగా తేరుకుని "ఒక్కసారి దర్శనం చేసుకుందామని వచ్చేను; ఆ భాగ్యం కలిగింది; ధన్యురాల్ని. ముఖ్యంగా పిల్లవాడికి మిమ్మల్ని చూపించడం నావిధి కొబట్టి ఇలా సాహసించగలిగేను. కనుక మన్నించమని వేడుకొంటూ శెలవు తీసుకుంటున్నాను" అని చెప్పి మా నాన్నతో బాటు పిల్లవాడిని వెంటబెట్టుకు తిరిగి వచ్చేశాను.

మేము తిరిగి వచ్చేస్తూవుండగా నాంచారిగాని, మీతాతగాని వుండమనలేదు. సరికదా, ద్వారబంధం దగ్గరే నిలుచుండిపోయి దేవాలయంలో దేముణ్ణి చూసి వచ్చేసినట్టుగా చూసివచ్చేయడం బాగులేదంటూ మా నాన్న ఎంతో కోపగించుకున్నాడు. అలా చేయడమే ఉత్తమధర్మమని చెప్పి ఆయన్ని నిదానంగా సమాధానపరిచేను; అంతతో ఆయన మరేమీ అనకుండా వూరుకున్నాడు.

ఆతరువాత మీతాత నాంచారికి మళ్లీ జడవేసేరు. కాని పట్టిన పట్టుకి మొదటనే విఘాతం కలగడాన్ని నాంచారి ఆరోజు నాగనృత్యం చెయ్యలేకపోయింది. అంతే! నాటినుంచి నేటిదాకా మళ్ళీ నాంచారి నాగనృత్యం చేయనేలేదు.

నాగనృత్యం చేయలేకపోయి, తిరిగి ఇంటికి చేరుకున్నాక "కన్నెపిల్ల మనసూ పన్నపూస సొగసూ కలిపి రంగరించిన సోయగంతో కలకాలం వర్ధిల్లాలనుకున్నాను..." అంటూ ఆమాటలన్నీ అని మీతాతని వెళ్లమని చెప్పి పంపించింది.

నాంచారి అన్నమాటలూ, తనబుద్ధీ రెండూ కలిపి ఆలోచించిన ఆ మారాజు తిన్నగా ఇంటికి వచ్చేసినందుకు మావాళ్ళంతా ఎంతో సంబరపడ్డారు. సంగతంతా తెలుసుకున్న నేను "ఆసుగుణవతి మనస్ఫూర్తిగా కనికరించి, దయతలచి, మిమ్మల్నుపంపించింది కనుకనే తిరుగా ఈ భాగ్యాన్ని నేను పొందగలిగేను. అయితే ఆవిడదికూడా నాలాంటి ఆడజన్మే. ఆకారణంచేత ఆడదాని హృదయం ఆడది సులువుగా అర్థంచేసికోగలదు. కొబట్టే ఆలోచించి చెప్తున్నాను; వెంటనే ఆవిణ్ణి పిలిపించండి" అని మీతాతని వేడుకుంటూ నాటిరాత్రి చెప్పేను.

నేను చెప్పినమాటల్ని చెవినిపెట్టి మీతాతవెంటనే నాంచారిని పిలిపించేరు; నాంచారి పరమానందంలో రెక్కలు కట్టుకునివచ్చి వాలింది. అప్పటినుంచీ మన ఎదుటింట్లో వుంటూనాంచారి ఇక్కడే వుండిపోయింది. నీతికి నిలబడి, నియమానికి కట్టుబడి స్థిరచిత్తంతో, సద్బుద్ధితో మసలుతూవుండడంవల్లనే వూళ్లోవాళ్లందరిచేతా ఓహో అనిపించుకుని నలుగురిలోనూ తలెత్తుకు తిరుగుతూ ఈ నలభైఏళ్ళనుంచీ నాంచారి ఇక్కడే వుంటోంది.

అప్పుడావిధంగా ఆవిడపెట్టిన భిక్షవల్లనే మీరందరూ పుట్టడంతో మనవంశం చిలవలుపలవలుగా ఇంత బాగా విస్తరించగలిగింది. ఆనాడు మీతాతని పంపించడానికి నాంచారి అన్న ఆమాటలే ఈనాటికీ మరువరానివని మీతాత ఎప్పుడూ వల్లెవేస్తూవుంటారు. సరికదా, సహస్రమాసపుజీవి అయిన ఆసత్యాన్ని ఈ రోజు ప్రొద్దున్నకూడా జబ్బుగా వున్నప్పటికీ మరచిపోకుండా వాటినే మననం చేస్తూవున్నారు. ఇది ఇప్పటివరకూ గడిచిన నాంచారికథ." అని అవ్వ చెప్తూవుండగా తాతయ్య పిలుస్తున్నాడని నాన్నవచ్చి అవ్వతో చెప్పేడు.

వత్తులుపెట్టేమూసి, వంటింటి గుమ్మంలో పొదికట్లనే వుంచి అవ్వ తాతయ్య దగ్గరకి వెళ్లింది. నేను కూడా అక్కణ్ణించి కదలి అవ్వతో వెళ్లేను.

అవ్వ, తాతయ్య దగ్గరికెళ్లి ఏమని అడిగింది. తాతయ్య మళ్లా ఆవేమాటలు అంటూ నాంచారిని పిలిపించమని అవ్వతో చెప్పేడు. వెంటనే అవ్వ నాంచారికి కబురుచేసింది. తాతయ్య పిలుస్తున్నాడన్న కబురు వినగానే ఎదురింట్లోవున్న నాంచారి ఒంటి

నిండా బట్టకప్పుకొని ఒక్కసెట్టున అదరాబాదరాగా పరుగెత్తుకొచ్చింది.

నాంచారి తాతయ్య దగ్గరికెళ్ళి "రమ్మని పిలిపించారా?" అంది వినయంతో నెమ్మదిగా. అవునన్నాడు తాతయ్య. ఎందుకన్నట్టుగా నాంచారి తాతయ్య ముఖంలోకి చూసింది.

"నాంచారీ! ఇలా చూడు. సహస్రమాసపు జీవినైన నేను ఇంక ఎంతోకాలం జీవించను. కానీ ఈ ఆఖరుఘడియల్లో వున్న నా కడసారి కోరిక ఒకటి వుంది, తీరుస్తావా?" అన్నాడు తాతయ్య.

తాతయ్య అలా అంటూండగా నాంచారి కళ్లు చెమ్మగిల్లేయి. కళ్లొత్తుకుంటూ "చిత్తం, సెలవీయండి" అంది నాంచారి.

"మరేం లేదు, గజ్జెలపూజసంబరం నాడు నీ నాట్య విన్యాసాలు లీలగా చూసేను. ఆ తర్వాత వయస్సులోవున్న ఉమ్మస్సుచేత నేను ఎప్పుడూ కోరనూలేదు; నువ్వు కూడా నాగనృత్యంలో ప్రసిద్ధి పొందడాన్ని కేవలం దానినే ప్రదర్శిస్తూ వుండే దానివి. దానా దినా నీ నాట్యావిన్యాసాలు మళ్లా చూసేభాగ్యం కలగకపోవడాన్ని ఆ కోరిక చిరకాలంగా నాలోనే జీర్ణించిపోయింది. ఇటీవల ఆ కోరిక మళ్లా తలెత్తి నా మనస్సుని బాధిస్తూవుంది. కనుక నా కడసారి కోరిక నెరవేర్చి బారెడుప్రొద్దులో వున్న ఈ జీవితాన్ని ఆనందమయం చెయ్యవూ?" అన్నాడు తాతయ్య.

నాంచారికళ్లు మళ్ళీ చెమ్మగిల్లేయి. నాటికి నలభై ఏళ్ళనుంచీ గజ్జెకట్టడం మానేసిన తాను నాట్యం చెయ్యడం సాధ్యమా అనేసంశయం కలిగి నాంచారి ఒక్కసారి దీర్ఘంగా ఆలోచించింది. కొద్దిసేపటికే ఒక నిశ్చయానికివచ్చి "తప్పకుండా తమకోరిక తీరుస్తాను. కొంచంసేపు ఓపికపట్టండి; అన్ని ఏర్పాట్లూచేసి ఆరంభిస్తాను." అని నాంచారి సమాధానం చెప్పింది. తాతయ్య బ్రహ్మానందభరితుడయేడు.

ఆ వెంటనే కంపాలతని, చంపావతిని వెనకపాట పాడడానికిన్నీ, వాళ్లతోవున్న వాద్యబృందాన్నీ రమ్మనమని నాంచారి కబురుచేసింది. అంతవరకూ తాను ఉపదేశం పొందిన మంత్రాన్ని పునశ్చరణ చేసుకుంటూవున్న నాంచారి వాద్యబృందంవాళ్లు రాగానే, నాట్యం అలవాటుతప్పనిమనిషికిమల్లే ఎక్కడలేని ఉత్సాహాన్ని పొందగల్గింది; నాట్యానికి సిద్ధపడింది.

"వాతాపి గణపతిం భజేహం" అని విఘ్నేశ్వర స్తోత్రాన్ని కంపాలత, చంపావతి పాడుతూవుండగా, వాద్యబృందం వాయిస్తూవుండగా నాంచారి కాలికి గజ్జెకట్టి మరొక్కసారి మంత్రం పునశ్చరణచేసి ధ్యాన ముద్రపట్టింది.

విఘ్నేశ్వరప్రార్థన కాగానే 'దినకరా శుభకరా' అని సూర్యదేవతాప్రార్థన మొదలుపెట్టగానే, ధ్యానముద్రలో నెత్తిమీద చేతులు జోడించి మునివేళ్ళతో అనుకుని మోకాళ్ళమీద కూర్చున్న నాంచారి, అదే ముద్రలో నాగుపాములాగ వంపులు తిరుగుతూ లేచినుంచుని అభినయించడం మొదలుపెట్టింది.

"ఆరోగ్యం భాస్కరాధీనం" అన్నమాట జ్ఞప్తికి వచ్చి ప్రార్థన చేశారా అన్నట్లుగా సూర్యదేవతా ప్రార్థనకావడంతోనే తాతయ్యకి కూడా ఉత్సాహం పుట్టుకొచ్చి అమాంతంవంతనాట్యం చెయ్యడానికి లేచి నుంచున్నాడు. పుట్టెడుకూటిబలగంఅయిన మేమందరం ఆశ్చర్యంతో చూస్తూ వున్నాం.

"ధీంత ధీంత ధిమిధారిమి తోం కిణ ధిత్తోం ధిత్తోం ధిత్తోం, తకిట ధిమికిట ||ధీంత|| అనే తిల్లాన పల్లవితో ఆరంభించిన నాంచారి, తరంగం, అష్టపదీ, పదవర్ణం, పదం వరసగా నభినయించింది. ఆ తరవాత దీప, ఘట, హంస, మయూర, పారువా నృత్యాలు వరసగా అభినయిస్తూవుంటే తాతయ్య కూడా వంతనృత్యం చేస్తున్నాడు.

ఈ నాట్యాలన్నీ అయేక 'భామ కలాపం' అభినయిస్తూ "చెలియా వయ్యారీ ముగ్గుల చెంచుభామా నోయమ్మా" అని పాడుతూ మధ్యమధ్య "ఏమే మాధవీ" అన్నప్పుడల్లా పంచకొంగు పైటగా వేసుకుని "ఔనోయమ్మా" అంటూ మాధవిగానూ, అటు పిమ్మట చెంచువారగానూ తాతయ్య వంతనృత్య చేయసాగాడు. మేమందరం ఆశ్చర్యంగా చూస్తున్నాము. భామకలాపం అభినయించడంలో భాగవతపు దరువులు కూడా కాగానే "పదం అభినయించిన మీదట చిట్టచివరని ముక్తాయిస్వరపు ఆవృత్తుల

వాయిస్తూ ఉండగా అందు కనుగుణంగా నృత్యం చెయ్యి"మని తాతయ్య చెప్పేడు.

తాతయ్య చెప్పిన మాటలు విని "ఇది ప్రదర్శన చూడడమా, లేక పరీక్షించడమా" అనే అనుమానంతో మేమందరం బిత్తరపోయి చూస్తూ ఉండిపోయాము. కానీ నాంచారిమాత్రం నిస్సంకోచంగా అభినయిస్తూ పాటపూర్తికాగానే, మృదంగం, ఘటం తాళగతి తప్పకుండా ముక్తాయిస్వరాల ఆవృత్తులు వాయిస్తూంటే వాటి కనుగుణంగా నృత్యం చేస్తూవుంది. అలా నృత్యం చేస్తూంటే చూస్తూవున్న మేమందరం చలనం లేకుండా నివ్వెరపాటుతో నిలుచుండిపోయేము.

ఆ తరువాత చిట్టచివరికి– నట్టువరాలు స్వాముల వారి దర్శనానికి వెళ్ళినప్పుడు ఆ స్వాములవారి సన్నిధిని ఏ ప్రకారంగా నృత్యం చేస్తారో ఆప్రకారంగా "లలనా! సద్గురుని బాసి తాళజాలనే, ఓ లలనా," అని వెనుకపాటతో నాంచారి అభినయిస్తూంది. వంత నాట్యం చేస్తున్న తాతయ్య పద్మాసనం వేసుకుని స్వాములవారిలాగ ధ్యానముద్రపట్టి కూర్చున్నాడు.

"కంటిలో కన్ను మూసి కంటిపాప వంటజేసి ఇంటవంటలేని గురుతు నమరియుండజేసిన॥ లలనా సద్గురుని బాసి, తాళజాలనే, ఓ లలనా," అని వెనక పాటలో నాంచారి అభినయిస్తూ వుండగా ధ్యాన ముద్రలోవున్న తాతయ్య ప్రాణవాయువులు ఎగిరి పోయి అనంతవాయువుల్లో లీనమయిపోయాయి.

నాంచారి అభినయిస్తూనే ఇదిగమనించి వెంటనే స్వాములవారికి ప్రదక్షిణనమస్కారాలాచరించి నట్టుగా నాట్యం చేస్తూనే—తాతయ్య చుట్టూ ప్రదక్షిణం చేసి ఎదుటికి వచ్చి సాష్టాంగపడింది.

ఒకక్షణ గడచింది, రెండు క్షణాలు గడిచేయి; ఆఖరుకి అరఘడియకూడా గడిచింది. కానీ నాంచారి లేవలేదు. అంతవరకూ వాద్యబృందం వాయిస్తూనే వున్నారు. కంపాలతా, చంపావతీ ఒకరు చేతితో లయ వేస్తూవుంటే మరొకరు తాళంవేస్తున్నారు. ఎవ్వరమూ దగ్గరికి వెళ్ళలేదు.

చివరికి ఘడియకూడా గడిచిపోయేసరికి ఆందోళనతో అవ్వవెళ్ళి నాంచారిని లేవనెత్తి చూసింది. ఇంకేముంది! నాంచారి కూడా ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయింది. ఎక్కడివాళ్ళమక్కడ స్తంభీభూతంగా నిలబడేసరికి వాయిద్యాలు ఆపుచేసేశారు. అందరం ఒక్కసారి గొల్లుమన్నాం.

ఆ తర్వాత ఆ యిద్దరినీ ఉత్సవంతో ఊరేగించి, చందనపుచెక్కలతో పేర్చిన చితిమీద చేర్చగా అవ్వ అక్కడికొచ్చి నిలచింది.

"సహగమనం చేసి సతీత్వాన్ని నిలబెట్టుకున్నావే నాంచారీ! వెయ్యివేలజన్మలకికూడా మీ ఇద్దరినీ విడదీయకుండా ఉండేందుకు ఆ భగవంతుణ్ని ధ్యానిస్తూ వుంటాను."అంటూ అవ్వ ఆ ఇద్దరికీ నమస్కరించింది. మేమందరంకూడా చెయ్యెత్తి మ్రొక్కేము. అప్పటి నుంచీ ఆయిద్దరినీ కులదేవతలుగా కొల్చుకోవడం మా కుటుంబానికి ఆచారమయింది.

ఇదంతా జరిగి నేటికి నాలుగు పుష్కరాలు గడిచిపోయేయి. కానీ నాంచారితోబాటు దేశంలో నాగనృత్యంకూడా అంతరించిపోయిందే అన్న చింత మాత్రం మిగిలిపోయింది. ఆ చింత తీరాలంటే ఎప్పుడో, ఏమిటో ?!—

# దుర్ముహూర్త ప్రభావము

శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు

సూర్యచంద్రాది గ్రహములు దేవతాస్వరూపములని మన ప్రాచీనులు విశ్వసించి భక్తితో వాని నారాధించుచుండెడివారు. ఒక్కొక్క గ్రహమునకు ప్రత్యేకముగా ఆకారము స్వరూపము, వర్ణము, స్వభావము, అలంకారము, వాహనము, భార్య, మొదలగు సామగ్రిని కల్పించి, ఆ గ్రహములను ఉపాస్యదేవతలుగా భావించి మనవారు పూజించుచుండిరి. శుభకార్యారంభముల సందర్భమున వాని అనుగ్రహమును ప్రార్థించుట సనాతన సంప్రదాయము. గ్రహముల స్వభావము ననుసరించి కొందరిని సౌమ్యులు (శుభులు) అని, మరికొందరిని క్రూరులు (పాపులు) అని, నిర్ణయించి, ముహూర్తకాలములో ఖగోళమున సౌమ్యగ్రహముల శుభస్థానస్థితిని, క్రూరగ్రహముల ఉపచయ (వృద్ధి) స్థాన సంబంధమును, సంపాదించుకొనుటకై శ్రద్ధతో మనవారు ప్రయత్నించెడివారు. కాని, ఇప్పుడో,

'రోజులు మారినవి.'

ఆధునిక విద్యావిధాన ప్రభావమువలన గ్రహములు దేవతాస్వరూపములు శుభాశుభఫలప్రదములు, అను భావము ఇప్పటి యువకులలో క్రమక్రమముగా సన్నగిల్లి మృగ్యమగుచు వచ్చినది. కొన్ని ఖనిజములు కొన్ని రాసాయనిక వాయువులు కలిసి ఏర్పడిన అచేతన గోళములే ఈ గ్రహములని మన బాలకులు పాఠశాలలలో, కళాశాలలలో నేర్చుకొనుచున్నారు. కనుక, గ్రహములు దేవతాస్వరూపములని, పూజార్హములని, తెలుపు ప్రాచీనుల సూత్రములు ఇప్పటి నవనాగరకుల దృష్టిలో, అర్థములేని చాదస్తపు వ్రాతలుగా కానవచ్చుట వింత కాదు. సూర్యగోళము నందున్న అప్రమేయమగు ఆకర్షణశక్తివలన, మనము నివసించు ఈ భూగోళమువలె, ఈ అచేతనగ్రహగోళములన్నియు విశాలాకాశరంగములో తమ తమ కక్ష్యామార్గములలో తిరుగుచున్నవనియు, సూర్యునినుండియే వానికి ప్రకాశము వచ్చినదనియు ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలనుండి మనము తెలిసుకొనగలుగుచున్నాము. అచేతన గోళమగు సూర్యుడు ఆధారములేక ఆకాశమధ్యమం దట్లు నిలిచెనో, అంత గొప్ప ఆకర్షణశక్తి ఆ గోళమునకు ఎట్లు వచ్చెనో, ఈ శాస్త్రజ్ఞులు చెప్పలేరు! లక్షల కొలది మైళ్ళదూరములో నున్న ఇన్ని మహత్తర గ్రహగోళములను మేర తప్పనీయక నిరంతరము తన చుట్టు త్రిప్పుకోజాలిన అప్రమేయశక్తికల దుర్నిరీక్ష్యప్రభావ తేజోరాశి ఈ సూర్యబింబము. అనన్యసామాన్యమగు దైవీశక్తి దీనిలో ప్రతిబింబితమైనదని భావించి పూజించుట ఈ శాస్త్రజ్ఞుల దృష్టిలో మూఢవిశ్వాసమయినది. ఈ పండిత విశ్వాసము కారణముగా, సూర్య నమస్కారములు, గ్రహపూజాదులు, నిరర్థకప్రయాస మను భావము నేటి నాగరికులలో ప్రబలుట వింతకాదు.

పోనిత్తము. గ్రహములు అచేతనగోళములైనా, వాని నుండి వెలువడు తేజఃకిరణములు మనపై ప్రసరించుట కాదనలేము. సూర్యకిరణములనుండి ఉష్ణము కలుగుట, చంద్రకిరణములనుండి చలువ వచ్చుట, మనకు దైనందినానుభవములోని విషయములు. మానవులకు వేడిమి, చలువ కలిగించు కోరిక కాని, శ్రద్ధ కాని, అచేతనములగుసూర్యచంద్రగోళములకు లేదనుకొందము. కాని, ఆయాకిరణముల సాంగత్యమువలన ఆఫలములు మన మనుభవించుట మాత్రము తప్పనిసరి. ఇతర గ్రహములు సయితము ప్రకాశము కలవే. వాని తేజఃకిరణములు సహా మన భూమిపైకి వ్యాపించుట సహజధర్మము. సూర్య చంద్రుల కిరణములకు ప్రత్యేకస్వభావ మున్నరీతిగా, ఇతర గ్రహములనుండి వచ్చు తేజఃకిరణములకు కూడ ప్రత్యేకధర్మ ముండుట అసంభవము కానేరదు.

కాని, సూర్యచంద్రుల తేజస్సునుండి కలుగు ఫలముల వలె, ఇతర గ్రహముల తేజస్సునుండి రాగల ఫలములు స్థూలరూపమున ప్రత్యక్షముగా మన కగుపడవు. ఒక పరిమితిలోనున్న స్పందనశక్తికల తేజఃకిరణముల కార్యము మాత్రమే మన ఇంద్రియములు గ్రహించగలవు. అనిర్వచనీయమైన ఈ సృష్టిలో మనకు అగోచరములగు కిరణము లెన్నియో యున్నవి. వాని కార్యములనుండియే వానిస్థితిని, స్వభావమును, పరిమాణమును, ఊహింపగలుగుచున్నాము. విద్యుచ్ఛక్తి కిరణములు, "యక్సురే" కిరణములు, మనము చూడగలిగినామా? ఇటీవల ప్రచారమునకు వచ్చిన పరమాణుశక్తియొక్క కిరణముల నెవరు చూడగలిగినారు? పరిశోధకులగు శాస్త్రజ్ఞుల సిద్ధాంతముల ఆధారమున, ఆ కిరణముల అస్తిత్వమును వాని కార్యములవలననే గుర్తించుచున్నాము. అట్లే, ఈ తారాగ్రహముల నుండి మనపై వ్యాపించు తేజఃకిరణములు సైతము ఫలప్రదములైననే వాని కార్యము అతినిశితమై, సూక్ష్మమై, దూరవ్యాపియై యుండును. పూర్వదిశాహంబమున కుజుడు చూపట్టునపుడు పుట్టిన వ్యక్తికిని, శుక్రు డుదయించు కాలములో జననమైన వ్యక్తికిని, స్వభావములో, మనోధర్మములలో, ఆకారచేష్టాదులలో, ఎంత తారతమ్యము గోచరించునో, గమనించితిమేని, ఆ గ్రహములనుండి ప్రసరించు తేజస్సు చేయగల కార్యము కొంత మన మూహింపగల్గుదుము. ఈ గ్రహధర్మములను వాని కార్యములను, నిర్వచించునది జ్యోతిశ్శాస్త్రము. అనేక శతాబ్దముల అనుభవమువలని ఫలముగా మన ప్రాచీన మహర్షులు లోకహితార్థమై ఆ శాస్త్రపు సూత్రములు రచించియుంచిరి. ఆ సూత్రములను తిరస్కరించినా, నిరాదరించినా, నష్టము మనదే. గ్రహములకుగాని, శాస్త్రమునకుగాని, లోటులేదు.

కనుక, గ్రహస్థితివలన మనకు ఫలము లేలకలుగవలెనని ఆక్షేపించుట అవిచారరమణీయము. ఒక విధముగా ఇదియును మూఢవిశ్వాసమే; లేదా, "పరప్రత్యయనేయబుద్ధి" యొక్క ఫలము. ఆధునిక విజ్ఞానశాస్త్ర నిపుణుడు సి. జి. జంగ్ మహాశయుడు చెప్పిన వాక్య మిది :

"Whatever is born or done at this Moment of time, has the qualities of the Moment of time."

(ఏ కాలములో ఏది పుట్టినా, ఏమి చేసినా, ఆ కాలపు స్వభావము దానిలో నుండును.)

ఏ క్షణమున గ్రహతేజఃకిరణములు ఏ విధమైన పరస్పరసంబంధాదులతో మన భూభాగమును స్పృశించునో, ఆ పరిస్థితులవలన ఏర్పడగల సమష్టిధర్మము ఆ క్షణమునందు జనించిన వ్యక్తియందైనా, కార్యమందైనా, చూపట్టగలదనుటేకదా? జాతకముహూర్తములకు సంబంధించిన జ్యోతిషసూత్రములకు ఈ తత్త్వమే పరమాధారము.

మన ప్రాచీనులు నవగ్రహములను వాడుకొనిరి. ఇటీవలి కాలములో, ఖగోళశాస్త్రవేత్తల పరిశోధనల ఫలముగా, వరుణ (Uranus), ఇంద్ర (Neptune) యమ (Pluto), అను నామములతో వ్యవహరించబడు తారాగ్రహములు మూడు * కనుగొనబడినవి కదా? వీనిచారములను తెలుపు పథకగ్రంథములు పయితము సిద్ధమైనవి. ఈ గ్రహములను మన ప్రాచీన హోరాతంత్రవేత్తలు తెలిసి వదలిరో, తెలియక వదలిరో, చర్చించుట మన కిపుడు ప్రయోజనకారి కాదు. ఈ గ్రహములను గొప్ప ఫలమున్నదని అనుభవము సాక్ష్యమిచ్చుచున్నది. నిష్పక్షపాతబుద్ధితో పరిశోధించి చూచినచో, పెక్కు నిదర్శనములు సులభముగా చూపట్టగలవు. అయినా, పురాతన గ్రంథములలో వీని ప్రశంస లేని కారణమున, మనవారిలో ప్రాచీనసంప్రదాయమువారు ఈ నూతన గ్రహములను నిరాదరించుచునే యున్నారు. జాతకచక్రములలో ఈ గ్రహములకు

* ఈ గ్రహములకు ఈ నామకరణము నేను చేసినదికాదు. కీ. శే. కేతకర్ పండితుడు తన 'జ్యోతిర్గణిత' గ్రంథములో 'యురేనస్సు'ను వరుణుడనియు, 'నెప్ట్యూనును' ఇంద్రుడనియు, వ్యవహరించి వాని చారాదులకు వలయు పథకముల నిచ్చియున్నాడు. అతని కాలములో 'ప్లూటో' కనుగొనబడియుండలేదు. కనుక, దాని ప్రసక్తి ఆ గ్రంథములో కానరాదు. ఈ గ్రహము 1931 లో కనుగొనబడినది. దాని స్వభావమును గమనించినవా రెవరో దానికి యముడని పేరు పెట్టినారు. ఇటీవల కొందరు యురేనస్సును ఇంద్రుడని నెప్ట్యూనును వరుణుడని తారుమారుగా కొన్ని చోట్ల వాడుచున్నారు. కేతకరు వ్రాసిన పేర్లతోనే వానిని పిలుచుట యుక్తమని నా మనవి. లేనిచో అవ్యవస్థ అగును.

# దుర్ముహూర్త ప్రభావము

స్థానముకల్పించకపోయినా, అంతగాలోందరయుండదు. ఏలందురా, ఈ గ్రహములవలన కలిగిన ఫలములను ఏ కుజునికో, అథవా, గుళికునికో, అంటగట్టి తృప్తి చెందవచ్చును. కాని, ముహూర్తచక్రములమాట వేరు. శుభస్థానములలో గ్రహములు వచ్చురీతిగా ముహూర్తములను నిర్ణయించి, వధూవరుల వైవాహికజీవితముల భవిష్యత్తునకు శ్రేయస్కరమగు మార్గము చూపవలసియున్న మౌహూర్తికులు మాత్రము ఈ గ్రహములను తృణీకరించుట క్షంతవ్యము కాని, మహాపరాధ మనుట నిస్సంశయము. వీని స్థితిని గమనించక ముహూర్తములను నిర్ణయించిన సందర్భములలో ఈ గ్రహములు దుష్టస్థానములలో నిలువవచ్చును. అనేక దృష్టాంతములలో, మౌహూర్తికులకు తెలియకయే అట్లు జరుగుచున్నది కూడ. ఆ గ్రహములు ఫలప్రదములు కావని నిరాదరించినా, అట్టి ముహూర్తములలో పరిణయమైన వధూవరుల వైవాహికజీవితములో మాత్రము ఆ గ్రహముల దుష్టఫలము చూపట్టుట తప్పదు.

"అనిచ్ఛయాపి సంస్పృష్టో,
దహత్యేవ హి పావకః"

అను న్యాయమును మనము మరువరాదు. విద్యుచ్ఛక్తి ప్రసరించుచున్న తామ్రపు తీగను, అజ్ఞానమువలన కాని, అజాగరూకతవలనకాని, మూర్ఖత్వమువలన కాని, ఎవరైన ముట్టినపుడు ఏమి ఫలము కలుగుచున్నదో, మనకు తెలియనిదికాదు. దుష్టగ్రహముల ప్రచండశక్తివలన దుష్ఫలితము వచ్చుటకు ఏ తీగలను కానీ ముట్టుకొననక్కరలేదు. కాలప్రవాహములో ఏ క్షణమున ఈ గ్రహములు దుష్టస్థానముల నాశ్రయించునో, ఆక్షణమున వివాహాదులు జరుపుటే చాలు. ఆ గ్రహకిరణముల ఆఘాతమును తప్పించుకొనగల్గుట అసాధ్యము.

అసంప్రేక్ష్యకారిత్వమువలన నిర్ధరించబడిన ఇట్టి దుర్ముహూర్తములలో ఒకదాని నిచట ఉదహరించెదను.

కడచిన శ్రీముఖ సంవత్సరమున ఫాల్గుణ శుక్ల దశమీ శుక్రవారమునాడు (23-2-1934) మృగశీర్ష నక్షత్రమున, ఉదయము 9-18 A. M. (S. S. T.) గంటలకు జరిగిన వివాహ ముహూర్తపు నిరయన శక్ర మిది :—

| | | | |
|---|---|---|---|
| | ల | | చ |
| బు<br>ర కు | వివాహము<br>—<br>నిరయన రాశి | | కే |
| రా<br>శ శు | | | |
| | | గు | |

పంచాంగశుద్ధి రమ్యముగానున్నది. విషనాడ్యాది దోషములు లేవు. కేంద్రములలో శుభగ్రహములను గురు శుక్రులున్నారు. లాభస్థానములో రవి, కుజ, బుధులు. చంద్రుడు మూడింటనుండుట. సగ్రహదోషము, చంద్రజామిత్రదోషము, పాపకర్తరి, మాధ్యదోషము, గ్రహ యుద్ధము, గ్రహణశూల, ఇత్యాది లోపములేమియు కానరావు. సప్తమశుద్ధి లేదనుమాట మాత్రము వాస్తవము. కాని, గురువు శుభగ్రహముగుటంబట్టియు, భాగ్యాధిపతియై భార్యాస్థానమునందుండు కారణమువలనను, ఇది గొప్ప లోపముగా మౌహూర్తికులు గణించలేదు. గుణాధిక్యమున్నదికదా ?

నియమితకాలమందే వైభవముగా వివాహమంగళము జరిగినది. ఇది ఇప్పటి నాగరక యువతీయువకుల వివాహములవలె, కొన్నిగంటలలో ముక్తాయమునకు వచ్చునట్టి క్రియాకలాపము కాదు. ప్రాతకాలపు ధోరణిలో సక్రమముగా, శాస్త్రీయముగా, ఐదు దినముల కార్యక్రమముతో జరిగిన వివాహమిది. రకరకములైన విందుభోజనములతో, వియ్యాలవారి వినోదములతో, హాయిగా కాలముగడుచుచుండినది. ఆటలు—పాటలు, నలుగులు--నాట్యములు, విందులు--వినోదములు, యథాసావకాశముగా, నిరంతరాయముగా జరుగుచుండిన వినోదసమయమది.

కాలగతి దుర్నివారము. వివాహముజరిగిన మరుదినమందే, నూతనవధువునకు, ఆమెతల్లితో సహా, శ్రీమ

తలనొప్పులు, జ్వరము చూపట్టినది. ఆవినోదముల సంరంభములో ఆ సమారాధనల ధోరణిలో, దానిని గమనించినవారు లేరు. మూడవనాడు (26-2-1934) ఉన్నట్టుండి, విఅపథ్యదోషప్రభావమో కాని, వధువుతల్లి ఆరోగ్యస్థితి విషమించి నాలుకలో నల్లదోషము వచ్చినది. ఆనాడే, ఆసుమంగలి ఇహలోకయాత్ర చాలించుకొనెను. ఇంతేకాదు. అమరుదినమున, అనగా 27-2-1934 నాడు, వివాహవ్రతంతు ముగిసి నూతనవధువునకు గృహప్రవేశసంస్కారము కావలసియుండినది. కాని, దుర్దైవపరిపాకమున కాబోలు, ప్రబలముగా సన్నిపాతము మూసుకొని ఆవధువుజీవితము చాలించుకొనుటచే, అగ్నిసంస్కారము జరిగినది. ఆఇంటివారి శోచనీయస్థితి వర్ణింప నలవికాదు. పాపము పెండ్లికిపోయి శ్రాద్ధమును సంపాదించుకొన్న ఆ వరుని అవస్థ మన మూహించుకొనవచ్చును.

ఇది జరిగిన కథ.

ఇట్టి ఘోర పరిణామమును సూచింపగల దోషములు ఈ వివాహముహూర్తములో ఎందున్నవి? ఇచట మనము గమనింపవలసియున్న ముఖ్యసమస్య యిది. ఎంతో రమ్యముగా చూపట్టు పైముహూర్తమునకు ఇది ఫలమైనచో, ముహూర్తశాస్త్రమున కేమి విలువ?

ముహూర్తపు లగ్నమునకు సప్తమశుద్ధి లేదనుట వాస్తవమే. సప్తమభావములో గురువున్నచో, 'విరహిణి' అగును కన్యయని విద్యామాధవ సూరి మతము. "అంగిరసాతిపాపం" అను రల్లుని మతమున కన్యక పాతకి యగును. ఇంతకంటే ప్రబలదోషమును ఈ క్రింది సూత్రము చెప్పుచున్నది.

"సప్తమగే దేవగురౌ,
భ్రష్టచరిత్రా, వివర్జితాపత్యా" అని.

మొత్తముమీద, పతి వియోగము, శీలలోపము సూచితము లనవచ్చును. కాని, ఇంతటిఘోరకార్యము జరుగ నక్కరలేదు. ఇతర సుగుణము లెన్నియో ఈ ముహూర్తమునకు ఉన్నవికదా? అవి ఏమైనవి? సప్తమ గురువునుండియే ఈ దుష్ఫలమంతయు కలిగినదని వాదించుట సాహసమనుకొందును. లగ్నాధిపతికిని చంద్రునికిని ఈ గురుదృష్టి యున్నది. పైగా భాగ్యాధిపత్య మితనికి. ఇట్టిబృహస్పతి ఇంతటి ఘోరపరిణామమునకు దారితీయుననుట కష్టము. మరి కారణ మెచట నున్నది?

"తలకంతా సూత్ర మొక్కటే!" అను సామెత చొప్పున, అష్టాంశ, రేఖాంశలను గమనింపక, ఏ జిల్లాలో, ఏ గ్రామమునకైనా సరే,

"మీన మేషౌ చతుర్నాడ్యః, గోకుంభౌ చతురర్ధకం" అను అతిస్థూలమగు రాశిమానపద్ధతిలో గుణించినది ఈ నిరయన ముహూర్తకుండలి. దీనిలో భావస్ఫుట, గ్రహస్ఫుటములు చేయలేదు. అగుటచే, అనుకొన్న రీతిగా గ్రహభావస్థితి యున్నదనుట సందేహము. మరియు, నూతనగ్రహములు ఏఏ భావములోనున్నవో, తెలియదు. ఇన్ని అవకతవకల నిరయన స్థూలరాశికుండలితో ముహూర్తముల నిర్ణయించుట ఏదేవునికి ప్రీతి?

ఈ ముహూర్తమునకు సాయనస్పష్టకుండలి ఈ క్రింద నున్నది. పాఠకమహాశయులు చిత్తగింతురుగాక.

| | | | |
|---|---|---|---|
| బు 20-12<br>కు 15-3<br>ర 3-51 | I 20-0<br>వ 24-36 | | చ 24-46 |
| శ 20-37<br>రా 18-45<br>పుణ్య10-55<br>కు 8-4 | ముహూర్త<br>స్పష్ట కుండలి<br>(సాయనము) | | యము<br>23-40 |
| X 15-15 | | | కే 18-45 |
| | | గు 22-48 | దార 7.52<br>ఇ 11-2 |

దశమ కేంద్రములో ఉన్నాడనుకొన్న శుభగ్రహము శుక్రుడు అచట లేనేలేడు. లాభ స్థానములో ఉన్నారని మనకు భ్రమ కల్గించిన కుజబుధులు స్పష్టముగా వ్యయభావములోనికి జారుకొన్నారు. స్థూలరాశికుండలిలో ఉత్తమగుణములుగా చూపట్టిన యోగములు గాలికి ఎగిరిపోయినవి.

అది యట్లుండె.

వివాహలగ్నము విప్రలంభశృంగారప్రియుడగు వరుణుని సంయోగము నభిలషించుచుండుట ముఖ్య

మూగా చదువరులు గమనించతగియున్నది. చతుర్థ కేంద్రములో పిట్టపిడుగువంటి యముడు కూర్చున్నాడు. కళత్రస్థానమునందున్న బృహస్పతికి ఆ వరుణునినుండి సమసప్తక క్రూరవేధ యొక్కటి చాలక, ఈ యమునివలన కేంద్రవేధసహా! మేరువు పూసల వంటి యీ యోగములు చాలవా, ముహూర్తమునకు ముప్పు తెచ్చుటకు? క్రూరగ్రహముల విషమదృష్టికి లోనైన గురువు పాపియైనాడు. పాపగ్రహ క్రూరదృష్టి గల గురువు సప్తమభావమునందున్నచో, అతడు పాపులలో మహాపాపి యగుననుట మరువరాదు. కళత్రభావము, లగ్నము, చెడినవి. లగ్నాధిపతి యగు కుజుడన్ననో, వ్యయభావములో పడియుండు కారణమున అసమర్థుడై, లగ్నమును కాపాడుకోలేని అసహాయస్థితిలో అల్లాడుచున్నాడు.

"తను పతిస్తను, మస్తమథాస్తతో,
యది న పశ్యతి నశ్యతి తన్మఖం."

అనుచున్నది 'వివాహ బృందావనము.' సప్తమమునకు సప్తమాధిపతి దృష్టి, అంతో ఇంతో ఉన్నది. కాని, లగ్నమును కాపాడువారెవరు? ముహూర్తకాలములో లగ్నము వధువును సూచించుననుట జ్యోతిష సంప్రదాయము.

ఇక, చతుర్థ కేంద్రపుగతి చూడుడు. అచటి యముడు యాజమాన్యమును నిర్వహించుచున్నాడు కదా? చతుర్థాధిపతి చంద్రుడన్నచో, శుక్రుని సార్థ కేంద్రవేధతో చెడినాడు. ఈ భావము దోషదూషితమైనది. ఈ చంద్రుడు పుణ్యసహమమును సార్థకేంద్ర క్రూరదృష్టితో కటాక్షించుచున్నాడు. చతుర్థభావము గృహమును, కన్యాజననినిసహా, తెలుపునట్టిది. ముహూర్తములో దీనికి ప్రబలదోషము పట్టియున్నదనుట.

దారసహమము షష్ఠస్థానమునకు పోయి వరుణుని సార్థకేంద్రదృష్టికి, యమ, గురువుల అర్ధకేంద్ర దృష్టికి, చిక్కి తటపటాయించుచున్నది. పైగా మాయలమారి ఇంద్రుని సంయోగముచే ఇది అపేక్షించుచుండుట! ఈ సహమాధిపతి బుధుడు నీచపడి వ్యయభావములోనున్నాడు. చాలదని, రవి కుజుల క్రూర సమసప్తకదృష్టి ఈ సహముపై నున్నది. దారసహమము ఇంత చెడియున్న ఈముహూర్తమున జరిగిన దారకర్మవలన సౌఖ్యమెట్లువచ్చును?

"భార్యా సద్మ శుభైర్దృష్టం, యుతంవా
స్వామినా యది।
భార్యా విలాస సౌభాగ్యం, వాన్యథా
గృహజం సుఖం."

అను తాచకసూత్రము నిరాదరణీయమా?

సారాంశమేమనగా, లగ్నము, చతుర్థము, ఈ ముహూర్తకాలమున ఎంత చెడుటకు సాధ్యమో, అంత చెడియున్నవనుట. వధువునకు (లగ్నము), ఆమెతల్లికి (చతుర్థము), ఈ ముహూర్తము ప్రబలారిష్టమును తెలుపుచున్నది. ఫలము ప్రత్యక్షమైనదికదా?

లగ్నాధిపతి కుజుడు వ్యయమందున్నాడు; సప్తమశుద్ధి లేదు; ఇతర కేంద్రములలో శుభగ్రహములు నిలువలేదు; దారసహమము చెడినది. ఈ సన్నివేశము చాలదా, ఈనూతన గ్రహములను తెచ్చిపెట్టకున్నచో ఏమి పుట్టెమునిగినది? అనువారుందురేమో? వరుణుడు లగ్నములో, యముడు చతుర్థములో, ఉండియుండనిచో, ఇంతటి దుష్పరిణామము నిస్సంశయముగా కలిగియుండదని ఘంటాఘోషముగా చెప్పవచ్చును.

ఈ ముహూర్తమున ప్రబలారిష్టమును సూచించినది వరుణగ్రహమే అనుటకు నిదర్శనమేమి? అను ప్రశ్న వచ్చుట సహజము. కానిండు. అరిష్టప్రదమగు గ్రహమును చంద్రుడు చేరినప్పుడు అరిష్టము ఫలించునని వరాహమిహిరాచార్యుని సూత్రము.

"యోగే, స్థానంగతవతి బలినః చంద్రే," అని ఇది ఉపలక్షణ వాక్యము. కాలనిర్దేశవిషయమున చంద్రునికంటే ఎన్నియో రెట్లు సూక్ష్మమై, ప్రబల ఫలమునిచ్చునది లగ్నముకదా? కనుక, అరిష్టసూచక గ్రహమును లగ్నము చేరుకొన్ననాడే దుష్ఫలము రావలసియుండును.

"శశిరకర సమాగమేక్షణానాం,
సదృశఫలం ప్రవదంతి లగ్నజాతం,"

అను వరాహమిహిరుని సూత్రమును స్మరింపుడు. భచక్రభ్రమణముకారణముగా, లగ్నము క్రమక్రమముగా, దినమొక్కటికి రమారమి ఒక్క భాగవంతున ముందునకు జరుగుననుట జ్యోతిశ్శాస్త్రసంప్రదాయము. దీనిచే దైనికజాతకపద్ధతి యందురు. * ఈవిధమగు చలనము

* కడచిన తారణ సంవత్సర ఫాల్గుణమాస 'భారతి' సంచికలోని దైనికజాతకమును వ్యాసమును చిత్తగింపుడు.

వలన, వివాహానంతరము మూడుదినములకు, చతుర్థభావ మందలి యముని కేంద్రవేధలోనున్న సప్తమగురువునకు వివాహలగ్నము ఎదురుగా వచ్చినది. వరుని అత్తగారు పరమపదయాత్ర చేయుట ఆనాడే! ఆ మరుదినమందే ఈ చలితలగ్నము వియోగకారకుడగు వరుణుని సమాగమమును సంపాదించును. వరునికి భార్యావియోగ క్లేశము కలుగుట అప్పుడే!

"ఏకాంశయుక్త్యాతు దినే ఫలంస్యాత్,
యోగస్తథైకాంశ సమాగమోక్తిః."

అను ప్రాచీనసూత్రము తు. చ. తప్పకుండా యిచట అన్వయించుచున్నది. ఇంతకంటె, ప్రబల నిదర్శనము మనకిచ్చుట లభింపగలదు?

ఇది ఇట్లుంచి, ఈ వ్యక్తి జాతకము నొక్కింత పరిశీలింతము. దానిలో యోగము లెట్లున్నవో?

అతని సాయనజాతక చక్రమిది:—

| | | |
|---|---|---|
| రా 13-48<br>బు 11-58 | ర 7-8-55<br>శు 18-15<br>చ 27-59 | శ 13-2<br>యమ 29-7 |
| గు 14-30<br>వ 10-38 | స్పష్ట గ్రహభావ కుండలి<br>—<br>[సాయనము] | కు 15-1<br>ఇ 25-27<br>దార 21-31<br>X 25-32 |
| పుణ్య 16-59 | I 25-9 | కే 13-48 |

సప్తమభావము గ్రహశూన్యమగుటచే, సప్తమాధిపతియు, కళత్రకారకుడునగు శుక్రునిపై మన దృష్టి ప్రసరింపవలసియున్నది. ఈ శుక్రుడు మేష రాశిలో అరింట నున్నాడు. ఉపచయమందుండుటచే, సులభముగా ద్రవ్యము నార్జించుటకు ఈ యోగము పనికివచ్చినా, వివాహ విషయమున లోపమునకు తీరదు.

"జాయేశే చాష్టమే షష్ఠే రోగిణీం కామినీం లభేత్
క్రోధయుక్తో భవేద్వాపి నసుఖం లభతే క్వచిత్."
[బృహత్పరాశరహోర]

అనుటచే భార్యయొక్క అనారోగ్యమువలనకాని, కారణాంతరములవలనకాని, జాతకునికి సౌఖ్యాభావమును తెలుపు యోగ మిది. మరియు లగ్నాధిపతియగు, కుజుని నుండి సప్తమాధిపతి శుక్రుడు కేంద్రవాసి యగుటచే

"శత్రుదృష్ట్యాన దంపత్యోః
నిత్యం ఝుకటికో భవేత్."

అను తాచక సూత్రము ననుసరించి, జాతకునికి భార్యతో సామరస్యము తక్కువ అనవచ్చును. అయినా, ఈశుక్రునికి కుటుంబ (II) పంచమా(V)ధిపతి గురువునుండియు, తృతీయ, చతుర్థాధిపతి శని నుండియు, మిత్రదృష్టిసౌకర్య ముండు కారణమున భార్యాభర్తలకు రాగల వైమనస్యమో, అభిప్రాయ భేదమో, హెచ్చుతొందర కలిగించక ఏదో రీతిగా 'సర్దుపాటు' కాగలదు. పోతే, పుణ్యసహమము, దార సహమము, శుక్రుని మిత్రదృష్టిలో నున్నవి. అగుటచే కళత్రభావమునకు ప్రబలదోషము పట్టినదని చెప్పలేము. చతుర్థ పంచమాధిపతులగు గురు శనులు చతుర్థమందే యున్నారు. శుక్రుని మిత్రదృష్టి వీరిపైనున్నది. చక్కని వైవాహిక జీవితానుభవము, సత్సంతాన సౌభాగ్యము కలవనుటకే సూచనలు అధికముగా మాపట్టు చున్నవనుటే సమాజసము.

వాస్తవస్థితిలో, మరల సంవత్సరమునకే జాతకునికి చక్కని వధువులభించి వివాహమైనది. అతని గృహిణి ఆదర్శప్రాయయగు సాధ్వి. దశమకేంద్రమందలి దార సహమమునకు, కుటుంబభావమందలి పుణ్యసహమమునకు, కళత్రాధిపతి శుక్రుని స్నేహదృష్టిఫల మది. కష్టసుఖములలో తోడునీడగా నిలిచి, ధర్మార్థకామములను భర్తకు కరతలామలకముగా సాధించి ఇచ్చిన పతివ్రత ఆమె. నవనవాభి రుచు లూరించు ముగ్ధమధుర భావములతో, భక్తిలో శృంగారమును, శృంగారములో భక్తిని, ఈ రెండింటితో సంగీత సాహిత్యములను, మేళవించి ఆనందపారవశ్యమున తన్మయతచెందు లలిత కళారాధకుడు జాతకుడు. భాగ్యమందలి ఇంద్రునికి చంద్రశుక్రుల కేంద్రదృష్టి మాత్రమే కాక, బుధుని సార్ధకేంద్రదృష్టిసహా కలదు కదా? పదునైదు సంవత్సరముల తరువాత ఒక విచిత్రసంఘటన జరిగినది. జాతకుని రసపరతంత్ర కోమలచిత్తవృత్తిచే నాకర్షింపబడి, హృదయసమర్పణ చేసి, ఏదేకనిష్ఠతో సర్వస్వత్యాగమునకు ఒక విద్యావతియగు యువతి సిద్ధపడగా

"తరుణి, వనవ్యకాంత, నలి దారుణ పుష్ప
శిలీముఖ వ్యథా,
భర వివశాంగి, నంగభవుబారికి నగ్గముచేసి
క్రూరుడై,
చనియె మనోధరాధను దహంకృతితో."

అని ప్రవరునికి మన ఆంధ్రకవితాపితామహుడంట గట్టిన అపఖ్యాతి తనకు సైతము వర్తించవచ్చునని వెరచి కాబోలు, జాతకు డామెను పరిగ్రహించి పెండ్లి యాడెను. దాంపత్యజీవితములో దక్షిణనాయకత్వ మును అతను సాధించాడు. గంగాయమునలవలె పూతచరిత్రలగు ఇరువురు భార్యలతో సత్సంతాన సౌభాగ్యము కలిగి జాతకు డానందించుచున్నాడు.

జాతక యోగమునకు తగినరీతిగా నున్నది జీవి తానుభవ మనుకొందును. కళత్ర స్థానమునకు ఏదైనా దోషమున్న దన్నచో, అది అత్యల్పము. మరి ప్రథమ వివాహసందర్భమున ఇట్టి విషాదాంతకథ జరుగనేల? దుష్టదశాకాలములో వివాహము జరిగినచో, జాతక మందలి ఏ స్వల్పదోషమయినా నూరంతలుగా ప్రబలి దుఃఖానుభవమును తెచ్చిపెట్టగలదు. ఇట్టిదశకు తోడు ముహూర్తము దుష్టమయినచో, చెప్పపని లేదు. ఈ వివాహముహూర్త మెంత శోభాయమానముగా నున్నదో కనుగొన్నాము. ఇక అప్పటికి జీవమానదశ ఏమి సూచన లియ్యగలిగియుండెనో పరిశీలింతము. ఈ క్రింద నున్నదే చలితకుండలి:—

| | | | |
|---|---|---|---|
| రా 12-46 | బు 1-8<br>ర 26-38 | కు 12-42 | శ 14-48 |
| గు 17-52<br>న 11-15 | వివాహ కాలమునకు<br>చలిత జాతకము<br>—<br>(సాయనము) | | శు 23-13<br>ఇ 25-23 |
| చ 29-45<br>పుణ్య 4-57 | | | |
| I 18.0 | | | దార 10-15<br>కే 12-46<br>X 16-30 |

చలితలగ్న మెందున్నదో, గమనింపుడు. మృత్యు (VIII) భావమందున్న జన్మశనికి నికరముగా సమసప్తకవేధలో చలితలగ్నము నిలిచిన వయస్సది. అనగా, చలిత సప్తమ (కళత్ర) భావము అష్టమశని సంయోగమును పొందియుండె ననుట! మృత్యుదేవత భార్యను ఎదురుచూచుచుండిన దని యర్థము. ఇట్టి దుర్దశలో భార్యను సంపాదించుకొన్నచో, ఆకలి గొన్న మృత్యుదేవతకు ఆహారమును ఎదిగించి ఇచ్చుట కాక మరియేమి? ఇంతేకాదు. జన్మచంద్రునినుండి పార్థకేంద్ర విషమదృష్టిస్థానమందే చలితలగ్న మిపు డుండుట. చలిత చంద్రుడు చలితశనితో వివాహ కాలములో పార్ధకేంద్రము. ఇట్టిదశలో నా వివాహము?

జన్మచంద్రునికి కేంద్రవేధ నిచ్చువాడు మాయలమారి ఇంద్రుడు. ఇట్టి ఇంద్రుని అర్థకేంద్ర వేధలో చలితదారసహమము ఇపుడున్నది. వివాహ మునకు ఈ దశాకాలము తగనిదని వేరుగ చెప్ప వలయునా?

పెండ్లినాటికి జాతకుని వయస్సు ఇరువది సంవత్సరములు మాత్రమే. అంత చిన్నవయస్సులో, ఇంతటి దుష్టదశాకాలములో, వివాహము జరిపి యుండనక్కరలేదు. పెండ్లిచేసుకొన్న జాతకుడు సాధించినదేమున్నది? ఒక్క శ్రాద్ధముతప్ప! ఒక ఏడాది కాచియున్నచో, దుష్టదశ కడచిపోవును కనుక, తరువాత వివాహము జరిగినచో, ఇట్టి దుర్యోగము రాదు. అనుభవ మట్లే చెప్పుచున్నది. ఏ యోగ మయినా, దానికి తగినదశరానిచో ఫలించదుకదా?

"యోగా స్తే కిం కరిష్యంతి
స్వదశానా మనాగమే?"

అని అనుభవజ్ఞులగు పెద్దలు చెప్పిరి.

జాతకదశాసూచనలను, ముహూర్తశాస్త్ర సూత్రములను, నిరాదరించుట ఎంత అవివేకమో, నూతన గ్రహములను గమనించక ముహూర్తములు నిర్ణయించుట ఎంత ప్రమాదకారియో, సహృదయు లగు పాఠకమహాశయులు గమనించియుందురని ఆశ.

"జ్యోతిశ్చక్రాత్తు లోకస్య
సర్వస్యోక్తం శుభాశుభం."

వృద్ధగర్గుడు.

# సరోజిని

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఏటిపాయనుండి నీరుతెచ్చుకుంటున్న ఆ పల్లెపడుచు వీధి మధ్య దాకా వచ్చి, అనాలోచితంగానే ప్రక్కకు పరికించి, ఒక్కసారిగా కళవళపడి, భయోద్వేగాల భారం మూలంగా చంకనున్న కడవ జారవిడిచి, ఆసరాకు ప్రక్కనున్న పిట్టగోడ వానుకున్నది.

"ఏమిటీ వైపరీత్యం? మానవ దేహాలింత అశాశ్వతాలా?"

ఆమె హృదయంలో ఎక్కడో, ఏదో అశాంతి ...ఏదో శూన్యభావం. బాధ నోర్చుకోలేని ఆమె హృదయం గొంతులోనికి వచ్చి కొట్టాడుకున్నది. ఆమె నేత్రాలు బాష్పబిందువుల నింపుకొని మసకతెరలచాటునుండి ఎదుటి దృశ్యంలోని ఆ దీనత్వాన్నీ, వేదననూ దర్శించడం మొదలు పెట్టినవి.

"నిన్నటివరకూ తా మిద్దరూ కలసిమెలసి బ్రతికారు. ఒకేసారి కాపురానికి వెళ్లారు. బిడ్డలను వొకేసారి చంక నెత్తుకున్నారు. కల్గినదాంతో తృప్తిపడి, మధ్యాహ్న సమయాల్లో వైకుంఠపాళీ ఆడుకుంటూ—సాయంకాలం తీరిగ్గా కూచుని సరదాకు తగవులాడుకుంటూ తమ తమ కుటుంబ విషయాలు అరమరిక లేక ముచ్చటించుకుంటూ ప్రొద్దుబుచ్చేవారు. అయ్యో! స...రో...జి...నీ!"

చీర కొంగుతో కండ్లు తుడుచుకుని, మెల్లగా అడుగులు వేసుకుంటూ ఎదుటనున్న మండువా లోగిట్లోకి ప్రవేశించబోయి, అడ్డువచ్చిన ఆ పసుల కాపరులను చూచి క్షణంసేపు అట్టె నిల్చున్నది.

సూర్యోదయాత్పూర్వమే, పసువులను పొలాలకు తోలుకు వెళ్తున్న ఆ పల్లెపిల్లలు ఆ యింటిముందు మూగిన జనాన్ని, ఒక్క లిప్తకాలం ఆగి పరిశీలనగా చూచి తిరిగి తమ కది సంబంధించిన విషయం కాదన్నట్లుగా, మహీపారూఢులై ముందుకు సాగిపోయారు.

వారు తనను దాటిపోయిన తదుపరి భారంగా అడుగులు వేస్తూ, మండువాలోని అరుగులను సమీపించిందామె. అరుగులమీద జనం ఎవరూ లేరు. ఓ పసిపిల్లవాడు మాత్రం, ఓ మూలగా కూచుని, దిగాలుగా, కదిలిమెదిలే ప్రపంచంలోని ఈ నీడలతో సంబంధం లేదన్నట్లుగా, కన్నీరు కార్చడానికైనా వోపిక లేదన్నట్లుగా వున్నాడు. అప్పుడప్పుడే ఎల్లబారుతున్న సూర్యకిరణాల్లో, తైలసంస్కారంలేని అతని జుట్టు మొహంమీదకు పడి ఫాలతలాన్ని కప్పివేస్తున్నది. అతని పెదవులు కదలాడుతున్నా, మాటలు నోట్లోనుంచి బయటకు రావడంలేదు. అతని వంటిమీదనున్న ఆ మాసిన దుస్తులు ఎప్పుడు ధరించినవో!

ఆమె అతనిని సమీపించింది. అతనిని చూచి నిశ్చేష్టురాలై నిలచింది. "ఇదేమిటి? రఘు—రఘు కాదూ వీడూ?"

ఆమెలోని మాతృత్వం తెరలను తొలగించుకున్నది. హృదయం విశాలమై వెలిగింది. కండ్లలో అశ్రుకణాలు ..పెదిమలు తడబడినవి. ఆమె వదనం సంపూర్ణంగా చలించింది. "బాబూ!" అంటూ ఒక్కసారిగా చేతులు చాచి ఆ పిల్లవాణ్ణి సందిట పొదువుకున్నది.

కానీ—ఆపిల్లవాడు మాట్లాడలేదు. కండ్లు తెరిచి ఎదుటి వ్యక్తిని గమనించలేదు. మరు మాటాడకుండా ఆమె సందిటనొదిగి, ఆమె చీరచాటున వేదనను దాచుకున్నాడు. ఆమె అతని జుట్టులోకి వ్రేళ్ళుపోనిచ్చి ప్రేమగా సవరించి "బాబూ! రఘూ!" అంటూ దుఃఖావ్నాపుకోలేక కన్నీటతో అతని మూర్ధాన్నభిషేకించింది.

మొహంమీదపడ్డ కన్నీటిముక్కల నతడు తుడుచుకోనేలేదు. ఆమె వేదనలో పాలు పంచుకుని దుఃఖాశ్రువులు రాల్చలేదు. ఒక్క నిట్టూర్పు మాత్ర మతని

నుంచి వెలువడింది. ఆమె అతనిని చూచింది. ఆశ్చర్య పడింది. ఒక్క అడుగు వెనక్కు వేసింది. తిరిగీ అతని వేపు నిశితంగా చూచింది. సమాధిలోనున్న యోగివలె మౌనముద్రాలంకృతుడై, అంతర్ముఖావలోకనం చేసు కుంటున్నాడతడు.

ఆమె కీవిషయమే అంతుబట్టలేదు. "ఈ పని వాడు ప్రేక్షకుల హృదయాలు ద్రవించేటట్లు బిగ్గరగా దుఃఖించడేం?"

ఆమెలోని అహం కొద్దిగా దెబ్బతిన్నది. తన వేదనకన్న, ఈకుఱ్ఱవాడి మౌనం, ఎక్కువ బాధను తెల్పుతుందన్న సత్యం ఆమెగ్రహించలేక, ఆకుఱ్ఱవాడి వేపు ఒక్కసారి దయగా, జాలిగా చూచి ముందుకు-జనం గుమిగూడినచోటికి వెళ్ళింది.

ఆదృశ్యం — చూడలేక — మొహానికి చేతుల నడ్డంపెట్టుకున్నది. చీరచెరగు మెడచుట్టూ తిప్పుకుని మొహం మీదకు లాక్కున్నది. కానీ స్పష్టాతి స్పష్టంగా ఆ దృశ్యం, హృదయవిదారకమైన ఆదృశ్యం కనిపిస్తూనేవున్నది. బాహ్యేంద్రియాలతోపాటు అంత రింద్రియాలుకూడా అనిమిషులై పనిచేస్తూ—ఆ దృశ్యాన్ని దర్శిస్తూనే వున్నవి. ఎంత హృదయ విదారకమైన దృశ్యమది!

పచ్చని సూర్యకిరణాల్లో పసుపు పచ్చని ఆమె వదనం మరింతగా వెలుగుతున్నది. జీవరహితమైనా జీవకళలను నింపుకొన్నట్లుగావున్నది. గోడవారకు ఆనించిన ఆమె దేహం—తనను చూచి దుఃఖిస్తున్న వారిని పరిహసిస్తున్నట్లుగా వున్నది.

అతను బ్రాహ్మణుల మంత్రాలతో యాంత్రికంగా కర్మవిధులను నెరవేరుస్తున్నాడు. ఆమెకు సచేలస్నానం చేయిస్తున్నాడు. "అయ్యో సరోజినీ!"

అతనిలో చైతన్యంలేదు. కన్నీళ్ళులేవు. ఆలోచన లేదు. లేవు! లేవు! ఏమీలేవు అతనిలో!

పుణ్యస్త్రీలందరూ సరోజినిని చూస్తున్నారు. 'అదృష్టవంతురా' లని కళ్ళు తుడుచుకుంటున్నారు. అదృష్టవంతురాలు?

పుణ్యపురుషులందరూ సరోజినిని చూచి జాలి పడుతున్నారు. పాపమని నిట్టూర్పులు విడుస్తున్నారు. అతని దురదృష్టానికి దేవుణ్ణి దూషిస్తున్నారు.

చనిపోయిన సరోజినికిని వినిపించడంలేదు. బ్రతికివున్న జగన్నాథానికి అంతకన్నా వినిపించడం లేదు.

సరోజిని తనను చూచి నవ్వుతున్నట్లే వున్నదతనికి. తలస్నానం మూలంగా రేఖామాత్రంగా కనిపిస్తున్న తన అవయవాలను చూచి సిగ్గుతో కుంచించుకుపోతున్నట్లేవున్నదతనికి. నలుగురుబిడ్డల తల్లి సరోజిని సంసార భారాన్ని వహిస్తావని తన కభయమిస్తున్నట్లే వున్న దతనికి.

అతని దృష్టిలో సరోజిని బ్రతికేవున్నది!

సరోజినికి చావులేదు!

ఆ దృశ్యం చూడలేక వచ్చిన ఆ పల్లె పడుచు వసారా మీదకు దృష్టిమళ్ళించింది. అక్కడి ఆదృశ్యం—ఆ కాసేపూ ఆ స్థలం శోకదేవతకు ఆలవాలమైనట్లనిపించింది.

ఆరోనెల దాటని పసిగుడ్డు పాలకోసం అదేపనిగా గుక్కపట్టి ఏడుస్తున్నది. మూడోసంవత్సరమైనా నిండని రాముడు ఆ కలితో అలమటించి పోతున్నాడు. ఇక కమల సరేసరి ఏడ్చే ఓపికకూడా లేక జరుగుతున్న తతంగం అర్థంకాక, కళ్ళు తెరుచుకునే శోషతో చాపకు ఓమూలకు చుట్టచుట్టుకొని పడుకొనివున్నది.

అక్కడవున్న జనానికి ఈపసివారి గోల వినిపించడంలేదు. జగన్నాథాన్ని పరామర్శించడంలో వున్న శ్రద్ధ ఆ పసిపిల్లలకింత ఆదరువు చూపించాలన్న విషయంలో లేదు.

ఆమె కిదంతా విచిత్రంగా కన్పించింది. త్వర త్వరగా ముందుకు రెండడుగులువేసి, ఆ పసిదాన్ని చంకనెత్తుకుని రొమ్మునందించింది, పమిటచెంగు చాటుచేసుకుని. ఆ పసిదాన్ని బ్రతికించింది.

వసారాలో మూలగావున్న బల్లమీద కూచుని, పసిదానికి పాలుపడుతున్న ఆమెకు గడప దగ్గరగా కూచున్న వయోవృద్ధులైన ఆడవాళ్లు కొందరు కన్పించారు. గుమ్మానికి ఆనుకునివున్న వాళ్లు పార్వతమ్మ గారిని సముదాయిస్తున్నారు.

పాలు సరిగా అందక బాధపడుతున్న ఆ పసిదానికి, రొమ్ము సరిగా అందిస్తున్న ఆమెకు వాళ్ళమాటలు కొన్ని ధ్వనిమాత్రంగా విన్పించాయి. "పెద్దదానివి నువ్వే ఇట్లా అధైర్యపడితే ఎలా చెప్పు? ఆ పసివాళ్ల

గతేం కాను? తమ్ముడు చూడు ఏలావున్నాడో! కూతురు పోయిందనే దుఃఖపడుతూ కూచుంటే, ఆ తమ్ముడిగతి ఎవరు చూచేను? ఒకరికొకరు అండగా నుండవలసినవాళ్లు."

పార్వతమ్మ జవాబుచెప్పలేదు. తలదించుకొని, దిగులుగా, మౌనంగా, కన్నీళ్ళుకారుస్తూ వుండి పోయింది.

వాళ్ళింకా చెప్పుకుపోతూనే వున్నారు. తమ్ముడికి బిడ్డనిచ్చి పెళ్లిచేశావు. బాగానే వున్నది. కానీ ఇట్లా అవుతుందని నువ్వుమాత్రం కలగన్నావా? ఆ పసివాళ్లు నలుగురూ నువ్విట్లా ఉపేక్షాభావంతో, నిర్లక్ష్యంతో దుఃఖిస్తూ పడివుంటే ఏమై పోతారు? ఆలోచించు పార్వతమ్మా—నలుగురికి చెప్పదగిన దానివి, నువ్వే ఇలా అధైర్యపడితే!—

చెబుతున్న దెవరా అని పిల్లకు పాలిస్తున్న ఆపల్లె పడుచు ముందుకు రెండడుగులు వేసి ఇంట్లోకి తొంగి చూచింది. ఇంకెవరు? సాక్షాత్తూ తన అత్తగారు! ఆమె తన నిప్పుకు ఇక్కడచూస్తే ఇంకేమైనా వుందా?

గాభరాగా ఆపసిదాన్నక్కడ దింపి, తడబడు తున్న అడుగులతో, ఆ జనసమూహాన్ని తప్పించు కుంటూ వీధిలోకివెళ్లి, క్రిందపడివున్న కడవను చంక కెత్తుకుని తిరిగీ ఏటివేపు నడకసాగించింది, మనసులో ఇష్టంలేకపోయినా ఆ పల్లెపడుచు. నిండీ నిండని కడుపు మూలంగా బాధ మిక్కుటమై మళ్లీ ఆ పసిది గొడవచేయడం ప్రారంభించింది.

నాలు గ్గోడలమధ్యా జీవితాలను గడుపుతూ, ప్రపంచంలోని అనుభవాన్నంతా మూటగట్టు కొంటున్న ఆ పుణ్య స్త్రీలు తమ లోకంలో తాము మాట్లాడుకొంటూ పార్వతమ్మను సముదాయిస్తున్నారు.

బ్రాహ్మణులు తమ మంత్రాలను పూర్తి చేసు కుంటూ, నిరుపయోగమైన ఆ కట్టెనిక శ్మశానస్థలికి గొనిపోవచ్చునంటూ జగన్నాధానికి అనుజ్ఞ యిస్తు న్నారు.

ప్రపంచంలో యధాప్రకారం విధినిర్వహణ జరిగి పోతూనేవున్నది. కన్నీళ్ళూ, ఆనందాలూ అన్నీ ప్రక్క ప్రక్కనే ప్రయాణం సాగిస్తూనే వున్నవి.

* * * *

ఈ లోకంలో లేకుండా పడివున్న పార్వతమ్మ, కొంత సేపటికి తనకుతానే దిటవు తెచ్చుకుని బయటికి వచ్చి పరిస్థితి నవలోకించింది. మిగిలినదేమున్నది?

గోడుగోడున అలమటిస్తున్న పసిపిల్లలు—శవవాహనానికై అయిష్టంగానే ఏర్పాట్లు సాగిస్తున్న జగన్నాధం—కళ్ళు తుడుచుకుంటున్న పూరిప్రజలు: ఆమె కంట్లుకూడా ఆర్ద్రాలయినవి. హృదయం చిక్క బట్టినట్లైంది. దేహంలో నిస్సత్తువ...ఇంద్రియాలకు స్వేచ్ఛ లభించినట్లైంది. మెల్లగా ఆమె ఆ పసివాణ్ణి చంకనిడుకొని మిగిలిన పసివారిద్దరనీ చేతబుచ్చుకొని వంటింట్లోకి నడిచింది కాసిని పాలైనా పడదామని. కానీ అప్పటికే పిల్లివొకటి సంతుష్టిగా కళ్ళు నార్పు కుంటూ వంటింట్లోనుంచి బయటకు వస్తున్నది. పార్వతమ్మ నిస్సహాయురాలైంది. పిల్లలవైపు బాధగా, బరువుగా చూచింది. చేసేది లేక చంటిదాన్ని గుండె కదుముకొని నిట్టూర్చింది.

ఆమె పరిస్థితి నర్థంచేసుకున్న పొరుగింటి యిల్లా లొకామె ఆ పిల్లలకై చేయిచాపింది. మౌనంగానే పార్వతమ్మ ఆ పిల్లలను తన కందీయడంతో, వారిని చేత బుచ్చుకొని తన యింటివేపు నడిచి వెళ్ళింది. వెళ్తున్న ఆ యిల్లాలిని చూచి పార్వతమ్మ హృదయం ఆమెకు తెలియకనే తేలికపడినట్లైంది. తడియారని కళ్ళతో ఆ యిల్లాలినీ, తన పిల్లలనూ మనసులోనే మెల్లగా దీవించింది.

దీవించిన ఆ కళ్లతోనే మళ్ళీ తమ్ముడి వేపుకు దృష్టి పోనిచ్చింది. తమ్ముడిని చూచిన ఆమె హృద యంలో మళ్ళీ దిగులు రగిలింది. తెలియని బాధ ఆమెను నిలువెల్లా ఆక్రమించుకున్నది. "వెర్రివాడు! ఈ వయసులో వాడి కెన్నికష్టాలు!"

పార్వతమ్మ తలపులు ఒక కొలిక్కి రాకముందే నలుగురూ వొక్కుమ్మడి చేస్తున్న శబ్దాలు ఆమెను బాహ్యంలోనికి తీసుకుని వచ్చి ఆమె చూడలేని దృశ్యాన్ని ఆమెకు చూపించాయి.

తమ్ముడు, అగ్నిని చేత బుచ్చుకుని దిగాలుగా, జీవచ్ఛవంలా, నుంచున్నాడు. నలుగురుబ్రాహ్మణులు-సరోజినిని తమ బుజాల పైకి ఎత్తుకుంటున్నారు.

'.అయ్యో! సరోజినీ!"

పార్వతమ్మ హృదయం, హృదయంలో లేదు. ఆమె, పంచ ప్రాణాలూ, ఒకటై ఆమెనుండి శాశ్వతంగా సెలవు పుచ్చుకొనడానికి సిద్ధపడుతున్నట్లనిపిస్తున్నవి. ఒక్కసారిగా ఆమె చలించిపోయి "అమ్మా! సరోజినీ!—తమ్ముడూ!" అంటూ వికృతంగా ఒక్క కేక పెట్టి ఆ బ్రాహ్మణుల కాళ్ళకు అడ్డంపడింది.

పైన ఆకాశంలో వున్న సూర్యుడు, సహస్ర కరాలతో ప్రపంచానికి రక్షణ కల్పిస్తున్నాడు. మధ్య మధ్యలోమాత్రం నిస్సహాయంగా మబ్బు ముసుగులు మొహానికి కప్పుకుంటున్నాడు. పార్వతమ్మకు మన స్పృహ లేదు. జగన్నాథానికి ఈ లోకం లేదు.

నలుగురు ఆడవాళ్లు బలవంతంగా, పార్వతమ్మను అక్కడినుంచి వసారాలోకి తీసుకునిపోయారు.

జగన్నాథం వీధిలోకి వచ్చాడు. శవవాహకులు రెండడుగులు ముందుకు వేశారు.

ఇంతలోకి పిల్లలను తీసుకువెళ్లిన ఆ పొరుగింటి యిల్లాలు, ముగ్గురు పిల్లలనూ తీసుకువచ్చింది. చంటి పిల్లచేత, సరోజినికి పాదాభివందనం చేయించింది. పెద్దదానిచేత తల్లినొసటిని కుంకుమ పెట్టించి, నమస్కారం చేయించింది. రాముడికి వాళ్లమ్మను ఒక్కసారి చూపించి తిరిగి ఇంట్లోకి తీసుకుని వెళ్లింది.

జగన్నాథం ముందుకు సాగిపోతున్నాడు. శవవాహకులు భారంగా అడుగులు వేసుకుంటూ అరుగులదాకా వచ్చారు. ఇంతలో, పదేండ్లుదాటని ఓ చిన్న కుఱ్ఱవాడు వాళ్ళను సమీపించి, మౌనంగా వాళ్ళకెదురుగా నిలబడి, కళ్లుమూసుకుని, నమస్కారం చేసి, మాట్లాడకుండా తన స్థానంలోకి వెళ్లి కూచున్నాడు.

తోచినవారు సరోజిని దేహంమీద పూలు చల్లారు. పెద్దమనుష్యులు పిల్లల భవిష్యత్తును గూర్చి చర్చించుకొన్నారు. ఆడవారూ, మగవారూ కలిసి ఏక గ్రీవంగా ఆ కుటుంబానికి సంబంధించిన విపత్తుకు విచారించారు.

కానీ ఎవరూ గూడా తమననుసరించి, తమ మాటలు వింటూ వస్తున్న ఓ పదేళ్ల కుఱ్ఱవాణ్ని గమనించలేదు.

* * * *

కాలచక్రం వొకరి ప్రమేయం లేకుండా తనంతటతాను కొత్తదుస్తులు తొడుక్కుంటున్నది. సూర్యుడు కొత్తరంగులు పులుముకుంటున్నాడు. అపరాహ్ణం దాటి, సాయంత్రంలోని ప్రథమాంకం గడిచిపోవస్తున్నది. చల్లని ఏటిగాలి మెలమెల్లగా వీస్తున్నది. ప్రపంచంలో ఆనందానికి అంకురార్పణ జరగడానికి ఏర్పాట్లు త్వరితగతిని సాగిపోతున్నవి.

జగన్నాథం—భార్యకు శాశ్వతంగా వీడ్కోలు చెప్పినాడు. దుఃఖాశ్రులతోనే ఆమెకు వీడ్కోలు చెప్పి, తోడివారితో కలిసి ఏటిపాయ దగ్గరకు వెళ్ళాడు, ధౌతవస్త్రధారుడగుటకై. పదేండ్లు దాటని రఘు, శ్మశానస్థలి ప్రక్కగా నున్న నడిరోడ్డుమీద నిలబడి, మంటల్లో తన రూపాన్ని తనే హరించుకొంటూ తనను చూచి మందస్మితంతో ఆశీర్వదిస్తున్న తన తల్లికి తుదినమస్కారం పెట్టి, కళ్ళు తుడుచుకుంటూనే వెనుకకు తిరిగాడు. కొద్దిదూరమైనా నడువకముందే, కపాలమోక్షమయిన శబ్దం అతనికి స్పష్టంగా వినిపించింది.

అతను వెనుకకు తిరిగి చూడలేదు. తడబడుతున్న అడుగులతో, అలాగే, ఇంటివేపు నడక సాగించాడు.

ఇంటివద్ద పార్వతమ్మ పరిస్థితి కొంతలో కొంత మెరుగ్గావుంది. ఒక్కరొక్కరే మెల్లమెల్లగా సర్దుకున్నతర్వాత, నిస్సహాయంగా వున్న తనకు తానే ధైర్యం చెప్పుకొని, లేచి, చాకలివాడిచేత ఆ ప్రదేశాన్నంతా వూడ్పించి, నడియింట్లో చిన్న దీపమొకటి వెలిగింపజేసింది.

ఎవరో పుణ్యాత్ములు వంటయింట్లో భోజనాలకు ఏర్పాట్లు చేయిస్తున్నారు. పార్వతమ్మ, చాకలివాడిని పంపించివేసి, తనుకూడా స్నానంచేసి, కలగుండువడిపోతున్న హృదయంతోనే, వీధ వాకిట్లోకి వచ్చి, ఓ బల్లమీద తమ్ముడికోసం ఎదురు చూస్తూ కూచున్నది.

ఎదురుగ్గావున్న రాళ్ళగుట్టదగ్గరగా, ఎప్పుడు చనిపోయిందో, ఏమో ఓ కాకి చచ్చిపడివుంది. తమ హృదయంలోని బాధనూ, ప్రేమనూ తెలపటం కోసమో నేమో నరసంతతికి—అసంఖ్యాకంగావున్న కాకిమూక అదే పనిగా విలపిస్తున్నది. ఉత్త కాకిగోల!

సూర్యుడు నల్లచీరతో కళ్ళు తుడుచుకోబోతున్నాడు. ఇంకా జగన్నాథం, వాళ్ళూ రాలేదు.

కలుపాత్మని గుండెలోని ద్రోహ-చింతనలాంటి చీకటి, వెలుగును కబళిస్తున్నది. ఇంకా జగన్నాథం రాలేదు.

పార్వతమ్మకు ఆత్రుత ఎక్కువైంది. లేచి, వేసీవేయని అడుగులతో లోగిలిదాటి వీధిదాకా వచ్చింది.

ఎదురుగా తూలుతూ, ఎఱ్ఱగావున్న కళ్ళతో రఘు నిలబడి వున్నాడు!

ఆమె రఘును చూచింది. కాదు రఘు ఆమెను చూచాడు.

ఆమె అతడివేపు చేతులు జాచింది. అతడు ఆమెవేపు పరుగెత్తాడు.

ఆమె అతన్ని తన హృదయానికి హత్తుకున్నది. అతడు ఆమె ప్రేమలో తననుతాను లీనం చేసుకున్నాడు.

అంతవరకూ కన్నీరు కార్చని రఘు, పార్వతమ్మనుచూసి దుఃఖం దాచుకోలేక, బేలగా విలపించసాగాడు. "అమ్మమ్మా!" అని, అతని గుండె గుండెల్లోంచి, గొంతులోనుంచి నోట్లోంచి 'అమ్మా!' అన్న పదమే వినిపించింది.

అతనినిచూచి ఆమె మరింత కరిగిపోయింది. తదేకంగా అతన్ని చూస్తూ, కన్నీరు కారుస్తూ, అట్టే నిల్చుని పోయింది.

ప్రపంచం చీకటి ముసుగును కప్పుకొనడానికి మరింతగా ముందుకు పురోగమిస్తున్నది. కొత్తగా కాపురానికి వచ్చిన కొందరు అనుభవశూన్యులు, జీవితమంటే తెలీనివారు, మరణాన్ని చూచివుండని వారు, వొళ్ళు విరుచుకుంటూ, తలలో పూలు ముడుచుకొంటున్నారు.

పార్వతమ్మకు మరలమరల సరోజిని జ్ఞాపకానికి వస్తున్నది. కూతురు జ్ఞాపకానికి వచ్చినకొలదీ, రఘును సందిట పొదువుకుంటూ కుమిలిపోతున్నది.

ఆమె, అలా దుఃఖిస్తూనే ఎదుటికి తేరిపార జూచింది. జగన్నాథం, మరి కొందరితో కలిసి, మెల్లగా అడుగులు వేసుకుంటూ ఇంటికి తిరిగి వస్తున్నాడు. అతని వంటిమీద చొక్కా లేదు. మొహం నల్లగా మాడిపోయివుంది. పురుషత్వం దాదాపు తెల్ల మొహం వేసుకొనివుంది.

తమ్ముడిని ఆవిధంగా చూడలేక, త్వరత్వరగా ఆమె రఘును చేతబుచ్చుకొని ఇంట్లోకి వెళ్ళింది. కానీ అక్కడ ఎక్కువసేపు వుండలేక, తిరిగి బయటకు వచ్చి బల్లమీద కూర్చున్నది. జగన్నాథం లోపలకు వస్తూవస్తూ అక్కగారివేపు చూచాడు. అదేసమయంలో పార్వతమ్మకూడా అతనివేపు అనుకోకుండా చూచింది. ఇరువురూ వొకరికొకరు, మసకమసకగా శోకమూర్తులుగా కనిపించారు. ఇరువురూ మాట్లాడలేకపోయినా, ఆ మౌనమే ఒకరినొకరిని సంపూర్ణంగా ఎరిగించింది. ఇద్దరూ మౌనంగా వున్నారు. ఇద్దరూ మౌనంగా మాట్లాడుకున్నారు. ఇద్దరూ ఒకరి వేదన నొకరి కరిగించుకున్నారు. దుర్భరమైన ఈ జీవనయాత్ర నిక కలసి మెలసి సహాయసహకారాలతో సాగించుట అవసరమన్నట్లుగా కండ్లతోనే నిర్ణయించుకున్నారు. మౌనంలోనే భావాలకు జీవంపోశారు.

జగన్నాథం ఈమౌనం భరించలేకపోయాడు. తలవొంచుకుని గబగబా ఇంట్లోకి నడిచాడు. ఇంట్లోకి ప్రవేశించబోతున్నవాడల్లా, గుమ్మందగ్గరగా కూచుని గొంతులోని బాధను గొంతులోనే అణగార్చుకొనడానికి ప్రయత్నం చేస్తున్న రఘును చూచి, జాలి కలిసిన ఆప్యాయతతో వాడిని దగ్గరకుతీసుకుని లోపలకు నడిచాడు.

లోపల భోజనాలకు ఏర్పాట్లుజరుగుతున్నాయి.

* * * *

సూర్యుడి అస్తమయానికి సంతాపసూచకంగా ప్రకృతి నల్లనిదుస్తులను తొడుక్కున్నది. జీవులకు శాంతి కలగాలని ప్రార్థిస్తున్నట్లుగా దేవుడిగుళ్లో గంటలు మ్రోగుతున్నాయి. అమావాస్యచీకటి కాకపోయినా, స్వైరిణిలాంటి చీకటి చిత్తమొచ్చినట్లు నర్తిస్తూనే వున్నది.

జగన్నాథం భోజనంచేసి బయటకు వచ్చాడు.

ఇంకా పార్వతమ్మ అలాగే బల్లచివర దిగులుగా కూచున్నది. శూన్యదృక్కులతో ఎదుటగా, అనంతంగావున్న అంధకారంలోకి చూస్తూ కూర్చున్నది.

తండ్రి వెనుకాతల వస్తున్న రఘు పార్వతమ్మను చూసి, ఆమె దగ్గరకుపోయి ఆమెకు దగ్గరగా మరీదగ్గరగా ఆనుకుని కూచున్నాడు.

పార్వతమ్మ ఆపిల్లవాణ్ణి దగ్గరకు లాక్కున్నది. వాడి జుట్టులోకి వ్రేళ్లుపోనిచ్చి దువ్వుతూ, లాలిస్తూ కూచున్నది.

జగన్నాథం, బల్లకుదగ్గర గావచ్చి, పార్వతమ్మకు ఏదో చెప్పబోయాడు. కానీ ఏంచెప్పాలో తోచక, పిల్లవాణ్ని ఒక్కసారి ముద్దుపెట్టుకుని, తిరిగి మౌనంగా మెట్లదాకావచ్చి అక్కడే చతికిలబడ్డాడు. అతనికి భవిష్యత్తేమిటో .అనూహ్యంగా వున్నది. పార్వతమ్మకు భవిష్యత్తంటే భయంగావున్నది. పిల్లవాడికి, జరుగుతున్న విషాదాంతమైన ఈకథ ఎందుకిట్లా సాగుతున్నదో అర్థంకావడంలేదు.

వారిదృష్టిలో ఇంకా సరోజిని బ్రతికే వున్నది.

అందుకనే ముగ్గురూ ఆలోచిస్తున్నారు. ముగ్గురి ఆలోచనలూ ఒకేప్రదేశంనుండి బయలుదేరుతున్నా, గమ్యస్థానాలుమాత్రం వేరు.

పసివాడైన రఘు ఎక్కువసేపు ఆలోచించలేకపోయాడు. మాటామంతీ లేకుండా ఎక్కువసేపు కూర్చోలేకపోయాడు. చివరకు తనకు తెలియకుండానే పార్వతమ్మ మీదకు వాలి, స్వాప్నికజగత్తులో తల్లితో మాటాడడం మొదలెట్టాడు. పార్వతమ్మ పిల్లవాణ్ణి చూచింది. అతని మనోగతమైన వేదనను అర్థంచేసుకున్నది! చేసేదిలేక, మౌనాన్ని భరించలేక "తమ్ముడూ!" అని పలికి ఏంచెప్పాలో తోచక "పిల్లవాడు నిద్రపోయాడు." అని పూర్తిచేసింది. జగన్నాథం మ్లానవదనుడైనాడు. "అవును. మనబ్రతుకులే నిద్రపోతున్నాయి." అన్నాడు.

పార్వతమ్మకు సమాధానం ఏమని చెప్పాలో తోచలేదు. అయినా సమాధానం చెప్పకుండా వూరుకోవడం మంచిదికాదని "తమ్ముడూ—అధైర్యపడితే ఏం ప్రయోజనం చెప్పు! ఆ సొమ్ము మనదికాదు. అంతే. దేవతలా వెళ్లిపోయింది. ఏనాడో చేసుకున్న ఋణం అణాపైసలతోసహా తీర్చుకుని మరీ వెళ్ళిపోయింది—తమ్ముడూ! వెళ్లిపోయింది."ఆమె కంఠం రుద్ధమైంది.

"జారిపోయిన అదృష్టంతో మనకింకేం ప్రయోజనంరా? అంతే. మర్చిపోవాలి. తప్పదు." కొంచెంసేపు ఆగి, ధైర్యం తెచ్చుకుని తిరిగి "ఆవస్తువు మనది కానప్పుడు ఎంతని పట్టుకు ప్రాకులాడితే ఏంప్రయోజనం? అంతా పురాకృత కర్మఫలం; మననిలా కట్టికుడుపుతున్నది." అన్నది.

దీనికికూడా అతనేమీ సమాధానం చెప్పలేదు. ఒక్క నిట్టూర్పుమాత్రం విడిచి ఊరుకొన్నాడు.

పార్వతమ్మే అన్నది, "జరిగిపోయిందానికి చింతించి ప్రయోజనం లేదుకదా! సరోజిని మనకిక లేదు. అందుకనే ముందుసంగతి చూచుకోవాలి. నువ్వు అధైర్యపడుతున్నావు. నాకు తెలుసు తమ్ముడూ! ఆడవారి అండదండలు లేకపోతే మగవాడెట్లా తెగిన గాలిపటంలాగా తయారవుతాడో నాకు తెలుసు. ఇందుకు నువ్వేమాత్రం బెంగపెట్టుకో నవసరంలేదు. ఈ మైల వెళ్లకముందే మళ్ళీ నిన్నొకయింటివాణ్ణి చేస్తాను. నామాట నమ్ము."

జగన్నాథానికి జరుగుతున్నదేమీ అర్థంకావడంలేదు. "ఈమె—ఈమె మనిషేనా! తను వింటున్నది నిజమేనా? పిల్లనిచ్చి పెళ్ళిచేసింది. తనను ఒకయింటివాణ్ణి చేసి, సంఘంలో గౌరవప్రతిష్ఠలు, ఆస్తిపాస్తులు సమకూర్చిపెట్టింది. అటువంటిది, తిరిగి ఈనాడు ఆమె తనకు రెండోపెళ్ళి చేస్తానంటున్నది. భగవంతుడా! ఏమిటి నీ మాయ?" జగన్నాథం మాట్లాడకపోవడం చూచి తిరిగి ఆమె అన్నది. "నామాట నమ్ముతమ్ముడూ మీ బావగారి పాదాలసాక్షిగా చెబుతున్నాను. ఈ పిల్లలకు ఒక ఆధారం చూపించి కాని నేను నిద్రపోను, నన్ను నమ్ము."

జగన్నాథానికి ఏం మాట్లాడాలో తోచలేదు. కృతజ్ఞతాభారంతో అతని తల వొంగిపోయింది. శ్వాస బరువుగా వదుల్తూ" అ...క్క...య్యా!" అని మాత్రం అనగలిగాడు.

చుట్ట ముట్టించుకొనడానికని అగ్గిపుల్ల వెల్గించిన సమయంలో—అంత ధైర్యంగా మాటాడగల్గుతున్న అక్కగారిని ఒక్కసారి చూద్దామనుకున్నాడు. అందుకే అటువేపు చూశాడు.

పార్వతమ్మ కళ్లనుండి ధారాపాతంగా నీళ్ళు కారిపోతున్నవి. ఆపిల్లవాడు "అమ్మా! అమ్మా!" అంటూ మెల్లగా కలవరిస్తున్నాడు.

జగన్నాథం ఆదృశ్యం చూడలేక తల వీధివైపుకు త్రిప్పుకున్నాడు. ఎవరో తన ముగ్గురు పిల్ల

లను తీసుకుని తనవైపే నడిచివస్తున్నారు. పసిపిల్ల కేరింతాలు కొడుతూ, ఆ ఆగంతుకురాలి చంకలో ఆడుకుంటున్నది. రాముడూ, కమలాగూడా నవ్వు మొగాలతోనే వున్నట్లున్నారు.

జగన్నాథం ప్రేమగా వాళ్లనందుకోబోయాడు. పసిపిల్ల అతని చేతుల్లోకి రాక తనను ఎత్తుకు వచ్చిన ఆమె సందిట్లోకి ఇమిడిపోయింది. రాముడు బిక్కుబిక్కుమంటూ తండ్రిని చూసి భయపడ్డట్లుగా దూరంగా తొలగి నిల్చున్నాడు. కమల, ఇంటిని సమీపిస్తూనే పార్వతమ్మదగ్గరకు పరుగెత్తుకుపోయింది.

జగన్నాథానికి చైతన్య రహితంగా వున్న ప్రకృతిలో చైతన్యం కనిపిస్తున్నది. మరణించిన సరోజిని మూర్తి రూపంతో ప్రత్యక్షమౌతున్నది. అయ్యో! సరోజినీ! ఆకాశంనుండి నక్షత్రమొకటి రాలిపోయినా అప్పుడప్పుడే ఉదయిస్తున్న చంద్రుడు, అదేమీ గమనించకుండా ప్రశాంతతను సూచించడం కన్పిస్తున్నది. ఏటిపైనుండి వీస్తున్న చల్లని గాలి, దూర తీరాలనుండి ఆశలనూ, ఆనందాలనూ తెస్తున్నట్లుతోచింది. దానితో భయంకరంగా వున్న భవిష్యత్తులోకి దొంగచాటుగా చూస్తూ కళ్ళుమూసుకున్నాడు జగన్నాథం. కళ్ళు మూసుకుని మనసులోనే పార్వతమ్మకు హృదయపూర్వకంగా నమస్కరించాడు. నమస్కరిస్తూనే, తన కళ్ళలో నవ్వుతున్నట్లుగా మెరుస్తున్న నలుగురు బిడ్డల తల్లి సరోజినిని కొంచెం అవతలకునెట్టి, ఆశూన్య ప్రదేశంలో, తనకు తెలియరాని, తనుచూడలేని ఓ మూర్తిని ప్రతిష్ఠించుకున్నాడు.

# కాశీఖండము: అపపాఠములు

శ్రీ యస్. కృష్ణమూర్తి

**1800** సంవత్సర ప్రాంతమునుండియు తెనుఁగులో గ్రంథప్రచురణకు 'శ్రీకారము' చుట్టినది. నాటినుండి నేటిదాక దాదాపు నూటయేబదియేండ్లు గదా! తెలుఁగుదేశములోని యీ నూటయేబదిసంవత్సరాల ముద్రణ స్థితిగతులను ఓరిమివహించి పరిశీలింపుఁడు. 'తప్పొప్పుల పట్టిక' చేర్చని తెలుఁగు పుస్తకము లెన్ని వెలువడినవో పరికింపుఁడు...బహుశః వ్రేళ్ళమీఁద లెక్కపెట్టఁ గల్గుదు మేమో!

అసలు 'తప్పొప్పుల పట్టిక' ఆదిలోనో, అంతములోనో కలిగియుండుట మన తెలుఁగు పుస్తకముల ప్రత్యేకత! సాధ్యమయినంతవరకు 'తప్పొప్పులపట్టిక' జారిపోకుండ పుస్తకములు ప్రచురించుట ప్రచురణకర్తల విశిష్టత! ఆదిలో ఇది 'పొరపాటు' అని పండితులుపేక్ష వహించి మిన్నకుండిరి. మధ్యలో ఇది 'గ్రహపాటు' అయియుండునని భారము దైవముపై నిడి కర్తవ్యమునకు పూనుకొనరైరి. అంతములో—అనగా నేఁటికి—ఇది ప్రచురణ కర్తలకు 'అలవాటుగా' పరిణమించినదని ఎల్లవారు గుఱుతించిరి. ప్రచురణకర్తలు గ్రంథములను అందముగా ముద్రింపరు సరికదా, సెనగలలో రాళ్ళవలె—కావ్యములలో ఈ వెరసులు దొరలుటకు హేతువు ప్రచురణ కర్తల "సాహిత్యము"ను "ఆరాధన దృష్ట్యా" కాక, ధనసంపాదనమునకు చక్కని సాధనము, అపాయములేని ఉపాయమునైన "వ్యాపార దృష్ట్యా" చూచుటకాదని అనఁగలమా?

మన ప్రాచీన కావ్యములు చెదపురుగుల కాహారము గాకుండ ముద్రించి, రక్షించిన కీర్తి ఒక "వావిళ్ల" దారికే దక్కినది. "వావిళ్ల" వారు భాషోద్ధారకులుగా పేరెన్నికఁ గనినవారు. ఇంచుమించు నూఱేండ్లు భారతీదేవి నారాధించుచున్నవారు. వారు ప్రచురించిన కావ్యములలోనే తప్పులు లెక్కకు మిక్కిలి. మఱి ఇతర ప్రచురణ కర్తలను గూర్చి చెప్పవలెనా?

మన ఆంధ్ర సాహిత్య చరిత్రలో శ్రీనాథుని కున్న స్థానము సమున్నతమైనది, చెఱిగిపోవనిది. ఆ కవిసార్వభౌముని కృతులలోఁ గాశీఖండము సుప్రసిద్ధము. ఆకృతి శ్రీనాథుడు "ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండ" తెనుఁగు చేసినది. ఆ ప్రసిద్ధ గ్రంథమును "వావిళ్ల" వారు 1917 వ సంవత్సరములో ప్రచురించిరి. నేఁటికి క్రమముగా నాలుగయిదు సారులు పునర్ముద్రణము గావింపఁబడినది. 1953 వ సంవత్సరములో ప్రకటితమైన 'కాశీఖండము' ప్రతిలోని అచ్చు తప్పులు—అపపాఠములు'—అసంఖ్యాకములు. ఈ 'కాశీఖండము'లోని 'ప్రథమాశ్వాసము' విద్యార్థులకు పాఠ్యభాగము. ఈ 'అచ్చుతప్పుల'తోడి ప్రతిని ఆధారముగాఁగొనిన విద్యార్థుల యిక్కట్టులు దైవమునకెఱుక. 'కాశీఖండము' ప్రాతప్రతుల నెల్లఁబరికించి కొన్ని అచ్చు తప్పులను సవరించినాను. అవి ప్రకటించిన విద్యార్థులకుఁ గొంతవఱకు మేలుకలుగునను తలఁపుతో ప్రచురించుట కుత్సహించుచున్నవాఁడను.

## 1. 'ధవళతాటంకము'

సీ. "...ధవళతాటంకరత్న ప్రభాదీప్తి
గండస్థలంబులఁ గ్రాఁగిలింప..."

[కాశీ. 1 ఆ. 8 ప.]

అని నేఁటిముద్రిత ప్రతిలోఁ (1953 ప్రతి) గలదు.

"వివిధరత్నములు పొదిగిన తాటంకము (కమ్మ పంజా) చలించునపుడు రత్నకాంతులు గండస్థలముల వలముకొను" నని వర్ణించిన పట్టులు మన ప్రాచీన కావ్యములలో అనేకములు.

పై సీసపాదమునందు 'ధవళ'కు మారు 'తరళ' అను పదమున్నతప్ప 'రత్నప్రభారింఛోళి' 'గండస్థలంబులఁ గాఁగిలించుట' పొసఁగదు. 1938 వ సంవత్సరములో 'వావిళ్ల' వారి ప్రచురించిన ప్రతిలో "తరళ..." అనియే యున్నది. పై సవరణ ఎవరు గావించిరో?

## 2. 'రచియించితిని మరుద్రాట్చరిత్ర'

సీ. "చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటివాఁడు
రచియించితిని మరుద్రాట్చరిత్ర"
[1 ఆ. 7 ప.]

అని యున్నది.

కాని యిట "రచియించితి మరుత్తరాట్చరిత్ర" అను పాఠ మున్నటులు గుఱుతు. ఈ సీసమున శ్రీనాథుఁడు వాడిన 'నొడివితి' (ద్వితీయ చరణమునందు), 'సంతరించితి' (తృతీయ చరణమున), 'కాని యాడితి' (చతుర్థ చరణమున) అను క్రియలను జాగరూకతతోఁ బరిశీలించిన సీసపద్యము ప్రథమచరణమున గూడ 'రచియించితి' అను క్రియానే 'కవి సార్వభౌముఁడు' వాడియుండునని తెలియఁగలదు. కావున

"రచియించితి మరుత్తరాట్చరిత్ర" అనుపాఠమే కవి దని నానమ్మకము. ఈ పాఠమే పైపాఠముకంటెను సుందరతరము. శ్రీనాథుని కవితా రీతులు, సీసపద్యముల నడకలతీరులు గుర్తింపక సాహసముతో పైమార్పు కావించియుందురు.

పై రెంటిలో ఏపాఠము కవిప్రయుక్తమో శ్రీనాథ కవి హృదయము 'సొంతము' చేసికొనిన పెద్దలు నిర్ణయింతురుగాక!

## 3. 'తెనుఁగుఁ జేసెద'

గీ. "తెనుఁగుఁజేసెదఁ గర్ణాట దేశకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి"
[1 ఆ. 7 ప.]

అని కలదు. 'తెనుఁగుచేయు', అనునది 'పెండ్లిచేయు', 'పెద్దచేయు', 'తపముచేయు'లవంటిది. ఇవి శబ్ద పల్లవ క్రియలు. 'తెనుఁగు', 'చేయు' అను వ్యస్త పదములు రెండును 'తెనుఁగుచేయు' అని ఏక శబ్దముగఁ బరిణమించి 'తెనిఁగించు' అను విలక్షణమైన యర్థ మొసఁగును. ఆ రెండు శబ్దముల మధ్య ఖండ బిందువుంచుట, సరళాదేశము చేయుట కూడదు. అటు లొనరించిన 'తెనుగుచేయు' అను అర్థమిచ్చును కాని 'తెనిఁగించు' అను అర్థము నొసఁగదు. శ్రీనాథుఁడు 'తెనుఁగు చేసెద' అనియే ప్రయోగించియుండును. శబ్దపల్లవముల తత్త్వము పరిశీలింపని పరిష్కర్తలు 'తెనుఁగుఁ జేయు' అని మార్పు చేసియుందురు. ఏతావతా 'తెనుఁగుచేసెద' అనునదే సాధుపాఠము. ఈ విషయము విద్వాంసులు చర్చింతురుగాక! కాశీ ఖండ మన్ని ప్రతులలోను అపపాఠమే కలదు.

## 4. 'తెనుంగుఁగా నొనర్తు'

గీ. ...కారణంబులు మదోద్బోధకములుగాఁగ
సంధివించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధ విభునిఁజేసి
కాశికాఖండముఁ దెనుంగుఁగా నొనర్తు.
[1 ఆ. 16 ప.]

ఇందలి 'తెనుంగుగా నొనర్తు'కూడ 'తెనుఁగు చేసెద' వంటిదే 'తెనుఁగుఁగా నొనర్తు' అని అర్థమిందు పొసఁగూడినపాఠము సరసమైనదికాదు. 'తెనుంగుగా నొనర్తు' అనియే యుండఁదగును.

"శివపురాణంబు తెనుఁగుగాఁ జేయుమొకటి" అని భీమఖండమునఁ గలదు. తిలకింపుఁడు.

## 5, 'అన్న వేమేశ్వరు నిజాంకమాశ్రయించి'

గీ. "నిజ భుజావిక్రమంబున నిఖిల దిశలు
గెలిచి తను రాజ్యపీఠమెక్కించినట్టి
యన్న వేమేశ్వరు నిజాంకమాశ్రయించి
నిండు కొలువుండెఁ గన్నులపండువగుచు."
1 ఆ. 10 ప.

పై పాఠముప్రకారము పద్యము అర్థము చెప్పికొనిన పొసఁగునా? ఎందుకు మాటలు? 'అన్న వేమేశ్వరుని యంకమాశ్రయించి' అని పాఠమున్నచో అర్థము చెప్పుకొనుట సులభము. 1938 వ ప్రతిలో 'అన్న వేమేశ్వరుని యంకమాశ్రయించి' అను సాధు పాఠమే కలదు.

## 6. 'బారుహదొంతి'

"దూరమంతంత బారుహదొంతిమన్నె
సప్తమాడియు రాజన్య సమితిక్రెమ్మొక్క"

అని ముద్రితమైనది. (కాశీ. 1 ఆ. 35 ప.)
కాని 1 ఆ. 34 వ పద్యములో

సీ. "బారహదొంతి భూపాల లీలావతీ
గండస్థలంబులఁ గలికి నవ్వు"

అని ముద్రితమై యున్నది. 'బారుహదొంతి' తప్పా? 'బారహదొంతి' ఒప్పా?

'బారహదొంతి'యే సరియగు పాఠము.

'బారహదొంతి' :—'Baraha' is twelve and the term "the kings of Barahadonti" seems to refer to the rulers of the twelve serial states or Kingdoms.(139 page-Reddi-Kingdoms)

The Reddi princes of Rajahmahendravaram offered protection to the Kings of 'Barahadonti' and 'Mannedharanipatis' ie; the Kings of Saptamadiyas. Tht term 'Barahadonti' appears to refer to the fewdatory and tributary States of Orissa and the C.P; bordering on the Vizagapatam and Ganjam districts........."

(A forgotten chapter of Reddi Kingdoms' by M. Somasekhara Sarma.)

పై వ్రాఁతనుబట్టి 'బారుహదొంతి' అపపాఠమనియు, 'బారహదొంతి' సాధుపాఠమనియు తెలియుచున్నది కదా!

## 7. పాలింప

గీ. "...వేమభూపాలుననుజన్ము వీరభద్రు
ధాత్రి పాలింప గౌతమీతటములందు."

[1 ఆ. 37 ప.]

అర్థము కుదురక తల పగులఁగొట్టుకొనవలసినంత పనియైనది! 'భీమఖండము' పరికింపఁగా సరిగా యీ పద్యమే అందును గలదు. పై పాదములు రెండును కొంచెము మార్పుతోఁ గలవు.

గీ. "వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీతటములందు."

[మా. భీమఖం. పీఠిక]

ఇవి యర్థము చెప్పుకొనుటకు కష్టమేమున్నది. తరువాత 1933 లో అచ్చుపడిన 'కాశీఖండము' పరికింతుముగదా! ఈ రీతిగా నున్నది.

" వేమభూపాలుఁడనుజన్ము వీరభద్రు
ధాత్రి నేలింప గౌతమీ తటమునందు "

భీమఖండమునం దుండినటులే యున్నది కదా! 1933 వ ప్రతిలోని పాఠములు మార్చి యిటులుముద్రించిన మహానుభావు లెవరో? రామరామ!

## 8. 'ధారాధవ'

క. "వైరి ధరణిపు లల్లడు
వీరన్నృపతికి సాటి వితరణ గరిమన్
{ ధారాధర ధారాధవ
{ ధారాధర వాహ దానధారా నిధికిన్,"

[1 ఆ. 47 ప.]

మూఁడు నాలుగు పాదము లీపాఠముతో నున్న అర్థము కుదురునా? వేయిమాటలెందుకు? 'ధారాధవ' తప్పుపాఠము. 'ధారాధర' అని యుండవలెను. ఈ పద్యముకూడ భీమఖండమున నున్నది. 'ధారాధర' అనియే పాఠము.

"ధారాధరధారను; అధర=క్రిందుచేసిన; ధారాధరవాహ=జీమూతవాహనునియొక్క; దానధారానిధికిన్=దానధారకు గనివంటివానికి, వీరన్నృపతికి..." ఈతీరున ప్రతిపదార్థము చెప్పుకొనవచ్చును.

1933 వ ప్రతిలోఁగూడ 'ధారాధర' అను సుపాఠమే ముద్రితము. నేఁటి ప్రతిలో మార్పుచేసిన వారి సాహసము పరికించితిరా?

## 9. క్షీరాంభోధితటంబు

"క్షీరాంభోధి తటంబునన్ నిలిపె దిక్సీమాజయ స్తంభముల్."

[1 ఆ-52 ప.]

ఇట 'క్షీరాంభోధి' కాదు. 'కీరాంభోధి' అయి యుండునని నా తలఁపు. 'చిలుకసముద్రము'నకు 'క్షీరాంభోధి' సంస్కృతీకరణమై యుండునేమో? దొడ్డనూవిభుఁడు 'శృంగారంకోట' 'ఒడ్డాది,' 'చిలుక సరస్సు ('చిలుక సముద్రము'నియు వాడుక కలదు) లనుజయించినట్లు పలువురు చరిత్రపరిశీలకులు వ్రాయుచున్నారు.

[1 ఆ. 53 ప.]

## 10. 'అను గోసెక్కింప'

'అని గోసెక్కింప' అని సరియగు పాఠము. సూర్యరాయాంధ్ర నిఘంటువు—ద్వి. సం. పుట. 876 చూడుడు. ఈ పద్యము నుదహరించి "గోసెక్కింప" 'స్తుతింప' అని అర్థ మొసఁగఁబడినది. శ. ర.లో 'గోసు' నకు 'స్తుతి' యను అర్థమీయలేదు. కారణమేమయి యుండునో?

## 11. శుద్ధ సూనృతమున'

గీ. "తెలిసి దిక్పాలకాంశావ తీర్ణుఁడగుట
భోగమున, శుద్ధసూనృతమున, జయమున,
నాజ్ఞ, బలమున, ధనమున, నధికకరుణ..."
[1 ఆ. 55 ప.]

ఇత్యాదిగాఁగలదు.

ద్వితీయ చరణమున 'శుద్ధసూనృతము' కాదు. 'శుద్ధి' అని యుండవలదా? "భోగమునన్, శుద్ధిన్, సూనృతమునన్, జయమునన్..." ఇత్యాదిగా నర్థము చెప్పుకొనుటగ్గగు. అనుమానము తీర్చుకొనఁగోరి 1938 ప్రతిపరికించితిని. 'శుద్ధి' అనియే యున్నది.

## 12. 'కురుకేరళ కురు భూపాలునకు'

క. "త్వరిత కాకర కేతాళున
కరిభయద భుజాపరాక్ర మాఖిలునకున్
శరణాగత కురు కేరళ
కురుభూపాలునకు జగద గోపాలునకున్."
[1 ఆ. 62 ప.]

ఈ పద్యమునఁ 'కురు కేరళ కురుభూపాలునకు' అను స్థలమున కురు భూపాలురను రెండు మారులు చేర్కొనవలసి యగత్యమేమి? అచ్చు తప్పే కదా! 1938 ప్రతిఁగనుఁడు-అందు

"శరణాగత మరు కేరళ
కురుభూపాలునకు......" అని యున్నది. పై పద్యమునందలి తృతీయ చరణమున 'కురు' స్థానమున 'మరు' ఉండవలదా? ఊరక పాఠములు మార్చిన సరిపోయినదా? పునరుక్తిఁ గలుగుటకని సరిదిద్దుకొన వలదా?

## 13. 'భుజయుగయుగళీ'

క. "అంభోధి వలయితావని
సంభరణ ప్రౌఢ నిజభుజయుగ యుగళీ
సంభావిత కిటి కచ్ఛప
కుంభీనస సార్వభౌమ కులకుధరునకున్."
[1—68]

ఇందు 'భుజయుగ యుగళీ' అను పాఠమున్నది. 1938 వ ప్రతిలోని 'భుజార్గళయుగళీ' అనుపాఠము సరసముగఁ గనుపించుచున్నది. 'అర్గళము'వంటి 'భుజయుగళము' అని అర్థము చెప్పుకొనిన బాగుండును. 'భుజార్గళయుగళీ' అనిన పాఠమే సమంజసముగ నున్నది.

## 14. 'డొల్లగిలి'

"అది డొల్లగిలి విష్టపాంతరంబులు దాఁటి
క్రమముతో భూమి చక్రమునఁ బ్రాలె..."
(1 ఆ. 77 ప.)

ఇందలి 'డొల్లగిలి' పాఠముకంటెను శ. ర. లోఁగల "అది డొల్లి గిరి విష్టపాంతరంబుఁలదాఁటి" అను పాఠమే సరియైనది. 1938 వ ప్రతిలోను శ. ర. లో నున్నటులే యున్నది.

## 15. 'నివహ సంజాతాబ్ధిసాంగత్యమున్'

"కాంచెన్ గాంచనగర్భ సంభవుఁ
డుదగ్రగ్రావకోటిస్థల
చ్ఛంచన్నిర్ఝర వేదికాని
వహసంజాతాబ్ధి సాంగత్యమున్
బంచాస్య స్ఫుటకంఠ నాదహత
కుంభిక్కుంభి దర్పాంధ్యమున్
న్యంచద్ఘాటక భూమిభృచ్ఛి
ఖరగర్వావంధ్యమున్ వింధ్యమున్"
[1 ఆ—87 ప]

ఈపద్యములోని రెండవపాదమునఁగల 'నివహ సంజాతాబ్ధి సాంగత్యమున్' అన్నపాఠము కన్నను 1938 వ ప్రతిలోని 'సలిలసంజాతాబ్జసౌగంధ్యమున్' అన్న పాఠము సముచితముగనున్నది. ప్రకరణమున కనుగుణముగా గలదు. మూడుఁనాల్గు పాదముల అంతమున ఉన్న 'దర్పాంధ్యమున్,' వింధ్యమున్' అను పదములు పరిశీలించిన రెండవ పాదమున గూడ 'సౌగంధ్యమున్' అని యుండుటయే సమంజసమని తోఁచును. కావున 'సలిల సంజాతాబ్జ సౌగంధ్యమున్' అన్న పాఠమే ఉండదగినది కదా!

## 16 'సముత్ప్రస్తావపరికంప్యమానజటావలి'

క. "దేవాతరంగశీకర
శేవాహేవాకపాక శిశిర సముత్ప్ర
స్తావ పరికంప్య మానజ
టావలి యగుచలఁడు వింధ్యమల్లవఁ జేరెన్"
(1 ఆ. 88 ప.)

'సముత్ప్రిస్తావ' అన్న పాఠము సరియైనది కాదు. 1933 వ ముద్రిత ప్రతిలో 'మరుత్ప్రస్తావ' అని ఉన్నది. 'రేవా తరంగ శీకర సేవాహేవాక పాకముతో శిశిరమైన మరుత్ప్రస్తావముచే పరికంప్య మానములయిన జటావళి యగుచు' అని అర్థము. పద్యమున నుండవలసినది 'సముత్ప్రస్తావ' కాదు. 'మరుత్ప్రస్తావ' అన్న పాఠమే.

## 17. ఆమూల చండము

గీ॥ "...కమియనామూలచండంబుగా ఫలించి
యంబరముమోచియున్న యుదుంబరములు"
(1 ఆ. 91 ప.)

పై పాదములోని 'ఆమూల చండంబుగా' అన్న పాఠము తప్పు. 'ఆమూల చూడము' అను నానుడి యున్నది కదా! 'ఆమూల చూడంబుగా' అని అక్కడ పాఠము. 1933 ప్రతిలో 'ఆమూల చూడంబుగా' అన్న సరియైన పాఠమే కలదు. నేఁటి అచ్చు ప్రతిలో ఈ మార్పు కావించుట పరిష్కర్తల పొరపాటా? తొందరపాటా?

## 18. కీడ్వె అసి

వ. "...నానా మృగంబుల యెలుంగుల తోడఁ గీడ్వెఅసి..." అని అచ్చు పడినది. 1933 వ ప్రతిలో 'గీడ్వెఅచి' అన్న పాఠాంతర మున్నది. కాని నన్నెచోడుని కుమార సంభవము మున్నగు కావ్యములలో 'కీడ్బరసి' అను పాఠము పొడగట్టుచున్నది. పై వాక్యమున ఉండఁదగినది 'కీడ్వెఅసి' యో, 'కీడ్వెఅచి' యో 'కడ్బరసి' యో పండిత పరిశోధకులు నిర్ణయింతురు గాక! [కడ్బరసి=కలిసిపోయి?]

## 19. 'అమ్మహీధరముదానె'

గీ. "ని వెరుంగుదు నీలావు నిక్కవముగ
నెఱుఁగుఁ దనలావు తానమ్మహీధరముదానె.."
[1 ఆం-104 ప.]

ద్వితీయ చరణము చదివిన తోడనే ఇది తేట గీతి చరణమేనా అని సందేహము కల్గకపోదు.

1924, 1933 ప్రతులలో 'ఎఱుఁగుఁ దనలావు తానమ్మహీధరంబు' అన్న సరియగు పాఠమే కలదు. పరిష్కర్తలు చేసినమార్పు పరికింపుడు. గణము తప్పినదని యైనను గుఱుతింపఁజాలకపోయిరే! ఇందులకు హేతువు పరిష్కర్తల తొందరపాటని సరిపెట్టుకొనవలెనా? లేక మన పండిత పరిష్కర్తల ఛందశ్శాస్త్ర పారీణత యిట్టి పాటిదే కదా అని ఈసడింపవలెనా?

## 20. 'తన్నులముకొనియె'

గీ. "ప్రత్యహంబునవత్వంబు వఱయు నెద్ది
యట్టి చింతాజ్వరంబు తన్నులముకొనియె
నేమిసేయుదు నింక నే నెచటఁ జొత్తు
నెట్టు నిర్జింతు మేరుమహీధరంబు."
[1 ఆ. 111 ప.]

పై గీతము చదివినతోడనే 'తన్నులముకొనియె' అన్న పాఠము తప్పని గుర్తింపని సాహితీపరులుందురా? అట 'నన్నులముకొనియె' అని యుండవలదా? 1933 ప్రతిలో 'నన్నులముకొనియె' అని సరియైన పాఠమే యున్నదే? నేఁటి అచ్చుప్రతిలో ఈ తప్పు పాఠము చేరుటకు హేతువేమందురు పరిష్కర్తలు?

## 21. తప్పకుండ

తే. "మేదినీభర మిబ్భంగి మిన్నుముట్టి
నిట్ట నిలుచుండి చూచె నిర్నిమిషదృష్టిఁ
దనయనుష్ఠానకాలంబుఁ దప్పకుండ
బ్రాహ్మణుఁడు ఉపకసఁబోలె
భానుపాడుపు." [1 ఆ. 119 ప.]

ఇందలి తృతీయచరణమునఁగల 'తప్పకుండ' అన్నది తప్పు. పాఠము 'తప్పకుండు' అన్నది సాధుపాఠము. 1933 ప్రతిలో 'తప్ప కుండు' అన్న సరియగు పాఠమే యున్నది. ఇట్టి దోషములు పరిష్కర్తల తొందరపాటును తెలుపుటలేదా?

## 22. 'సృష్టికట్టెఱ'

తే॥ "సృష్టికట్టెఱ తొలుసంజ చెలిమికాఁడు
కుంటి వినతామహాదేవి కొడుకుఁ గుఱ్ఱ

పవిత్రుసారథి కట్టెఱచాయ వేలు ప
రుణుఁ డుదయించె ప్రాగ్దిశాభ్యంతరమున."
(1 ఆ-121 ప.)

ఈ పద్యములోని 'సృష్టికట్టెఱ' పాఠమంత సంగతము గాదు. 'సృష్టికందెఱ' అన్న చిన్నయసూరి పాఠమొకటి సూ. ని లోఁ గనుపించుచున్నది. ఇదియే కవిపాఠమై యుండునని తోఁచుచున్నది. మూడవ పాదమునందు 'కట్టెఱచాయ వేలుపు' అన్న పాఠము గలదు కదా! 'కట్టెఱ' అన్నపదము శ్రీనాథునివంటి కవి ఒకపద్యమున రెండుసారులు (ఒకేభావమున) వాడి యుండునా? ఎందుకు విస్తరము, 'సృష్టికందెఱ' అన్న పాఠమే గ్రాహ్యము. కంటిని ఱెప్పవలె సృష్టిని సూర్యుఁడెటుల సంరక్షించునని భావము.

## 23. 'కుంటి'

ఆపద్యమునందే రెండవపాదమునఁగల 'కుంటి పాఠము' గూడ కవిప్రయుక్తము కాదని నాయుద్దేశము. అనూరుని 'ఏచ్చక కుంటు' అనుటవాడుక. 'కుంటి, కంటెను 'కుంటు' పాఠమే సుందరమేమో? 1933 ప్రతిలో'కుంటు' అన్నపాఠమున్నది (మా కుఁ గు)

## 24. 'శాంకరీ దేవర'

సీ. "లంకాపురంబున శాంకరీదేవర
మకుటేందు రేఖతో మచ్చరించి" [1 ఆ-130]

అని నేఁటి ప్రతిలో ముద్రితము. కాని అక్కడ ఉండఁదగినది "శాంకరీదేవత" అన్న 1933 ప్రతిలోని పాఠమే.

"మకుటేందురేఖ" శివునికే యుండు నన్న తలఁపుతో పరిష్కర్తలు పరిశీలింపక చేసినది మార్పు శంకరుఁ డర్ధనారీశ్వరుఁడు గదా! అయిన "మకుటేందు రేఖ" "శాంకరి' కిని కలదని వర్ణించుటలో తప్పు లేదే! కావున "శాంకరీ దేవత" అన్న పాఠమును "శాంకరీ దేవర" గా మార్పుచేయ నక్కరలేదు కదా!

## 24. 'కదలి యక్కిలి'

"తరులువడి యప్రదువడి సెడి
గగనమణి రథంబు దొరగలువడి నిలిచెన్.
బోగరు మొగకడలియక్కిలి
దగిలి నిలువఁబడిన కలప తతియుంబోలెన్"
[1 ఆ-133 ప.]

ఈ పద్యమున కర్థము సరిగా కుదురుట లేదు.

పై పాదమున ఉండవలసినది 'అక్కిలి' కాదనియు, అక్కడ నుండవలసినది 'ఎక్కిలి' (ఇసుకతిన్నె) అనియు పూజ్యులు శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు తమ 'సాహిత్య సమీక్ష' (110—111 పుటలలో) సెలవిచ్చినారు.

నాల్గవ పాదమున 'కలపతతియుం బోలెన్' అన్నపాఠము 1913 ప్రతిలోనిది. 1933 ప్రతిలో 'ఘనవితతియుంబోలెన్' అను పాఠమున్నది. అర్థము కుదురుట కష్టముగ నున్నదని పరిష్కర్తలు మార్పు కావించినారా? 'గనపతతియుం బోలెన్' అని చిన్నయసూరి పాఠ మొకటున్నటులు సూ. ని. తెలుపుచున్నది.

పద్యమున 'అక్కిలి' స్థానములో 'ఎక్కిలి' ఉన్నచో 'కలపతతియుంబోలెన్,' 'ఘన వితతియుం బోలెన్,' 'గనపతతియుంబోలెన్' అను పాఠములలో ఏ ఒకటున్నను అర్థము కుదురును—

## 26. 'ఉపకారి కొఱడు'

సీ. "ఒకచోఁ దనుల్పడె నుపకారి కొఱటికిఁ
దరమైన రోహిణీ తారకంబు"
[1 ఆ-138 ప.]

అని నేఁటి ముద్రిత ప్రతిలో ఉన్నది.

'ఉపకారి కొఱకు' కొఱకు వస్తదికాదు — నిఘంటువులోఁ జూతుముగదా!

'ఉపకార్య కొఱటికి' అన్న పాఠమున్నది. వావిళ్ల నిఘంటువులోను, సూ. ని. లోను,

"ఒకచోఁ దనుల్పడె నుపకార్య కొఱటికిఁ
దరమైన రోహిణీ తారకంబు"

అనియే కలదు. [వా. ని. మూడవ సంపుటము. పుట 800]

"ఉపకార్య=భవనముయొక్క; కొఱటికి=స్తంభమునకు" అని అర్థము. పై మార్పుచేయుటకు కారణ ?

## 27. 'పూచె'

సీ॥ "ఒకచోఁ బునర్వసు పూచె వృక్షముకొమ్మ
సుడివడ్డ ముత్యాల జోఁగువోలె" (అదే పద్యము)

అనుచోటులో 'పూచె' తప్పు పాఠము. ఈ పాఠము స్వీకరించిన యతికూడ తప్పను - వావిళ్ళ నిఘంటువులో (1235 పుటలో)' జోగు' పదముక్రింద—

"ఒకచో పునర్వసు పూఁగె వృక్షముకొమ్మ
సుడివడ్డ ముత్యాల జోఁగువోలె"

అని యున్నది. ఈ పాఠము సరియైనది. 1933 ప్రతిలోను ఈ పాఠమే కలదు. పై మార్పు మన పరిష్కర్తల ఛందశ్శాస్త్రపారీణతకు మఱొక తారకాణ!

## 28. 'గుంటె'

అదే సీసమున—

"శయినింప నొకచోట శ్రవణ నక్షత్రంబు
గుంటెమీఁదటి ప్రత్తి కొడుపువోలె."

అని యున్నది. 'గుంటె' నిఘంటువులలో ఎచ్చటను కనుపట్టదే! ఇట నుండవలసినది 'గుంటె' కాని 'గుంటె' కాదు.

'గుంటె' అనఁగా చేని భాగము—

'గుంటె—దున్నుట మొదలుగువాని కేర్పఱచు కొన్న పొలముయొక్క భాగము" (శ. ర.)

వా. ని. (921 పుట)లో 'గుంటె' పదము క్రింద

'...గుంటె మీఁదటి ప్రత్తి కొడుపువోలె'

అనియే కలదు.

1933లో ప్రతిలో సాధుపాఠమైన 'గుంటె'యే యున్నది.

## 29. 'జ్ఞానేంద్రియజ్ఞానకళలు'

సీ॥ "నేత్రంబు లున్మేష నిష్ప్రభాత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కవడఁగ
జ్ఞానేంద్రియజ్ఞాన కళలౌరుసౌరుగా
జిహ్వావివేకంబు చిదుకవోవ"

[1 ఆ. 139 ప.]

అని ముద్రితమై యున్నది. పైన "ఘ్రాణేంద్రియ జ్ఞాన కళలౌరుసౌరుగా" ఉండవలెను. "జ్ఞానేంద్రియ జ్ఞాన కళలౌరుసౌరుగా" తప్పుపాఠము.

మొదటి పాదములో 'నేత్రములు, శ్రుతిపుటములు' కలవు. రెండవ పాదమున 'జిహ్వ' కలదు. కావున అక్కడ ఉండవలసిన పాఠము ఘ్రాణమే కదా!

వా. ని. (542 పుట)లో 'ఔరుసౌరు' క్రింద

"ఘ్రాణేంద్రియజ్ఞాన కళలౌరుసౌరుగా అను సరియగు పాఠమున్నది. ఎందుకుండదూ?

## 30 'గేహరము'

చ. "విలసిత కీర్తిశాలియగు
వీరమహేశ్వరు 'గేహరంబు' శ్రీ
నిలయమునం బ్రసంగ్యమున......"

అనియున్నది. [1ఆ. 49 ప.]

ఇక్కడ 'దేహరంబు' అన్న పాఠాంతరమున్నది. 'దేవాగారి' శబ్దభవము 'దేహరము' అయియుండునేమో? 1933 ప్రతిలోఁగూడ 'దేహరంబు' అన్న పాఠమేయున్నది.

పైన చూపినవి ప్రథమాశ్వాసములోఉన్న కొన్ని అపపాఠములు. నేను పాఠాంతరములజోలికి పోలేదు. ఒక ప్రథమాశ్వాసమునందే యిన్నిదోసగులు పొసగిన, తక్కిన ఆశ్వాసములలో దొరలిన నెరసులెన్నియో?

అంతమున ప్రచురణకర్తలకు నేను చేయఁదలచిన హెచ్చరిక. పుస్తకములను అచ్చుతప్పులతో, తప్పొప్పుల పట్టికలతో ముద్రించు వీరి అలవాటును—ఎంతకష్టమైనను — మానుకొనుఁడు. తెలుఁగులను వల్లూరిలో నవ్వులపాలు చేయకుఁడు. రచయితల హృదయములను నొవ్వజేయకుఁడు.

ఇంక పరిష్కర్తలకు నాచివరిమాట కావ్యములలోని 'కవిపాఠములు' సవరింపకుఁడు. అనవసరమయిన 'మార్పులు—కూర్పులు' చేసి ప్రాచీన కావ్యముల అందము చెడగొట్టకుఁడు.

ప్రాచీనకావ్యములను నిర్దుష్టము కావించు భారము విద్వాంసులు వహింతురు గాక!

# రాజదండం

"నాగభూషణ్"

## పాత్రలు:

రావుసాహెబ్ డాక్టర్ పోలయ్యానాయుడు, డాక్టరు వరదయ్య, ఆచార్య వెంకటరత్నం, ప్రొఫెసర్ సోమయాజులు, చెన్నకేశవులు, భాస్కర్, బంగారు, మూర్తి.

* * [ఆంధ్రదేశం నడిగడ్డమీద అరవై యేళ్లనుంచీ అనవరతం విద్యాసేవ చేస్తున్న ఓ కళాశాలలో ఆఫీసు గది. ముందు వరండా. ఆఫీసు గది రెండు భాగాలు. ఒకదానిలో గుమాస్తాలు, ఆఫీసు మేనేజరు, స్టెనో టైపిస్టు కూర్చోవడానికి స్థానాలు; రెండవది ప్రిన్సిపాలుగారు తమను చూడవచ్చినవారికి దర్శనం యిచ్చే గది. బయటినుంచి, అధ్యాపకుల గదినుంచి రెండుప్రక్కలా వరండాలోకి రెండు ద్వారాలు. ఆఫీసు గది నుంచి లోపలకు మరోద్వారం—

ఉదయం పదిగంటలు కావస్తున్నది. ఆఫీసు మేనేజరు దేవసహాయం ఏమిటో ఆత్రంగా వెతుకుతూవుంటాడు. పొట్టిగా, నల్లగా—గుండులాంటి మనిషి—లోతైన కళ్లు. అవకాశం వస్తే ఎవరినైనా మట్టుబెట్టడానికి వెనుదీయని తత్వం. "అందితే జుట్టు, అందకపోతే కాళ్లు"—ఇదీ అతని జీవితంలో అతనికి వున్న ఒకే ఒక్క నియమం... వెనుక టైపు రైటర్ల చప్పుడుకు ఓ క్షణంసేపు చికాకుపడి బంగారును కేకవేస్తాడు.]

దేవ : బంగారూ, బంగారూ...

బంగా : అయ్యా!

దేవ : ఎక్కడచచ్చావ్?

బంగా : వచ్చానుసార్!

దేవ : ఏపనలేకపోయావు! ... ఆటైపురైటర్లతో వాళ్ళు టైపుచేస్తున్నారా, సంగీతం పాడుతున్నారా!

బంగా : కనుక్కొనివస్తాను సార్.

దేవ : ఓరి నీయిల్లు బంగారంకాను, నీకు ఒక్కమాటా అర్థంకాదేం ఖర్మ—వాళ్ళను అంత గట్టిగా టైపుచెయ్యొద్దను—

బంగా : అదా సార్!...అలాగేసార్...(వెడతాడు)

(దేవసహాయం 'ఛి, ఛీ' అనుకుంటూ మళ్లీ తనపుస్తకాలలో పడతాడు. ఇంతలో డాక్టరు వరదయ్య ఆదుర్దాగావస్తాడు. సూటు, కిందచెప్పులు, నలిగినటై, చెదిరిన జుట్టు—)

వర : సహాయంగారూ, సహాయంగారూ! కొంప లంటుకున్నాయి. మీరు ఏదో ఒకదారి చూపాలి.

దేవ : (కంగారుగా) ఏంజరిగిందండీ?

వర : ఏంజరిగిందేమిటండీ? ఇప్పుడు ప్రిన్సిపాలుగారు వచ్చిఅడిగితే ఏమని సమాధానం చెప్పను?...ఈవారం సాజాతికంలో వ్రాసే

వుందిలెండి—'అధికారులచే అవమానం, దండన' అని—తప్పటుందా?

దేవ : అసలు ఏంజరిగిందో చెప్పండి.

వర : అదే! బంగారంవంటి ఆస్ప్రెక్టౌనిటరు బద్దలయి వూరుకుంది.

దేవ : (నిట్టూర్చి) ఇంతేనా? దీనికేటండీ యింత హంగామా చేశారు!

వర : అదేమిటండీ! సానుభూతయినా చూపుతారుగదా, అని మీదగ్గరకువస్తే—

దేవ : దానికి ఇంతభయం ఎందుకండీ?

వర : ఇప్పుడు ప్రిన్సిపాలుగారువస్తే ఏమని సమాధానం చెప్పను?

దేవ : ఏంజరిగిందో అదేచెప్పండి.

వర : ఏంజరిగిందో నాకుమాత్రం తెలిసివిడిస్తే గదండి. కాలేజీకి నేనేముందువచ్చాను. వచ్చి చూచేసరికి బ్రద్దలయి కనిపించింది.

దేవ : దానికి మీరు మాత్రం ఏంచేస్తారు? పోనీ, అటెండర్లు ఎవరైనా చూశారేమో కనుక్కోకపోయారా?

వర : వాళ్ళు నాతరువాత రావడం చూస్తూనే ఏమని అడగను?

దేవ : నన్ను ఎదురుప్రశ్నలువేస్తూకూర్చుంటే ఎలాగండీ? పల్లి మీడిపార్టుమెంటు వాళ్లనీ, పిల్లల్ని అడగండి. వాళ్ళకు తెలుసునేమో!

వర : ఏంఅడిగితే ఏంలాభంలెండి...అమ్మపెట్టే నాలుగూ తినాలని వ్రాసివుంది. తప్పించడం మనతరమా?

దేవ : ఎందుకండీ అంత బెంబేలుపడతారు. అంతగా ఎవ్వరూచెప్పకపోతే ప్రిన్సిపాలుగారితో చెబుతానని బెదిరించండి.

వర : అయ్యో, ఖర్మ! వాళ్లుమాత్రం తిరిగి బెదిరించరటండీ!

దేవ : ఇంతపిరికిగుండెవుంటే ఒకడిపార్టుమెంటుకు హెడ్‌గా ఎలాపని చెయ్యగలరండీ?

వర : మీరూ అదే మాట అన్నారూ—అవును లెండి...రాజాగారు పిల్లి అంటె పిల్లి, ఎలుక అంటే ఎలుక—నా మాట ఎవరు వింటారు కనుక...వస్తాను.

(వరదయ్య వెళ్ళిపోతాడు. దేవసహాయం నవ్వుకుంటాడు. ఇంతలో మూర్తి ఫైనో పైపిస్టు—వస్తాడు.)

దేవ : ఏమండీ మూర్తిగారూ! ఎన్నిసార్లు చెప్పాను, తొమ్మిదన్నరకల్లా యిక్కడ వుండాలి—అని...ఇప్పుడు టైం ఎంతయింది?

మూర్తి : క్షమించండి ... తొమ్మిదింటికే బయలు దేరాను...తీరా బయలుదేరబోతూవుండగా చిన్నవాడు అరుగుమీదినుంచి పడి చెయి విరుచుకున్నాడు. త్వరగా డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లి యిలా వచ్చాను.

దేవ : ఇటువంటి దెబ్బలూ, ప్రమాదాలూ మీకు పరిపాటయిపోయాయి. చెప్ప దలుచుకున్నవారు అస్తమానమూ ఒకే కారణం చెప్పడం కంటె, అప్పుడప్పుడు కొత్తవి చెప్పడం చాలా అవసరం.

మూర్తి : హరి, హరీ! ఎంతమాట! మీకు లేనిపోనివి కల్పించి చెప్పవలసిన అవసరం ఏముందండీ? జరిగింది అంతే—అందరూ చిన్నపిల్లలు. ఎవడో ఒకడు ఏదో అఘాయిత్యం చేస్తూ వుంటాడు.

దేవ : ఆ నెపంతో పనులు మానేస్తే ఎలాగనే నడిగేది...నిన్న అనగా యిచ్చిన కాగితాలు యింకా మీరు పూర్తి చెయ్యలేదు. ఇంకా అర్జంటు టపాలు వున్నాయి... ఇవన్నీ ఎప్పుడు అవుతాయి? కొంచెం ఆలస్యమయితే ఆయన నా మీద పడతారు.

మూర్తి : క్షమించండి ... తప్పయిపోయింది. అన్నీ యిప్పుడే చేసి యిస్తాను.

(తన సీటులోకి పోయి కూర్చుంటాడు.)

దేవ : బంగారూ, బంగారూ...(బిగ్గరగా) ఓరి నీ యిల్లు బంగారంకాను, ఒక్క క్షణంలో మాయం అవుతావేరా?

బంగా : వస్తున్నాను సార్......

దేవ : ఏం అఘోరిస్తున్నావు?

బంగా : అదేనండి...కారుమోత వినిపిస్తేనూ—

దేవ : (సర్దుకొని) అయ్యగారు వస్తున్నారా?

బంగా : కాదండీ...ఎవరో కొత్తవారు—

దేవ : ఇంతవరకు ఆ సోమయాజులుగారు రాలేదు చూడూ! ఎవరికి ఎంతని చెప్పగలం? (మూర్తి వంక చూస్తూ) ఏమండీ మూర్తి గారూ! మీకు సోమయాజులుగారు కనిపించారా?

మూర్తి : లేదండి......

దేవ : చూస్తున్నానుగా!...ఇప్పుడేమో యిలా పట్టనట్లుగా తిరుగుతారా, ఇదే ప్రిన్సిపాలుగారి ముందైతే అతి వినయంగా 'అలాగే, అలాగే' నంటారు.

బంగా : మరి పెద్ద దొరగారు కాదు బాబూ—

దేవ : మరి ఆ పెద్దదొరగారు వాళ్లను అడగనెం పోయి నామీద స్వారీచేస్తారెందుకు? (నలువైపులా చూచి) సరే! మనకెందుకు? గోడలకు చెవులుంటాయంటారు.

బంగారు: అందుకేకదు బాబూ!...మరి సోమయాజులు గారికి పిలుచుకు రమ్మంటారా?

దేవ : అదికూడా ఎందుకులే! పైగా ఆయన వచ్చి నీమీద పెత్తనం సాగిస్తారు... కాఫీ? తినవలసినవి నాలుగూ నేనే తింటాను ఆఁ! ఓకప్పు కాఫీ తెచ్చిపెట్టు.

బంగారు: అలాగే బాబూ!

దేవ : ఆఁ! వద్దులే! నేనే వెళ్ళితాగుతాను.

(బంగారు వెడతాడు. ఓక్షణం తరువాత కొన్ని కాగితాలు మూర్తి బల్లమీద వుంచి దేవ సహాయం వాకిటిలోకి వెడతాడు. ఆయన వెళ్లడంచూసి మూర్తి వైపు చెయ్యాడం ఆపి, ఇచ్చిన కాగితాలు ఒకసారి చూచి, నిట్టూర్చి, ఒళ్లు విరుచుకుంటాడు.

ఇంతలో సోమయాజులు వస్తాడు. వినయవంతుడు. కాని కళ్లవెనుక మనోనిశ్చయం ఎప్పుడూ కనిపిస్తూనే వుంటుంది. అవసరం అయితే ఏం చెయ్యడానికైనా వెనుదీయని మనిషి.)

సోమ : మూర్తిగారూ!

మూర్తి : (కంగారు పడిలేస్తూ) అయ్యా!—

సోమ : (నవ్వి) నేనేలెండి...ఏమిటి అలిసిపోయినట్లున్నారు!...మేనేజరుగారేరీ?

మూర్తి : ఇప్పుడే అలావెళ్లారు...మీకోసమే అడుగుతున్నట్లున్నారు.

సోమ : ఎందుకు?

మూర్తి : నాకేం తెలుస్తుంది బాబూ?

సోమ : అవును లెండి...ఆయనమాటలు ఆయనకే తెలియవు. పైగా ఒక్కక్షణం ఆలస్యమయితే అంతా ముంచుకుపోయినట్లు మాట్లాడుతారు... ఆ లైబ్రరీలిస్టును గురించి ప్రిన్సిపాలుగారికి ఆయనను కూడా చెప్పమన్నాను...ఇంతవరకు చెప్పలేదు...ప్రిన్సిపాలుగారు ఏమైనా వచ్చి వెళ్లారా?

మూర్తి : లేదండీ.

సోమ : ఓ! మరచిపోయాను. ఇవ్వాళ క్లబ్బులో ఆయన వుపన్యాసం వుంది.

మూర్తి : అయితే యీపూట కాలేజీకి రారా బాబూ!

సోమ : రమ్మనే చెప్పారు...ఏం?

మూర్తి : ఏం లేదండి! నాచిన్న పిల్లవాడు ఆడుకుంటూ, ఆడుకుంటూ చెయ్యి విరుచుకున్నాడు. డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి, వాడిని యింటికిపంపి నేను యిలా వచ్చాను.

సోమ : అయ్యో...సెలవు పెట్టకపోయారా?

మూర్తి : పదినిముషాలు ఆలస్యమయినందుకే మేనేజరు గారు—

(అడుగులచప్పుడు కావడంతో ఆపివేస్తాడు. భాస్కర్ వస్తాడు. యువకుడు. మంచితనం మనసులో గూడు కట్టుకొన్న మనిషి. ఎర్రగా, కందిపోయేలా వుంటాడు... అమ్మాయివంటి స్వభావం...లోపల ఏమీ దాచుకోలేని మనిషి.)

భాస్క : నమస్కారం.......ప్రిన్సిపాలుగారు వచ్చారా?

సోమ : (నమస్కారాన్ని అందుకొని)ఏం? ఏమైనా పనివుందా?

భాస్క : నన్ను పదిగంటలకల్లా కాలేజీకివచ్చి కలుసుకోమన్నారు.

సోమ : పదిగంటలకు ఆయనకు క్లబ్బులో వుపన్యాసం వుంటే మిమ్మల్ని ఎలా రమ్మంటారండీ!

భాస్క : మీరు పొరపడలేదుగదా! తనకు మరో పని ఏమీ లేదనీ, ఇద్దరం కూర్చొని ఏవో డాక్యుమెంట్లు చూడాలనీ అన్నారు.

మూర్తి : మరచిపోయివుంటారు.

సోమ : అవును...చాలా పెద్దవారా? మరచిపోవడానికికూడా అవకాశం లేకపోలేదు.

భాస్క : అంటే—యింకా దేనికైనా అవకాశం వున్నదనా?

సోమ : అబ్బే! అలా అని కాదు...నాతో గంట క్రితమే యీ సంగతి చెప్పారు...

భాస్క : చచ్చాం! నేను భోజనంకూడా చేసిరాలేదే!

సోమ : పోనీ, ఇప్పుడు చేసిరండి.

భాస్క : ఎందుకులెండి. ఈ లోగానే ఆయనవస్తే మళ్లీ ప్రమాదం. ఎందుకు? మన పనేదో మనం జాగ్రత్త చేసుకుంటే సరి—

సోమ : ఏమిటండీ అంతభయం!...ప్రతి రోజూ చూస్తున్నాను; ఇక్కడవున్న ప్రతిమనిషికీ రెండోవాడంటే భయమే! మనం నియమంగా మనపనిలో లోటురానివ్వకుండా వుంటే భయపడడం ఎందుకు?

మూర్తి : అలా అంటారేమండీ! వారిని ఆశ్రయించుకొని బ్రతికేవాళ్ళం. వాళ్లు చెప్పినట్లల్లా చేయకపోతే, మొదటికే మోసంరాదూ?

సోమ : మీ విధిని మీరు సక్రమంగా నెరవేరుస్తూ వుంటే, యింకా మొదటికి మోసం ఎందుకు వస్తుంది?

భాస్క : మీ పిచ్చిగాని,పనిచేసేవాడివటండీ రోజులు? డబ్బు వుండాలి, లేకుంటే డబ్బున్నవాడి ప్రాపకం వుండాలి—

సోమ : అందుకోసం, చీమ చిటుక్కుమన్నా భయపడుతూ ఎన్నాళ్ళు జీవితంగడపగలరు?... ఒక్కక్షణంకూడా హాయిగా బ్రతకలేని ఆ జీవితం ఎందుకు?

మూర్తి : బాబూ! ఏదో పెద్దవాణ్ణి; ఇన్నాళ్ల అనుభవంతోనూ చెబుతున్నాను......మన హాయిమాట అలా వుంచండి మనం వుద్యోగం చెయ్యడంవల్ల యింట్లో పిల్లా జెల్లా అయినా హాయిగా వుంటారు...ఈ భయమూ, యీ శ్రమా వాళ్లకోసం—

(ఇంతలో దేవసహాయం రాకను గమనించి మధ్యలోనే ఆపివేస్తాడు.)

దేవ : ఏమండీ మూర్తిగారూ! ఇచ్చిన పని పూర్తి కాలేదు; వుపన్యాసాలు దంచుతున్నారా? (ఇంతలో ముందుకువచ్చి, సోమయాజులును చూచి తమాయించుకొని)

ఓ! మీరా! ఎప్పుడువచ్చారు?... కూర్చోండి...(తన సీటు దగ్గరకు వచ్చి) ఏమండీ మూర్తిగారూ! పూర్తిచేశారా?

మూర్తి : (తడబడుతూ) అదే ... అవుతోంది ... ఇప్పుడే ఇస్తాను.

సోమ : (మూర్తిగారి స్థితిచూచి, జాలిపడి) అబ్బే! వాళ్ళ అబ్బాయికి కట్టు కట్టించి యింటికి పంపారట. ఎలా వుంటుందోనని బాధపడుతున్నారు.

దేవ : బాధపడడమంటే వుపన్యాసాలివ్వడం కాబోలు!..అయినా సోమయాజులుగారూ! ఇవన్నీ నాకెందుకు? నాకు కావలసిందిపని-అది పూర్తయితే నాకు మిగిలిన విషయాలే అక్కరలేదు.

సోమ : ప్రాణంకంటె, పని ఎక్కువటండీ!

మూర్తి : మేనేజరుగారూ!...పిల్లవాడినిచూచి, భోజనంచేసి ఓ అరగంటలో వస్తాను...

దేవ : వచ్చి పూర్తిగా అరగంటకాలేదు, అప్పుడే వెడితే ఎలాగండీ? ఈ పనంతా యెవరు చేస్తారు? ఇంతమాత్రానికి అసలు రాకుండా వుంటే పోయేదిగా!

మూర్తి : మీకు చెప్పిపోదామని వచ్చాను...ఈ పని కాస్తా పూర్తిచేసియిచ్చి సెలవు పెడతాను.

దేవ : ఎంతపని వుందో తెలిసివుండి కూడా సెలవు పెడతారా?...ప్రిన్సిపాలుగారితో చెప్పకో

గలిగితే వెళ్ళండి...నాకెంతమాత్రం అభ్యం తరం లేదు.

భాస్క : పోనీ పనిపూర్తిచేసే వెళ్ళండి మూర్తిగారూ! మీరు వెళ్ళడం, యీలోగా ప్రిన్సిపాలు రావడం, పని ఏమీ కాకపోవడం యివన్నీ ఎందుకు?

సోమ : మిస్టర్ భాస్కర్!...నీ మాటలుచూస్తే— మీరు మూర్తిగారు చెప్పిన విషయాలను నమ్మకసైనాపోవాలి; లేకుంటే మీకు సాను భూతి అనేమాట ఏకోశానా లేకుండాసైనా వుండాలి—అనిపిస్తోంది. మీరు ఆ పరిస్థితు లలోవుంటే ఏం చేసేవారు?...ఒక్కసారి ఆలోచించండి.

దేవ : ఏదో మాట వరసకి అనుకోవడమేకాని, వుండాలంటేమాత్రం మనం అటువంటి పరి స్థితుల్లో వుండొద్దూ?

సోమ : మీ జీవితంమీద మీకు అంత భరోసా వుంటే నేను చెప్పలేను...ఇబ్బందులు అందరికీ వస్తాయి...ఒక్కరోజు సెలవు యివ్వడం వల్ల మీకు పోయింది ఏమీలేదు.

దేవ : అమ్మమ్మ! ఆమాటమాత్రం అడగకండి. నా బాధ్యతమీద అటువంటిపని చెయ్యలేను... చెయ్యను...

సోమ : అదేమిటండీ ! ... అందరి సెలవుచూచేది మీరేకదా! చెయ్యలేనంటారేం? ఇష్టం లేదని చెప్పండి.

మూర్తి : అయ్యా! నామూలంగా ఈతగాదాఎందుకు? పనిచేసే వెడతాను.

సోమ : ఎందుకండీ అంత జారిపోతారు! మనం అక్ర మాలూ, అన్యాయాలూ చెయ్యమంటు న్నామా? ఇంట్లో ఇబ్బందిగా వున్నది కనక సెలవు ఇవ్వమంటున్నాం. ఇంత కష్టపడి యిక్కడ పనిచేస్తున్నవాళ్ళకు ఆమాత్రం హక్కులేదా?

భాస్క : అదేమిటండీ ! సెలవు తీసుకోవడంమనకు కాలేజీవారు కల్పించిన ఓసౌకర్యం తప్పిస్తే, అది హక్కుకాదు—

సోమ : (కొంచెం కోపంతో) ఏమిటీ ?

భాస్క : (సర్దుకొని) అహా—అవి ప్రిన్సిపాలుగారు అంటారుకదా—అని.

మూర్తి : పోనివ్వండి.... ప్రిన్సిపాలుగారు వచ్చిన తర్వాతనే వెడతాను.

సోమ : మీరు వెళ్ళండి... నేను చూసుకుంటాను.

దేవ : ఏమండోయ్, సోమయాజులుగారూ ! అంత మాట చెప్పేముందు కొంతస్తోమతు చూసుకో వాలి. అనవసరంగా మీరు అపాయంలో చిక్కుకుంటే, తరువాత నన్ను అనవద్దు.

భాస్క : మాస్టారూ ! అంతబాధ ఎందుకు? ప్రిన్సి పాలుగారు వచ్చేస్తారా—ఈలోగా యీ హంగామా అంతా—

సోమ : మీరుకూడా హంగామా అంటారేమండీ ! మనకుమాత్రం అవసరాలు, కష్టాలురావా ? (అంటూ విసురుగా అధ్యాపకుల గదిలోకి వెళ్ళిపోతాడు. మూర్తి నిట్టూర్చి తనకుర్చీలో కూర్చుని పనిచేయడం మొదలుపెడతాడు. దేవసహాయం, భాస్కర్ ప్రక్కనవున్న గదిలోకి వస్తారు.)

దేవ : చూశారా భాస్కర్‌గారూ ! సోమయాజులు గారు అంతవారు, యింతవారు అని వూరికే గొప్పలు చెప్పేవారే ! చూశారుగా, అయ్య గారి ప్రతాపం ! తిన్నయింటి వాసాలే లెక్కపెడుతున్నాడు. ఈయన యిక్కడే వుండిపోవాలని ప్రిన్సిపాలుగారు ఎంత ప్రయత్నం చేశారో తెలుసా ? అవును లెండి...పాముకు పాలుపోస్తే మాత్రం కాటు వెయ్యడం మాని, ముద్దు పెట్టు కుంటుందా ?

భాస్క : ఆయన అలా మాట్లాడారు కాని, ప్రిన్సి పాలు గారంటే ఆయనకు నిజంగా ఎంతో గౌరవం.

దేవ : ఈ కబుర్లకేంలెండి ... గౌరవం వున్న మనిషయితే, మాట్లాడే పద్ధతి యిదేనా ?

భాస్క : అవుననుకోండి—

[ఇంతలో బయటినుంచి ప్రిన్సిపాలు శ్రీ రావుసాహెబ్ డాక్టర్ పోలయ్య నాయుడుగారు వస్తారు. ఏభైఏళ్ళ మనిషి...

పాంటు, జోధ్‌పూరుకోటు, కళ్ళజోడు—మెడను ఓప్రక్కకు పెట్టి పైకి చూస్తూ మాట్లాడడం ఆయన అలవాటు. నిశ్చయాన్ని తెలియచేసే కళ్ళు, మాటమాటకూ అహంభావాన్ని సూచించే చేష్టలూ—ఆమనిషిని చూడగానే ఎవరైనా గమనించే విషయాలు. ఆయన వెనకవచ్చే చెన్నకేశవులు ప్రిన్సిపాలుగారి ప్రాపకంకోసం పాటుపడుతున్న మనిషి. అతివినయం, అతిజాగ్రత్త, అతి గాంభీర్యం—మనిషిలో ఏగుణమూ మితంగా లేదనిపిస్తుంది.]

ప్రిన్సి : అమెరికాలో అందరూ అదేమాట అనుకో... నాకు తెలియక అడుగుతాను మిస్టర్ కేశవులూ! అటు సాంఘికంగాను, యిటు విద్యా విషయకంగానూ దేశానికి సేవచేసే వాళ్ళు ఎంతమంది వున్నారంటావు?

చెన్న : ఎందరుంటారండీ? రెండోవాడిని చూపించండి—అందులోనూ ఆంధ్రదేశంలోటండీ—

ప్రిన్సి : వాళ్లూ అదేమాట! ప్రతివాళ్లూ— మీరు ఇండియాలో పుట్టవలసినవారు కాదనడమే!

చెన్న : అదిమాత్రం నిజం కాదటండీ! తెలివిగలవానిని కూడా పైకిరానివ్వకపోవడం ఒక్క యీ దేశంలోతప్ప—ఎక్కడా లేదనుకోండి.

(ప్రిన్సిపాలు నవ్వుతాడు. ఇంతలో భాస్కర్, దేవసహాయంవచ్చి నమస్కరిస్తారు. ప్రిన్సిపాలు చేతులతో ఓవిచిత్రమైన విన్యాసం చేసి వారిని ఆశీర్వదించినట్లుగా నమస్కారాన్ని స్వీకరిస్తాడు.)

భాస్క : నమస్తే...మీరు యీ పూట రారని—

ప్రిన్సి : ఓ!...అప్పుడే మీదాకా వచ్చిందా?... అవును. క్లబ్బులో ఇవ్వాళ నా ఉపన్యాసం వుంది. కాని పనితొందరవల్ల రాలేక పోతున్నానని చెప్పాను. వాళ్లు వదిలిపెట్టారా? "మీకోసం ప్రోగ్రాం సాయంకాలానికి మార్చుకుంటాం. రాక తప్పదు" అన్నారు. ఇప్పుడుకూడ ఒప్పుకోకపోతే, 'మాకావా! వీడికి ఎంత గర్వమో' అంటారు.

దేవ : పాపం! మీరు రావాలని వాళ్లు అంతగా అనుకుంటున్నప్పుడు వాళ్లను నిరుత్సాహపరచడం—

చెన్న : భావ్యంకాదంటారు. అంతేనా? గొప్పవాళ్లు రావాలనుకున్నప్పుడు, సంవత్సరాలయినా ఆగవలసిందే! ఆనాడు శ్రీకృష్ణపరమాత్మ దర్శనం కావడానికి మునులు ఎన్నియుగాలు తపస్సు చెయ్యలేదు?

(ప్రిన్సిపాలుగారు నవ్వుతారు.)

దేవ : నవ్వడంకాదండీ! చెన్నకేశవులు చెప్పినదానిలో చాలా నిజంవుంది...మీవుపన్యాసం వినే అదృష్టం—అది మాత్రం ఎందరికి వుంటుంది, చెప్పండి?

ప్రిన్సి : (నవ్వుతూ) ఏదో, మీ అందరి ప్రేమాభిమానాలవల్ల మీకలా అనిపిస్తున్నది... మీ అందరితో కలసివుండడం నాకు చాలా ఆనందంగా వుంది...ఆఁ! ఇంకా నిలబడే వున్నారు. కూర్చోండి...

చెన్న : ఫరవాలేదు...దానికేం! (అంటూ కూర్చుంటాడు.)

భాస్క : (కూర్చుంటూ) నన్ను ఎందుకో రమ్మన్నారట!

ప్రిన్సి : మిమ్మల్నా! ఎందుకబ్బా!...ఆఁ! అన్నట్లు సోమయాజులుగారు ఆ లైబ్రరీ లెక్కలన్నీ పూర్తిచేశారా?

భాస్క : నేను అడగలేదండీ?

దేవ : ఇంకా అవుతున్నాయని చెప్పారు.

ప్రిన్సి : పని ఇచ్చిన తరువాత యింత నానుస్తూ చెయ్యడమే నాకు బావుండదు. అంత అయిష్టంగా వుంటె చెప్పకూడదూ?

భాస్క : ఆయన అయిష్టంగా వున్నట్లు నాకు తోచడంలేదండీ! మార్పులు చాలా వున్నాయని, మీతో మాట్లాడాలని చెప్పారు.

ప్రిన్సి : నాకు తెలియనట్లుగా చెబుతారేం భాస్కర్! ఆపని ఎన్నాళ్లు చెయ్యాలి? ఈ వెధవ చిన్న పనికోసం వారం రోజులు తీసుకుంటే, యీ ప్రిన్సిపాలుపని ఎన్నాళ్లు చెయ్యగలనంటారు?

(భాస్కర్ మాట్లాడడు.)

చెన్న : మావంటి వాళ్ళకది సాధ్యమటండీ! ఎంత బాధ్యత, ఎంత శ్రమా! సామాన్యులవల్ల అవుతుందటండీ—!

ప్రిన్సి : నేను ఒక్కడినీ చెయ్యలేనని నాకు తెలుసు. అందువల్లనే మీ సహాయం నాకు ఎప్పుడూ అవసరం.

చెన్న : ఎంతమాట! మీరు 'ఊ' అనాలి కాని, ఎంత పనయినా అవలీలగా చేసి పెట్టంటండీ!

ప్రిన్సి : ఇంతటి వాళ్లు నాకు అండగా వున్నారు కనుకనే, యీ పదవిని యింత సమర్థతతో నిర్వహించగలుగుతున్నాను. ఆఁ! మిస్టర్ చెన్నకేశవులూ! రేపు సాయంకాలం నాకు ఇండియా—అమెరికా మైత్రీసంఘం—ఆంధ్రశాఖవారు సన్మానం చేస్తున్నారు. మీరు కూడా నా వెంట రావాలి. మీకు అభ్యంతరం లేక పోతే, కావలసిన ఏర్పాట్లూ, అవీ—

చెన్న : అంతకంటే నా—

ప్రిన్సి : ఫోనుచేసి రైలులో రెండుసీట్లు రిజర్వు చేయించండి.

చెన్న : సాయంకాలంలోగా అన్నీ కనుక్కుంటాను.
(అని వెళ్ళ బోతాడు.)

ప్రిన్సి : వెదితే, మీరు బజారుదాకా వెడుతూ వుంటే కొంచెం టైలర్ ని కనుక్కోండి—కొత్త సూట్లు పూర్తిచేశాడేమో!

చెన్న : తప్పకుండా కనుక్కుంటాను. వస్తాను... (నమస్కారం చేసి వెళ్ళిపోతాడు. అతని వంక జాలిగా చూస్తాడు భాస్కర్.)
ఆఁ! మిస్టర్ దేవసహాయం! ఇవ్వాళ పంపవలసిన ఉత్తరాలన్నీ పూర్తి అయ్యాయా?

దేవ : ఎక్కడండీ? ఆ మూర్తిగారికి నిన్న యిచ్చినవే పూర్తికాలేదు.

ప్రిన్సి : ఏం? ఎందుకని?

దేవ : వాళ్ళ అబ్బాయి క్రిందపడి చెయ్యి విరుచుకున్నాడట! అది కొంత ఆలస్యం ... తీరా కాలేజీకి వచ్చాక ఉపన్యాసాలతో కొంత ఆలస్యం...ఇంటికి వెళ్ళి మళ్ళీ వస్తానని కొంతసేపు—

ప్రిన్సి : అలా అయితే యిక్కడ పనిచెయ్యనక్కరలేదని చెప్పకపోయారా?

భాస్క : నిజంగా వాళ్ళ అబ్బాయి చెయ్యి విరిగిందటండీ!—అందువల్ల—

ప్రిన్సి : అందువల్ల యిక్కడ పని చెయ్యకపోతే ఎలా జరుగుతుందండీ? (మూర్తినికేక లేస్తూ) మూర్తిగారూ! మూర్తిగారూ! (మూర్తి వచ్చి భయపడుతూ చేతులు కట్టుకు నిలబడతాడు.)

ప్రిన్సి : ఏమండీ! పనులు చెయ్యడమంటే ఇలాగేనా!

మూర్తి : కాదండీ!...ఇంటిదగ్గర—

ప్రిన్సి : ఇంటిదగ్గర విషయాలకూ, కాలేజీ పనులకూ ముడిపెట్టవద్దని లక్షసార్లు చెప్పాను...... ఇంకా మీకాసంగతి తెలియకపోతే, యింటిదగ్గర వుండిపోవడమే మంచిది. పని చేయకుండా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే వాళ్ళు నాకు అక్కరలేదు.

భాస్క : (కొంచెం జంకుతూనే) పాపం! ఆయన పని చేసే వెడతానన్నారండీ—

ప్రిన్సి : అయితే—చేసి వెళ్ళమనండి.

భాస్క : అదే! ఇంకా భోజనంచేసిరాలేదట! హాస్పిటల్ నుంచి అలాగే కాలేజీకి వచ్చారట!... అందువల్ల—

దేవ : అందువల్ల భోజనంచేసి వచ్చిన తర్వాతనే తీరికగా యీపనులన్నీ చేస్తారట!

ప్రిన్సి : ఏపనులు ఎప్పుడు చెయ్యాలో, ఏవి తొందర పనులో తెలియకపోతే మీరు వుద్యోగం నిక్షేపంలా మానివేయవచ్చు...మాకు పని కావడం ప్రధానం. పనిచెయ్యకుండా వూరికే మేపడం మాకు చేతకాదు.

భాస్క : (వారిస్తూ) ప్రిన్సిపాల్ గారూ!

ప్రిన్సి : ఏం?

భాస్క : (సంబాళించుకుని) అహాఁ!...ఆయన పెద్దవారు. పనిచెయ్యకుండా వుండాలన్న అభిప్రాయం ఆయనకుమాత్రం వుంటుందా?
(ఈ మాటలు అంటూ వుండగా సోమయాజులు వస్తాడు.)

ప్రిన్సి : మిస్టర్ భాస్కర్! నాకు ఈ విషయాలేమీ తెలియవంటారా? నాకు ఎన్నాళ్లో అనుభవం వుందో తెలుసా? మీ వయస్సెంత—

సోమ : నమస్తే-ఏమండీ మూర్తిగారూ! మీ రింకా ఇంటికి వెళ్లిరాలా?

ప్రిన్సి : ఎందుకు?

దేవ : ఇందాకటినుంచి సోమయాజులుగారే ఆయన ఇంటికి వెళ్లిరావాలని మద్దతుయిచ్చారు.

సోమ : తప్పా?

దేవ : తప్పనికాదు...పని పూర్తికాకుండా—

సోమ : పని పూర్తి కావడానికి ఎంతసేపుపడుతుంది? ఆయన ఓగంటలో భోజనంచేసి వచ్చి మీ పని పూర్తిచేసి యివ్వలేడా? గంటలోనే అంతతొందరా?

మూర్తి : తొందరేమండి...తప్పనాదే! పూర్తి చేసే వెడతాను.

సోమ : కాదు డాక్టర్! ఆయన ఎందుకులేదని అలా అంటున్నారు. కొడుకుకు చెయ్యి విరిగింది. ఎలావున్నదో తెలియదు...తాను భోజనం చెయ్యలేదు...ఈ పరిస్థితుల్లో ఆయన తన పనినిమాత్రం సక్రమంగా ఎలా చెయ్యగలరు చెప్పండి...అందుకే ఆయనను ఇంటికి వెళ్ళిరమ్మన్నాను.

ప్రిన్సి : వెళ్ళి రమ్మనడానికి వేరే మనుష్యులున్నారు ...అది మీపదవికి మించినపని.

సోమ : దీనిలా పదవులప్రసక్తి ఏమున్నదండీ?

దేవ : ఎందుకు లేదు? ఇందాక 'అంతా నేను చూసుకుంటాను. మీరు వెళ్ళిరండి' అని మూర్తి గారితో మీరు అనలా?

ప్రిన్సి : అవునా?

సోమ : అవును డాక్టర్! ... ఆయనస్థితి ఆలోచించండి. పెద్దవాడు, భోజనం చేయలేదు... పైగా కుర్రవాడికి అపాయకరమైన దెబ్బ— ఇటువంటి సమయంలో ఆయన ఒక గంట యింటికి వెళ్లిరావడానికి అభ్యంతరమా?

ప్రిన్సి : అవన్నీ మాకూ తెలుసు. తెలియకపోయినా చెప్పవలసింది మీరు కాదు...ఆ! మూర్తి గారూ! మీరు యింటికి వెళ్ళిరావచ్చు.

మూర్తి : అక్కర్లేదు బాబూ! పని పూర్తిచేసే వెడతాను.

ప్రిన్సి : ఫరవాలేదు...మీరు వెళ్లిరండి.

(దేవసహాయం చిత్తర పోయాడు. భాస్కర్ జరుగుతున్నదంతా చూస్తూ వూరుకుంటాడు మూర్తిగారు నమస్కరించి వెళ్ళిపోతాడు.)

ప్రిన్సి : మాకుమాత్రం దయ, జాలీ వుండవా సోమయాజులుగారూ! — పరిస్థితులనుబట్టి పోవాలి. కాని మీరుమాత్రం యిటువంటి సలహాలిచ్చి ముప్పులో పడకండి.

సోమ : అచ్చే! ఆయన పరిస్థితులవల్ల జాలితో చెప్పానే కాని—

ప్రిన్సి : నాకూ తెలుసు నమకోండి...ఆ! మిస్టర్ దేవసహాయం! యూనివర్సిటీకి పంపవలసిన రికార్డ్సు, బిల్లులు ఒకసారి తీసుకురండి.

(దేవ సహాయం అలాగేనని వెడతాడు.)

భాస్క : నన్ను ఎందుకో రమ్మన్నారు.

ప్రిన్సి : అదే!...అదే...ఎందుకో జ్ఞాపకం రావడం లేదు. ఒక్క క్షణం ఆగండి...ఆ! సోమయాజులుగారూ! ఈ పదవిలో వున్న సాధకబాధకాలు మీకు తెలియనివి కావు...నేను చెప్పిన మాటలకు నా ఎదటనే వ్యతిరేకంగా మాట్లాడితే నన్నుగురించి, నా వుద్యోగాన్ని గురించి కొంచెం జాగ్రత్త తీసుకోవాలి.

సోమ : మీకు వ్యతిరేకంగా చెప్పాలన్న ఆ కాంక్ష నాకు అణుమాత్రంకూడా లేదు...మిమ్మల్ని కాని, మీ మాటలనుకాని వ్యతిరేకిద్దామన్న అభిప్రాయం అసలే లేదు.

ప్రిన్సి : కాకపోవచ్చు. కాని కాలేజీలో నా మాట వినవలసిన వారి దగ్గర అలా మాట్లాడుతూ వుంటే, దానికి తగిన జాగ్రత్త నేనూ తీసుకోవలసి వుంటుంది.

సోమ : క్షమించండి...మీకు బాధ కలిగించినట్లున్నాను.

ప్రిన్సి : బాధ ఏమీ లేదు...కొన్ని విషయాలలో మనం ఎంత నిర్దుష్టంగావుంటే అంత మంచిది.

బంగా : (వచ్చి) అయ్యా! మీకోసం ఎవరో ఫోనులో పిలుస్తున్నారు సార్!

ప్రిన్సి : వస్తున్నాను—(లోపలకు వెడుతూ) ఆఁ వెంకటరత్నంగారు వస్తే ఆగమని చెప్పు...

బంగా : అలాగే బాబూ!

భాస్క : వెంకటరత్నంగారెందుకు బంగారూ?

బంగా : ఏమో బాబూ!

సోమ : ఇంకా ఎందుకు? ఎక్కడో ఓ చిన్న పొర పాటు కనిపించి వుంటుంది...ఇక దాన్ని సాగదీసి ఆయన ప్రాణాలు తీయడానికి—

భాస్క : మరీ అన్యాయంగా మాట్లాడకండి. ఆయ నంటే ప్రిన్సిపాలుగారికి అంత కోపం ఎందుకు?

సోమ : (నవ్వి) ఇంకా మీరు ఎక్కడ వున్నారు భాస్కర్ !... మీరు కాలేజీనిపరించిన ఒక్క సత్యంకూడా తెలియకపోవడం ఆశ్చ ర్యంగా వుంది.

భాస్క : నాకు అర్థం కావడంలేదు.

సోమ : ఎలా అవుతుంది భాస్కర్! మీకూ ఇలాంటి అనుభవాలు కలగాలి...ఏం బంగారూ! నిజం చెప్పు...నిన్న ఇంగ్లీషు హెడ్ గారిని ప్రిన్సి పాలు గారు ఎందుకు తిడుతున్నారు?

బంగా : ఏదో బీదవాళ్లం ... మాకేం తెలుస్తుంది బాబూ!

సోమ : ఫరవా లేదు బంగారూ! మేము మాత్రం బీద వాళ్లం కాదా!

భాస్క : చెప్పు బంగారూ! ఏం జరిగింది?

బంగా : జరగడానికి ఏం వుంది బాబూ! మొన్న పెద్ద అయ్యగారు యీయనగారిని యింటికి రమ్మన్నారంట! ఈయనగారు వెళ్లలేదు కాబోలు...ఇక చూడండి బాబూ! ఒక తిట్టుకాదు, ఒక మాట కాదు—

భాస్క : ఏమిటి రాఘవరావుగారినా?

బంగా : అదేం బాబు అలాగంటారు. ఆయన్ని రోజు కొకసారయినా తిట్టకుండా వుండరుబాబూ— ఆ సత్తెకాలం మనిషి ఏమీ ఎదురు చెప్పడు.

భాస్క : నేను నమ్మలేకుండా వున్నాను.

సోమ : మీరు నమ్మలేని నిజాలు యీ కాలేజీలో చాలా వున్నాయి... నిలకడమీద మీకే తెలుస్తాయి.

[ఆచార్య వెంకటరత్నంగారు వస్తారు. మనిషి పచ్చని పసిమి. నెరసిన జుట్టు. నవ్వుతూవుండే పెదవులూ, లాల్చి, గ్లాస్గో ధోవతి మల్లెపువ్వులా వుంటాడు...ఆయన రాగానే యిద్దరూ నమస్కరిస్తారు.]

వెంక : (నమస్కారం అందుకొని) ఏమండీ సోమ యాజులుగారూ! ప్రిన్సిపాలుగారు రమ్మన్నా రట!—

సోమ : మాకూ అంతవరకే తెలుసునండీ! ఎందు కోమాత్రం తెలియదు.

వెంక : ఎక్కడకు వెళ్ళారు?

భాస్క : లోపల ఫోనులో మాట్లాడుతున్నారు.

వెంక : బంగారూ! నేను వచ్చానని అయ్యగారికి చెప్పు.

బంగా : అట్లాగేనయ్యా!...(వెళ్ళిపోతాడు)

వెంక : ఇంటికి కబురుపెట్టి, పిలిపించే తొందరప నేమిటో!

సోమ : ఏలినవారి మనసుకు నచ్చిందే తొందర పని–

వెంక : తీరా వచ్చామా, అడిగిందే అడిగి మన ప్రాణం తీస్తారు. మనం ఏం చెప్పినా వినరు...అంత సమానంలేని మనుషులు ఈ పదవికి తగరండీ–

సోమ : ఇక పొరపాటున నలుగురిలో వుండగా వెళ్ళామా, అప్పుడు చూడాలి, నాయుడిగారి ప్రతాపం...ఆయన అప్పుడు అనే మాటలు విన్నతరువాతకూడా యింకా వుద్యోగం చేస్తున్నందుకు మనం అనుకోవాలి.

వెంక : మావంటివాళ్ళం సరే భాస్కర్ !...మీ వంటి కుర్రవాళ్లయినా మరో మంచిచోటుకు ఎందుకు పోరు?

సోమ : ఆమాట అనకండి...భాస్కర్‌కు యిది, భూలోకస్వర్గం—

వెంక : పెద్దవాళ్ళం అయిపోయాం...ఎందుకులే బ్రతికినన్నాళ్లు బ్రతకమని చూస్తున్నాం కాని—లేకుంటే యిన్ని అక్రమాలు జరు

గుతూవుంటే చూస్తూకూడా యింకా యిక్కడ వుద్యోగం చేసేవాళ్లమా?

సోమ : కాలేజీలో ఎవ్వరూ కూడా యీ బ్రహ్మాండమయిన 'షో' వెనుక జరుగుతున్న భాగవతం సంగతే గమనించడం లేదు—ఎందువల్లనో!

వెంక : అయ్యో! వారి కివన్నీ ఎందుకు? కాలేజీకి ఎన్నేళ్ళు—? — డబ్భై — ఎంతమంది పిల్లలు? — రెండువేలమంది. ప్రిన్సిపాలుగారు ఎటువంటివాడు?—అబ్బో! చాలా గొప్పవాడు—ఆయనటండీ—...

ఇవి చాలవుటండీ యీ కాలేజీ గొప్పతనం చాటేందుకు? ఇవన్నీ గమనిస్తున్నవారికి—వెనుక ఏం జరుగుతున్నదో ఎందుకు?

సోమ : అవునండీ! భాస్కర్ లా అధికారవర్గాలకు సన్నిహితులైనవారే యీ విషయాలు గమనించడం లేదంటే చాలా ఆశ్చర్యంగావుంది.

వెంక : అవి అంత తేలికగా కనుపించవండీ...... ఎన్నో ఏళ్ళనుంచీ యిక్కడ వున్నాం కనుక లోపల ఎంత కుళ్లు, ఎంత మోసం, ఎంత అన్యాయం జరుగుతోందో మనకు తెలుసు—నిన్న వచ్చిన భాస్కర్ కు ఎలా తెలుస్తుంది?

భాస్క : ఇప్పుడు నాకు ప్రతి విషయం అర్థం అవుతోంది. వెనుక జరిగిన సంఘటనలను నెమరుకు తెచ్చుకుంటే జరుగుతున్నదేమిటో పూర్తిగా అర్థం అవుతోంది.

దేవ : (ఫైల్తో వచ్చి) ఆఁ! అయ్యా—(ప్రిన్సిపాలుగారు లేరని చూచి, నాలుక కరుచుకొని, వెంకటరత్నంగారికి నమస్కరిస్తూ) ఆఁ! అయ్యగారు యిక్కడ లేరండీ?

సోమ : లేరు...లోపల ఫోనులో మాట్లాడుతున్నారు. (ఇంతలో ప్రిన్సిపాలుగారు గదిలోకి వస్తారు.)

వెంక : నమస్కారమండీ...నన్నెందుకో రమ్మన్నారట!

ప్రిన్సి : అవునండీ!......ఆ తెలుగు కాంపోజిషన్ పుస్తకాల సంగతి ఏమిటి?

వెంక : ఏం? ఏమయింది?

ప్రిన్సి : అవి ఎన్నెన్ని వ్రాయించాలో, ఆమార్కులు రిజిస్టరులో ఎక్కిస్తున్నారో లేదో, అవేమీ ఆఫీసులో తెలియకపోతే ఎలాగండీ?

వెంక : అదేమిటండీ! అన్ని వివరాలూ ఎప్పటికప్పుడు యిస్తూనే వున్నాంకదా!

ప్రిన్సి : అవి చాలవండీ!...ఏ విద్యార్థి ఎప్పుడు వ్రాయలేదు?—అసలు ఒక్కొక్కరూ ఎన్ని కాంపోజిషన్లు వ్రాయాలి? సంవత్సరానికి ఎన్ని వ్రాయాలి?...వ్రాయకపోతే ఆ విద్యార్థిమీద ఏం చర్య తీసుకోవాలి... ఇవన్నీ తెలియవద్దటండీ?

వెంక : ఇవన్నీ ముందుగానే మీతో చెప్పానండీ.

ప్రిన్సి : నాతో చెబితే సరిటండీ! ఎన్ని విషయాలు ఎందరు చెబుతారో......అవన్నీ జ్ఞాపకం వుంచుకోవడమే నా పనా?

వెంక : (కోపం వచ్చింది. కాని అణచుకొని) అయితే, ఇప్పుడేం చెయ్యమని సెలవు?

ప్రిన్సి : చూడండి!......ఇంతగా నేను స్ట్రిక్ట్ గా వుంటున్నానంటే మన కాలేజీ నలుగురిలో సాటిలేని దనిపించుకోవాలని, సెభాష్ అనిపించుకోవాలనే!-ఏమంటారు? (వెంకటరత్నంగారిని ప్రశ్నించి, ప్రశ్నార్థకంగా మిలిగినవారివంక చూస్తాడు.)

వెంక : అవునవును.

ప్రిన్సి : అందువల్ల—కొందరికి కొన్ని సందర్భాలలో బాధకలిగినా మనం పనులు చేసుకుపోవాలి.

వెంక : అవును......మరి నన్ను యిప్పుడేం చెయ్యమంటారు?

ప్రిన్సి : దానికి చేసేదేమున్నదండీ! పని ఎలా జరుగుతున్నదో వివరంగా ఆఫీసుకు ఓ నివేదిక వ్రాయండి.

వెంక : అలాగే!...(అని వెళ్ళిపోతూ వుంటాడు.)

ప్రిన్సి : ఆఁ!...దానితోపాటు ఆలస్యానికి ఓ వివరణకూడా వ్రాయండి...అది ఆఫీసులో వుండాలి చూడండి...

(వెంకటరత్నంగారు ఓ సారి సీరియస్ గా ప్రిన్సిపాలుగారివంక చూచి, 'అలాగే' అని వెళ్ళిపోతాడు.)

ప్రిన్సి : (ఆయన వెళ్ళినవైపుచూచి నవ్వుతూ) ఈ ప్రిన్సిపాలు వుద్యోగం చాలా ఘండాల మయినదనుకోండి...బరువు, బాధ్యతా—పైగా ప్రతివాడినీ కూడదీసుకొని వచ్చే సరికి తల ప్రాణం తోకకు వస్తుంది.

భాస్క : అవును......కాని డాక్టర్!...మరికొంచెం మెత్తగా, మృదువుగావుంటే పనులు కావంటారా?

ప్రిన్సి : (నవ్వుతూ) మీకేమీ తెలియదు భాస్కర్! ఏ ఎండకు ఆ గొడుగు పట్టాలి...ఎక్కడ కఠినంగా వుండాలో, ఎక్కడ మెత్తగా వుండాలో నాకు తెలియదంటావా?

దేవ : రికార్డు అడిగారు. ఇదిగోనండి. (అని ఇస్తాడు.)

ప్రిన్సి : ఆఁ!...(అవి తిప్పి) ఇవి మీరిద్దరూ కలిసి కొంచెం చూచిపెట్టండి......

భాస్క : దానికేం?...

ప్రిన్సి : మీకు మరేమీ పనులు లేవుగా సోమయాజులు గారూ!

సోమ : అబ్బే!......(ఇద్దరూ వెళ్ళిపోతారు.)

ప్రిన్సి : (ఓ క్షణం ఆగి) ఈయన తను చెడేది కాకుండా, అమాయకుడు భాస్కర్ నీ దించుతున్నాడనుకుంటాను.

దేవ : ఆ మూర్తిగారి విషయంలో—ఇందాక—ఒకటే రెండూ మాటలా యీయన అన్నది?

ప్రిన్సి : ఎవరు? భాస్కరా?

దేవ : కాదండీ...సోమయాజులుగారే!

ప్రిన్సి : అంటాడు, అంటాడు...చూచి చూచి తోక తెగకోస్తే సరి—

దేవ : ప్రిన్సిపాలుగారుమాత్రం ఏమంటారు? పని వస్తే వెళ్ళవద్దంటారా?...మీరు వెళ్ళండి, నేను చూసుకుంటాను–అంటూ ఒకటా?... నేను చెప్పినా విన్నారనుకున్నారా?

ప్రిన్సి : ఆ కమిటీలో పలుకుబడి చూచుకొని ఎగురుతున్నాడు కాబోలు...ఈ నాయుడు ముందు కుప్పిగంతులు పనికిరావని ఇంకా తెలుసుకోలేదు.

దేవ : ఎలా తెలుసుకుంటాడండీ? తెలియచెప్పాలి.

ప్రిన్సి : (రికార్డుచూస్తూ) అవునవును ... ఆలోజా వస్తుంది...ఇదేమిటి! స్పెక్ట్రోమీటరు ధర వేశారెందుకు?

దేవ : అది పగిలిపోయిందండి.

ప్రిన్సి : ఎప్పుడు?

దేవ : ఇవ్వాళ వుదయమే...వరదయ్యగారు వచ్చి చెప్పివెళ్ళారు ... ఈ సంవత్సరం బడ్జెటులోనే వేస్తే సరిపోతుందిగదా అని—

ప్రిన్సి : ఎలాపోయిందట?

దేవ : ఆయనకూ తెలియదుటండీ!

ప్రిన్సి : ఛీ, ఛీ! ఒక్క విషయం తెలియదు. ఒక్క పని సరిగా చెయ్యడం చేతకాదు...ఒకసారి చెబితే బుద్ధివుండొద్దూ?......బంగారూ, బంగారూ—

[బంగారు త్వరగా వస్తాడు.]

వెళ్ళి ఆ వరదయ్యగారిని పిలుచుకురా—

బంగా : ఇప్పుడే రమ్మన్నారా అండీ?

ప్రిన్సి : ఇప్పుడే—ఇక్కడే వున్నట్లు రమ్మను.

[బంగారు వెళతాడు.]

ప్రిన్సి : ఇటువంటివాళ్ళందర్నీ పెట్టుకొని పని చేయాల్సివస్తోంది—ఛీ!

దేవ : కాదుటండీ!... అసలే శ్రమ, బాధ్యత ఎక్కువ...... .. అందులోనూ ఇటువంటి వాళ్ళుంటే వేరే చెప్పాలా? (ఇంతలో భాస్కర్, సోమయాజులు వస్తారు.)

సోమ : అన్నీ సవ్యంగానే వున్నాయి...ఇక్కడ ఈ ఒక్క కూడిక తప్పుగావుంది......ఒకసారి చూడండి......

దేవ : చూసి తీసుకువస్తాను......(తీసుకొని వెళ్ళిపోయాడు.)

[వరదయ్య భయంగా, త్వరగా వస్తాడు.]

ప్రిన్సి : ఏమండీ!...ఏమిటి ప్రొద్దునే ఘనకార్యం చేశారట!

వర : నేనుకాదండీ చేసింది.

ప్రిన్సి : మరి ఎవరు?

వర : నాకు తెలియదండీ—

ప్రిన్సి : చేసింది మీరు కాదు; ఎవరు చేశారో మీకు తెలియదు......మరి ఏమీ తెలియకుండా ఓ డిపార్టుమెంటుకు హెడ్‌గా ఎలా చేస్తున్నారండీ పని?......అప్పుడు మీరే చెయ్యాలా? బజారునపోయే ఎవడిని తీసుకు వచ్చి పెట్టినా చేస్తాడుగా!

వర : అది కాదండీ!...నేను వచ్చేసరికే—!

ప్రిన్సి : మీరు నాకింకేమీ చెప్పకండి...తప్పుచేసి కూడా సమర్థించుకోవడం చూస్తేనే నాకు అసహ్యం వేస్తుంది.........ఈ కాలేజీలో రెండో కంటివాడికి తెలియకుండా వెయ్యి రూపాయల సామాను పోయిందంటే మీరంతా ఏంచేస్తున్నట్లు? ఎందుకండీ మీరంతా?

వర : తప్పైఅయిపోయింది—

ప్రిన్సి : మీ సంజాయిషీలు నాకేం అక్కర్లేదు... కమిటీకి రేపు సమాధానం ఏమని చెప్పను?... చిన్న వస్తువు కనకనా, సర్ది చెప్పడానికి?... (వరదయ్యవంకకు తిరిగి) ఆమాత్రం జాగ్రత్త లేకపోయాక మీరు హెడ్‌గిరీ వెలగబెట్టడం దేనికి? గాడిదలు కాయనా?

(ఎవ్వరూ మాట్లాడరు)

ఛా! ఇంత అసమర్థులైనవాళ్ళతో పనులు పూర్తిచేసుకోవాలి...మళ్ళీ అన్నీ సవ్యంగా వుండాలి. ఎలా?...ఇంకా ఎందుకు నా ఎదట? వెళ్లండి...ఆఫీసుకు ఓ సంజాయిషీ, ఓ క్షమాపణ వ్రాసి యివ్వండి.

వర : అలాగే—(భయంగా వెళ్ళబోతాడు)

ప్రిన్సి : చూడండి......ఇది ఆఖరుసారిగా చెబుతున్నాను. ఇంత నిర్లక్ష్యంగా వుద్యోగం చేసే వాళ్ళు నాకు అక్కర్లేదు. ఆ మాట జ్ఞాపకం వుంచుకోండి...

(వరదయ్య వెనకకు తిరిగినవాడు అలాగే వుండిపోతాడు.)

ఇంకేం?...వెళ్ళి రండి...

(వరదయ్య నమస్కరించి వెళ్లిపోతాడు. ప్రిన్సిపాలుగారు కూడా 'దేవసహాయం, దేవసహాయం'—అంటూ లోపలకు వెళ్ళిపోతాడు. సోమయాజులు దీర్ఘంగా నిట్టూర్చి భాస్కర్ వంక చూస్తాడు.)

భాస్క : ఇన్నాళ్లు యింత దగ్గరగా తిరిగాను. కాని నాకు ఎన్నడూ యీవిధంగా అనిపించలేదు. నన్ను నేను ఎంతగా ఆత్మవంచన చేసుకున్నానో యిప్పుడు తెలుస్తోంది. ఎంత కపటం! ఎంత మాత్సర్యం! ఎంత గర్వం!! అబ్బ—ఇన్ని దుర్గుణాలు వుంచుకొని కూడా మనుష్యులు పైకి ఎంత గౌరవనీయులుగా చెలామణీ అవుతున్నారో!

సోమ : (నవ్వి) భాస్కర్! ఇవ్వాళే మీరు తెలుసుకున్నారు కనక ఇలా బాధపడుతున్నారు... కాని ప్రతిమనిషిమానవతమీద ఎన్ని అకార్యాలు జరుగుతున్నాయో మీకు తెలియదు. మీకు కనిపించేది కుళ్లిన పండుపైన వున్న రంగే! రుచి చూచినవాళ్ళకు కాని లోపల సంగతి తెలియదు.

భాస్క : ఆయన హెడ్ కదా!...పైగా తనతో వుద్యోగంలో చేరినవాడు. ఇంత హీనంగా, పశువు కన్న నీచంగా ఆయన ఎలా చూడగలుగుతున్నాడు...ఆయన అలా చూస్తుంటే ఇంకా ఈయన ఎలా వుండగలుగుతున్నాడు?

సోమ : అదేమిటి భాస్కర్!...ప్రిన్సిపాలుగారు సర్వాధికారి...రాజదండం నిరంతరం అధికారానికి ప్రతినిధిగా నిలబడి వుంటుంది... మరి ఆయన? పిల్లలు కలవాడు...కోపం వచ్చి వెళ్ళిపోతే రేపు వాకిట్లో నిలబడవలసిందే!

భాస్క : అందుకని — మానాభిమానాలు చంపుకొని అంత అవమానపరుస్తూంటే ఆయనదగ్గరే పని చెయ్యగలడా?

సోమ : మీరింకా జీవితంలో వాస్తవికతను ఎదుర్కోలేదు భాస్కర్...ఆ పరిస్థితుల్లో మీరు వుంటే ఆ బాధ మీకు తెలుస్తుంది....ఇన్ని అన్నా బాధపడకపోవడానికి ఆయనమాత్రం మనిషి కాడా?

భాస్క : ఏమిటో!.........ఇకమీదట — ఇవన్నీ తెలిశాక — ఇక్కడ ఓక్షణం వుండలేననిపిస్తున్నది.

సోమ : ఏదైనా అలవాటు కావాలి చూడండి...

భాస్క: లేదు...ఇది అలవాటు కాదు; చేసుకోవాలనీ లేదు ... ఆఁ! ఇప్పుడే వస్తాను. (అని స్టాఫ్ రూములోకి పోతాడు. వెనుకగది నుంచి ప్రిన్సిపాలు, వెనుక దేవసహాయం వస్తారు.)

ప్రిన్సి : మాశారా సోమయాజులుగారూ! ప్రొద్దున పార్టీ వుందన్నానా! అది సాయంకాలానికి మార్పించాను......సాయంకాలం విద్యామంత్రిగారు వస్తున్నారు......ఇక వెళ్లడం కుదరదు... ఆయినను రిసీవ్ చేసుకోవడానికి స్టేషన్‌కు వెళ్లాలి. ఆఁ!... అన్నట్లు రాత్రికి స్టాఫ్ అంతా కలిసి ఆయనకు గ్రాండ్ డిన్నర్ యిస్తే బావుండదూ?

(భాస్కర్ వస్తాడు)

ఓ! మిస్టర్ భాస్కర్! రాత్రికి విద్యామంత్రిగారు విచ్చేస్తున్నారు...స్టాఫ్అంతా కలిసి ఓ డిన్నర్ యివ్వాలి. భాస్కర్ మాట్లాడాలి.

దేవ : చాలా మంచి ఐడియానండి. అంతకంటె కావలసింది ఏముంటుంది?

ప్రిన్సి : మీరేమంటారు? (అని యిద్దరివంకా చూస్తాడు.)

సోమ : బాగానే వుంటుందనుకోండి...కాని అందర్నీ సంప్రదించి చేస్తే—

ప్రిన్సి : ఇప్పుడా! ...... వ్యవధి చాలా స్వల్పంగా వుంది... చెయ్యవలసింది చాలావుంది· అందువల్ల — (దేవసహాయంవంకకు తిరిగి) నోటీసు టైపుచేయించి, అందరకూ పంపు.

భాస్క: అందరికీ యిప్పుడు పంపితే అందక పోవచ్చును.

ప్రిన్సి : రానివాళ్లకోసం మనం ఏం చెయ్యగలం? మళ్లీ మళ్లీ ఆయన రాడుకదా! వచ్చిన యీ ఒక్క అవకాశాన్ని జారవిడుచుకున్న తరువాత మళ్లీ చింతిస్తాం... సరే! ఇలా అనుమానాలు పెట్టుకు కూర్చుంటే పనులు కావు ... టైపుచేయించి సర్క్యులేటు చేయించు.

(దేవసహాయం 'చిత్తం' అని వెళ్లిపోతాడు.) యీ విషయంలో నాకు మీ సహాయం చాలా అవసరం...ఆఁ! ఒక్క నిముషం... కలెక్టరుగారితో కూడా చెప్పివస్తాను. (అని వెళ్లబోతూ, ఆగి) ఆఁ!...సోమయాజులుగారూ! మీ లైబ్రరీ పనంతా పూర్తయిందా?

సోమ : ఎక్కడండీ? చాలాపని మిగిలిపోయింది.

ప్రిన్సి : (వెడుతూవున్నవాడు, వెనుకకు తిరిగివచ్చి) అదేమిటండీ! ఎన్నాళ్లయింది. మీకు యిచ్చి—?

సోమ : చాలారోజు లయిందనుకోండి. కాని అక్కడ ఒక్క పుస్తకం వుండవలసిన చోట లేదు... అయిదువందలదాకా పుస్తకాలు కనిపించడమే లేదు...ఇవన్నీ ఎలా జరిగాయో ఏమీ బోధపడడం లేదు.

ప్రిన్సి : మరి యిదంతా యిన్నాళ్ళూ నాకు చెప్పలేదేమండీ?

సోమ : మొన్న మీకు చెబుతూవుండగా మీ యిష్టం వచ్చినట్లు చెయ్యండి అన్నారు.

ప్రిన్సి : మరి చేశారా?

సోమ : ఎలా? పుస్తకాలు ఏమయ్యాయని ఎవరిని అడిగినా సమాధానం చెప్పరు. ఎవరికివారు తెలియదంటారు...ఇచ్చిన గ్రాంటుతో తెచ్చిన పుస్తకాలు సగమే కనిపిస్తున్నాయి.

ప్రిన్సి : ఇన్ని అవకతవకలు వుంటే యిప్పుడు చెబుతున్నారా?

సోమ : ఈ సంగతి కూడా మొన్న చెప్పాను.

ప్రిన్సి : ఏం చెప్పారండీ?...చెబితే నాకు జ్ఞాపకం వుండదూ?

సోమ : మీరు అలా అంటే ఏం చెప్పగలను?

ప్రిన్సి : ఇప్పుడేమీ చెప్పొద్దు...ఏం చెయ్యగలరో అది ఆలోచించండి.

సోమ : మీకు ఓక్షణం తీరికవుంటే—అన్నీ చూడడానికి ఓగంటకంటె ఎక్కువ పట్టదు.

ప్రిన్సి : ఇప్పుడా! అవతల మంత్రిగారు వస్తున్నారు. నాకు రేపు వుదయం ప్రయాణం వుంది... ఇప్పుడు ఎలా?

సోమ : మరి ఎప్పుడు చూద్దామంటారు?

ప్రిన్సి : తెలుసుకున్నప్పుడే తాత పెళ్లిఅయితే ఎలా? ...వచ్చిన తర్వాత చూద్దాం...

సోమ : మీ యిష్టం—

ప్రిన్సి : ఆ...ఇప్పుడే వస్తాను...(లోపలకు వెళతాడు.)

భాస్క : చూస్తున్న కొద్దీ నాకు మతిపోతున్నది. ఈయనే నా నేను అదివరకు అంతగొప్పగా చిత్రించుకొన్న రావుసాహెబ్ డాక్టరు పోలయ్యనాయుడుగారు—అని.

సోమ : అది మీ తప్పు కాదు. పరిస్థితుల ప్రభావం.

(బంగారు వస్తాడు)

బంగా : అయ్యా! దొరగారు లేరా అండీ?

భాస్క : దొరగారు లోపల మంతనాలు సాగిస్తున్నారు.

సోమ : ఎందుకు బంగారూ?

బంగా : ఓ పదిరూపాయలు యిప్పిస్తారేమోనని. మా యింటికాడ దానికి ఒళ్లు ఏం సరిలేదండి ...అది కాస్తా పడకేసిందంటే మా పని సున్నా...అందుకని మారాజుల్ని బతిమాలు

భాస్క : పోనీ, నీజీతంలో కొంత ముందు తీసుకో.

బంగా : అలాగ ఎలా యిస్తారు బాబూ; నెలాఖరుకు యివ్వడానికే అంత యిది చేస్తారే!

భాస్క : ఎందుకు?

బంగా : ఎందుకేముంది బాబూ! మాలాంటివాళ్లకివ్వడానికి అందరికీ అంతే!...పాతికేళ్లనుంచీ పని చేస్తున్నానుగదా—నాకు యింకా ఏభై రూపాయలు జీతం...ఈ రాళ్ళలో గడపాలి బాబూ!...లంకంత సంసారం—

సోమ : అవును బంగారూ! మనగోడు ఎవరికి కావాలి? శ్రమ మనదీ, అనుభవించేది మరొకరూ—

బంగా : ఓరూపాయి ఎక్కువ చెయ్యమని మొన్న అడిగానండి...పెద్దయ్యగారు కొట్టొచ్చారు. ఇహ మేనేజరుగారిసంగతి చెప్పనే అక్కర్లేదు. ఆయన జేబులో డబ్బులిచ్చినట్లు బాధపడతారు...మళ్ళీ అడిగితే నువు చేసే పనికిది వాల్లే అంటారు. మీరు చూస్తున్నారుగా బాబూ! పొద్దున ఎనిమిదింటికి వస్తాను. మళ్లీ రాత్రి ఏడింటికి ఇంటికి పోవడం—

సోమ : అవును బంగారూ! పెద్దలు ఇలా ఉన్నంత కాలం మనం ఒక్క అడుగు ముందుకు వెయ్యలేం.

భాస్క : మరి మరోచోట ఉద్యోగం చేసుకోలేకపోయావా?

బం : ఎక్కడికి వెళ్ళినా యింతేగా బాబూ!

సోమ : అక్కడ మాత్రం యజమానులు ఉండరా? ఆ అంతరం ఉండనేకూడదు కాని వున్న తరువాత ప్రతిచోటా ఉండి తీరుతుంది. పైగా—జీవితంలో పెళ్ళిచేసుకొని పిల్లల్ని కనడం జరిగాక—మనిషి తనకోసం కాక వాళ్ళకోసమే ఎక్కువగా బ్రతుకుతాడు... ఆసత్యానికి ఎవ్వరూ దూరంగా వుండలేరు.

భాస్క : అధికారం చేతులోకి రాగానే మనుషులు యిలా ఎలా మారిపోతారో?

సోమ : కనకపు సింహాసనంలో కూర్చోగానే సరి—ఏమైనా జరుగుతుంది.

(చెన్నకేశవులు ఆదుర్దాగా వస్తాడు)

చెన్న : దొరగారూ—ఏరండీ?

భాస్క : ఎవరండీ ఆదొరగారూ?

చెన్న : అదేనండీ! ప్రిన్సిపాలుగారు.

భాస్క : మరి దొరగారంటారేం?

చెన్న : అదేలెండి......ఏరీ వారు?

భాస్క వారు వెడుతూ ఎక్కడికి వెడుతున్నారో చెప్పి వెళ్లలేదు.

చెన్న అలాగా!

సోమ ఏమండీ, చెన్నకేశవులుగారూ! వెళ్లినపని ఏం చేసుకొని వచ్చారు?

చెన్న ఏ పని?

సోమ అదే! ప్రిన్సిపాలుగారు చెయ్యమన్నది.

చెన్న ఏం చేస్తే మీకెందుకు?

సోమ ఏం లేదు......ప్రభు భక్తి ఎన్నిపాళ్లు వుందా—అని.

చెన్న వేళాకోళంగా వున్నదా యేం?

సోమ అమ్మమ్మ! ఎంత మాట!!

ప్రిన్సి : (వస్తూ) ఆఁ! డిన్నరుకు కలెక్టరుగారు కూడా వస్తానని మాట యిచ్చారు. ఓ! మిస్టర్ చెన్నకేశవులూ!...ఇవ్వాళ రాత్రికి విద్యా మంత్రికి డిన్నర్ ఇస్తున్నాం.

చెన్న : మీరా సార్!

సోమ : కాదండీ! స్టాఫ్ అంతా కలిసి—

చెన్న : అలాగా!...చాలా బావుందండీ...

ప్రిన్సి : మీరందరూ సహాయం చెయ్యాలి......ఓ! క్షమించండి...ఇది మీ ఫంక్షన్ మాత్రం కాదా?

చెన్న : అయ్యో! మీరు చెప్పాలా?

ప్రిన్సి : ఆఁ!...వెళ్లిన పనులన్నీ అయ్యాయా?

చెన్న : (బెరుకుగా సోమయాజులు, భాస్కర్‌ల వంక చూచి) అయ్యా యనుకోండి...సీట్లు రిజర్వుచేయించాను......ఇంటి దగ్గర చెప్పి వచ్చాను...పోతే—

ప్రిన్సి : మరి టైలర్ ఏమన్నాడు?......ఏమైనా యిస్తానన్నాడా?

చెన్న : (ఢిక్కచచ్చి) సాయంకాలానికి ఒకటైనా యిస్తానన్నాడు.

ప్రిన్సి : అఘోరించలేకపోయాడు......అర్జంటుగా కావాలని చెప్పలేక పోయారా?

చెన్న : చెప్పానండి...

ప్రిన్సి : సరే!...(మూర్తి వస్తాడు) ఓ! పెందలాడే వచ్చారే!...

(మూర్తి సమాధానంకోసం ఏదో నసుగుతాడు)

సరే! మీరు వెళ్లి పని చూచుకోండి.

(మూర్తి ప్రక్కగదిలోకి వెళ్ళి పోతాడు)

సోమయాజులుగారూ! బజారుకువెళ్లి—

సోమ : క్షమించండి...ఇంటి దగ్గర కొంచెం పని ఉంది...సాయంకాలం పెందలాడే వస్తాను

ప్రిన్సి : సరే! మీ యిష్టం......ఇక మీకు తప్పదు మిస్టర్ చెన్నకేశవులూ—బజారుదాకా వెళ్లి హోటలుకు డిన్నర్ ఆర్డర్ యిచ్చిరావాలి.

చెన్న : అలాగేనండీ, దానికేం?

సోమ : మరి నేను వస్తానండి.

(ప్రిన్సిపాలు సంజ్ఞతోనే ఆయన వెళ్లిడానికి సమ్మతిని సూచిస్తాడు)

(చెన్నకేశవులుకూడా నమస్కరించి వెళ్లిపోతాడు)

భాస్క : నన్ను ఎందుకు రమ్మన్నారో యింకా చెప్పలేదు.

ప్రిన్సి : ఓ! ఐ యామ్ వెరీసారీ!...మిస్టర్ భాస్కర్ ఒకపని చెయ్యాండి...రాత్రి డిన్నరయిన తరువాత నాతోపాటు మా యింటికి వస్తే—

భాస్క : క్షమించండి...రాత్రికి డిన్నరుకు కూడా రాలేననుకుంటాను...ఇదివరకే ఒ ఎంగేజిమెంటు వున్నది.

ప్రిన్సి : ఎన్నిపను లుంటే మాత్రం మంత్రిగారికి అందరం కలిసి యిస్తున్న డిన్నర్‌ను మానుతారా?...మానినా డిన్నర్ ఖరీదు మాత్రం అందరూ భరించాలనుకొంటాను.

భాస్క : డాక్టర్!...వెధవ మూడు రూపాయలకోసం వెరిచి డిన్నర్‌కి నేను రావటం లేదని మీరనుకుంటే పొరపాటు పడ్డారన్నమాట!

ప్రిన్సి : అబ్బే! అలా అనుకున్నానని కాదు...కాని యింత అవసరమైనదిది.

భాస్క : మంత్రిగారికి డిన్నర్ యివ్వడంకంటె ప్రపంచంలో ముఖ్యమయిన విషయాలు వుండకూడదని మీ అభిప్రాయమా?

ప్రిన్సి : అలా అని నేనెందుకంటాను...పోనీ, డిన్నరుకు రాకపోయినా, మాయింటికి—

భాస్క : క్షమించండి...ఇవ్వాళ మాత్రం రాలేను.

ప్రిన్సి : చాలా అవసరమైనపని అయివుంటుంది...మీరు డిన్నర్‌కు రానక్కరలేదు...కాని యీ పనిమాత్రం చెయ్యండి...

భాస్క : క్షమించండి... ఈరాత్రికి రాలేనన్నాను కదా?

ప్రిన్సి : మీరు రావాలి...ఇది చాలా అవసరమైన పననుకుంటాను.

భాస్క : అయ్యా! అది కాలేజీపని అయితేయివ్వండి. కాలేజీలో వున్నప్పుడు చేసి యిస్తాను...మీస్వంత వ్యవహారాలు చూచిపెట్టమని యిక నన్ను వత్తిడిచెయ్యకండి.

ప్రిన్సి : భాస్కర్! మీరు ఏం మాట్లాడుతున్నారో తెలిసే మాట్లాడుతున్నారా?

భాస్క: అంత తెలియకుండా మాట్లాడడానికి నేనేం గొప్పవాడిని కాలేదే!

ప్రిన్సి : భాస్కర్! ఆరునెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారట!...మీస్నేహం రోజురోజుకూ చెడ్డవాళ్లను కోరుతున్నది. మీమంచి కోరుతున్నాను కనుక—

భాస్క: నాకు ఇన్నేళ్లు వచ్చాక కూడా ఎవరు మంచివారో, ఎవరుకాదో మీరు చెప్పాలా?

ప్రిన్సి : అంటే, నేనుచెప్పినపని చెయ్యనంటారు?

భాస్క: ఇప్పుడు కాదన్నాను...అంతే!

ప్రిన్సి : నాకు యిప్పుడే కావాలి.

భాస్క: దానికి సమాధానం ముందే యిచ్చాను.

ప్రిన్సి : భాస్కర్! అనవసరంగా కష్టాల్ని కొని తెచ్చుకోకండి.

భాస్క: డాక్టర్! అటువంటి కష్టాలకు నేను జడవను. ఆ కష్టాలు పెట్టదలచుకున్నవారిని అసలు లెక్కచెయ్యను.

ప్రిన్సి : ఎవరితో మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా?

భాస్క: ఇంకా అంత అంధుడిని కాలేదు డాక్టర్!... అంతస్థులు ఎంత పెరిగినా దాని పునాదులు నేలమీదనే వుంటాయని మీరు గమనించడం మంచిది.

ప్రిన్సి : ఏమిటి! నాకు నీతులు బోధిస్తున్నావా? మిస్టర్ భాస్కర్!...ఇంతవరకు కుర్రవాడవని వూరుకున్నాను.

భాస్క: కుర్రవాడినని జాలికాదు డాక్టర్!...మీ పనులన్నీ చేస్తున్నాను కనుక వూరుకున్నారు. లేకుంటే మీరు చెయ్యగలిగింది ఏముంది? వుద్యోగం తీసేస్తారు. అంతేనా?

ప్రిన్సి : నాక్రింద పనిచేస్తూ—నన్నే యిలా మాట్లాడుతావా?

భాస్క: ఆగ్రహించకండి...మీరు ప్రిన్సిపాలుగారు, అధికారులు అయితే మీకు గొప్ప, మిమ్మల్ని చూచి భయపడేవారికి గొప్ప...ఇన్నాళ్లూ ఎంత గుడ్డిగా వున్నానో యీనాడు నాకు తెలిసింది. నా ప్రక్కన ఎన్ని మురికిగుంటలు వున్నాయో, ఎన్ని కత్తుల బావులువున్నాయో యీరోజు తెలుసుకున్నాను...ఎంత గొప్పవారైనా కొంచెం అణకువ, గౌరవం యిచ్చి తీసుకోవడం, ఎదటివాడిని మానవుడిగా చూడడం అవసరం డాక్టర్......

ప్రిన్సి : ఇక మాట్లాడకు...తక్షణం వెళ్ళు...నువ్వు యిక కాలేజీకి రానక్కరలేదు.

భాస్క: నిజం చెప్పినంతమాత్రానికే మీరు యిలా చేస్తారని నాకు తెలుసు...అందువల్ల నేను ముందే ఆ నిశ్చయానికి వచ్చాను...ఇదిగో నా రాజీనామా పత్రం—స్వీకరించండి... మీరు చెప్పినదల్లా చేస్తూ, మీరు అనేవన్నీ పడడానికి నేను మీ బానిసనుకాదు...... తోటిమనిషిని ఎలా గౌరవించాలో తెలియకపోతే యికనైనా నేర్చుకోండి.

దేవ : (ఇందాకా నే వచ్చి, నిర్ఘాంతపోయి) భాస్కర్ గారూ!...ఏమిటండీ ఇది!

భాస్క: తెలుసుకున్న సత్యానికి ప్రతిఫలం దేవసహాయంగారూ! ఇన్నిన్ని ఘోరాలు, తెరవెనుక యిన్ని నాటకాలు జరుగుతున్నాయని మొదటిసారి యివ్వాళే తెలిసింది...తెలిసిన తరువాతకూడా యీ నాటకంలో నేను పాత్రను కాదలుచుకోలేదు.

ప్రిన్సి : షటప్...నోటికి వచ్చినట్లల్లా మాట్లాడకు...తలుచుకుంటే నిన్నేమయినా చెయ్యగలను.

భాస్క: (నవ్వి) అయ్యా!...తమరు పెద్దలు...అదే మాట మిమ్మల్ని అని మీకు అగౌరవాన్ని ఆపాదించను...ఏమాట అనవచ్చో, ఏమాట అనకూడదో నాకు తెలుసు...ఇకనుంచైనా మీరు ఆడుతున్న రెండు పాత్రలను ఒక పాత్రగా కరిగించండి...ద్విపాత్రాభినయం మీ తత్వానికి పడదు...మీరు చెయ్యకలిగింది చెయ్యండి...నోట్లో అక్కరముక్క వున్నాక బ్రతకలేకపోను...వస్తాను...ఇంత పరమసత్యాన్ని తెలియచేసినందుకు మీకు చాలా కృతజ్ఞుణ్ణి.

ప్రిన్సి : గెట్ అవుట్......

భాస్క : థాంక్స్...కోపం మనిషిని ఎంత నీచానికైనా దిగజారుస్తుంది...ఇంత కోపాన్ని కలిగించినందుకు క్షమించండి...వస్తాను...

(అని వెళ్లిపోతాడు.)

ప్రిన్సి ఈ ఫూల్......వీడా!......వీడు నన్ను ఇంతగా అవమానపరుస్తాడా! చూస్తాను... (అంటూ త్వరగా లోపలకుపోతాడు. బంగారు వస్తాడు. లోపలచూచి ఎవ్వరూ లేకపోవడంతో ప్రక్క గదిలోకి వస్తాడు. భాస్కర్ వెళ్ళిపోతోతూ వుంటాడు.)

బంగా : ఏం జరిగింది బాబూ?

భాస్క : ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను బంగారూ!

బంగా : అదేం బాబూ?

భాస్క : అన్నీ తెలిసినతరువాతకూడా యిక్కడ వుండి పని చెయ్యలేను (ఓ అయిదు రూపాయలు తీసియిచ్చి) వస్తాను బంగారూ! అవసరం అయితే యింటికిరా!

బంగా : కనిపెట్టివుండాలి బాబూ!...ఏదో వీదోడిని—

(భాస్కర్ నవ్వి, అతని బుజంతట్టి వెళ్ళిపోతాడు...ప్రిన్సిపాలు వస్తాడు.)

ప్రిన్సి : బంగారూ ... బంగారూ ... ఎక్కడ చచ్చావ్!

బంగా : (భాస్కర్ వెళ్ళిన దిక్కుకే చూస్తున్నవాడు యీలోకానికి వచ్చి) వచ్చానుసార్ ...

ప్రిన్సి : వెళ్ళి కాఫీ పట్టుకురా—

బంగా : అట్లాగే బాబూ!—

ప్రిన్సి : (ఓ క్షణం ఆగి) మూర్తిగారూ! మూర్తిగారూ!

(మూర్తి వస్తాడు. ప్రిన్సిపాలుగారు కొంచెం శ్రమచేసి మామూలు మనిషై, అతిప్రయత్నం మీద నవ్వు ముఖంమీదకు ఆహ్వానిస్తాడు.)

ప్రిన్సి : రేపు సన్మానసభలో మాట్లాడవలసిన వుపన్యాసం చెబుతాను. వ్రాసుకోండి.

మూర్తి : వస్తున్నానండి...(మూర్తి కాగితం కలం తెచ్చుకోవడానికి లోపలకు వెళతాడు. ఈ లోగా బంగారు కాఫీ తెస్తాడు. త్రాగుతూ, మూర్తికి చెబుతాడు. ఆయన వ్రాసుకుంటూ వుంటాడు.)

ప్రిన్సి : సోదర సోదరీమణులారా!
ఈ రోజు నాకు యింత గొప్పగా సన్మానం చేసినందుకు ఇందుకు కారణమైన ప్రతి ఒక్కరికీ నా కృతజ్ఞత. ఈ సన్మానం నా వ్యక్తికికాక, కొంచెమో గొప్పో సేవ విద్యాలయాలకు, విద్యాభివృద్ధికి చేసిన శ్రమకే ననుకొంటాను.

నా యీ ముప్ఫయ్యేళ్ళఅనుభవంలో— నేను గమనించింది ఒక్కటే సత్యం... మానవ పురోగమనానికి, అభ్యుదయానికి ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఎన్ని అవాంతరాలు వచ్చినా ఆగకుండా సాగిపోతే ఎప్పటికైనా మనం మన పర్పస్...పర్పస్—

మూర్తి : వుద్దేశ్యాలను—

ప్రిన్సి : ఆc! వుద్దేశ్యాలను నెరవేర్చుకోగలం— వ్యక్తులకోసం కాదీసంఘం...సమిష్టి జీవితానికి ఏ ఒక్క వ్యక్తి అడ్డంవచ్చినా, ఆ వ్యక్తిని దారికి అడ్డం తొలిగించాలి...ఆ పురుగును ఏరి వెయ్యాలి...అప్పుడే మనకు విజయం తథ్యం...ఆ సత్యాన్ని గమనించిననాడు మానవుడు నాగరికతలో మరొక అడుగు ముందుకు వేశాడన్నమాట—

(అని చెబుతూవుండగా-తెర)

# కాళిదాస కవిత

## చారిత్రిక విమర్శ విమర్శనము

### ఆంగ్ల మూలం : శ్రీ అరవిందులు

గత సంచిక తరువాయి

భారతీయ నాగరకత, మహోజ్జ్వలస్థాయి నందిన యొకానొక యుగమునకు కాళిదాసు ప్రాతినిధ్యము వహించును. అతని కావ్యములు బహుముఖము లగు తద్యుగ లక్షణములను ప్రతిబింబించును. వాల్మీకి వ్యాసుల రచనలలోగూడ వారివారి యుగలక్షణము లింత సమగ్రముగఁ బ్రతిబింబింపవు.

కాళిదాసు మాళవదేశీయుఁడని యూహింప నగును. కాని యాతఁ డుజ్జయినీ నగరమున మాత్రము పుట్టలేదని చెప్పవచ్చును. మేఘసందేశమునందు వర్ణింపఁబడిన యే గ్రామమునందో యాతఁడావిర్భవించి యుండును. అనంతరమాతఁడు, రాజధానీ నగరమునఁ జేరి, క్రీస్తు పూర్వము ప్రథమ శతాబ్ద మధ్య కాలమున, మాలవీయులకు శకకర్తగా కీర్తిఁగాంచిన శ్రీ విక్రమాదిత్య మహారాజపోషణ మనుభవించుచు, కావ్యసృష్టిఁగావించి యుండును. అతని యధ్యయన సంపత్తిని గూర్చియు, కులగోత్రములను గూర్చియు, శీల స్వభావమును గూర్చియు నాతని కావ్యములనుండి కొన్ని విషయములను సేకరింపనగును. కాని చారిత్రి కాధారము లేవియు లభింపవు. ఈతనినిగూర్చి యాధార రహితమైన గాథ లనేకములు వ్యాప్తిలో కలవు. అవి చాలవఱకు నసహ్యములుగను, వికృతములుగను నుండును. అందుచే వీని కంతగా విలువనొసఁగ నక్కఱ లేదు. వాల్మీకి, వ్యాస, కాళిదాసాదుల మహిమాన్విత నామధేయములు మనకు సంప్రాప్తములు. ఈ నామములకంటెను వీరి కావ్యసృష్టి మహిమోజ్జ్వలమైనది. అవి భారతీయ సాంస్కృతికసంపదకు కాణాచులు.

కాళిదా సెవరు? అతని కవిత్వస్వభావమునకు భిన్నమైన యాతనివ్యక్తిత్వమెట్టిది? ఈతని నాదరించి పోషించిన రాజేంద్రుఁడెట్టివాఁడు? కాళిదాసు మిత్రు లెవరు? వీరితో నాతఁడెట్లు మెలఁగెడివాఁడు? ఈతని ప్రత్యర్థు లెవరు? వారితో నీతనిప్రవర్తన మెట్లుండెడిది? ఈతఁడు మద్యమును, మదవతిని సేవించెడివాఁడా? ఎట్టి ప్రత్యేక వాతావరణమునం దీతఁడు తన రచనా కలాపమును నిర్వర్తించెడి వాఁడు? ఏ యే వ్యక్తుల ప్రభావ మీతనిపై ప్రసరించెను? ఈమున్నగు ననేక ప్రశ్నలు సహజోత్కంఠగల ప్రతిమానవునకును నుద్బుద్ధము లగును. కాని వీనికి స్పష్టమగు సమాధానములు లేవు. ఇది యత్యంత విచిత్రమగుపరిస్థితి. ఒకరీతి గాజూచినచో ఈ ప్రశ్నలకు సమాధానము లభింపకుండుటయు నదృష్టమే యనుకొందును.

చారిత్రిక విమర్శనపద్ధతి చాల నాకర్షణీయమైనది. దానివలన కొన్ని ప్రత్యేక ప్రయోజనములు కలవు. అంతర్దృష్టి, సారస్వత వివేచనము లోపించిన కవుల రచనలలోని యనేకాంశములను, తెలివితేటలతో సుస్పష్టముగ తెలిసికొనుట కీపద్ధతి యుపయోగించును. మానవుని మానసము పనిచేయు పద్ధతులను గూర్చిన పరిజ్ఞానమీవిధానముచే నభివృద్ధియగును. అంతేకాని సవిమర్శక కవితావగాహనమునకు మాత్ర మిది సాహాయ్యపడదు. కవియొక్కయు, నాతని

అనువాదం : శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తము

కావ్యములయొక్కయు ప్రాపంచిక ధర్మములను గ్రహించుటకే విమర్శన ముపకరించును. కాని కావ్య ప్రభావగౌరవముల నవగాహనము గావించుకొనుపట్ల నిది యవరోధకర మనక తప్పదు.

చారిత్రిక పద్ధతి నభిమానించువారు గుఱ్ఱము ముందు బండిని నిల్పి, యీ రెండింటి మధ్యలో తాముండి, బండిని తోలుటకు సాహసింతురు. కానియది నిష్ప్రయోజనకర మేకాదు; ప్రమాదకరముగూడను. వారు తమ యవధానమును కవిత్వముపై లయింపఁజేయక, కవిపైన లక్ష్య మొనర్తురు. ఒక కావ్యమును ముందు మనము మథించి, దాని కవితా వైశిష్ట్యము నవగాహనము గావించుకొని, యనంతరము, బాహ్య ప్రకృతి తోడను, కావ్యలక్షణములతోడను, దానికిఁగల సంబంధమును, ఆంతరంగిక సాక్ష్యములను బురస్కరించుకొని కవి ఆత్మీయతను నిర్ణయించుకొనవలయును. ప్రతి సహృదయ పాఠకుఁడు సహజముగ నిట్లే గావించును. ఇట్లు నిర్ణయించుకొనఁబడిన కవి యాత్మీయతయే మన కత్యంతోపయోగము.

"షేక్స్పియరు" న కాతని సమకాలీనులతోఁ గల సంబంధమును వ్యక్తీకరించు వ్రాఁతలు, చరిత్ర కెక్కువ తోడ్పడునుగాని కవితా ప్రశంస కుపయుక్తములుకావు. మానవశీల పరిశీలనమునకు, మానసవికాస గ్రహణమునకు నీ రచనలు సాయపడును. కాని షేక్స్పియర్ వ్రాసిన గేయములనుగాని, రూపకములనుగాని బఠించునపుడీ వ్రాఁతలతో నేమిపని? అంతేకాదు. ఇట్టి భౌతికాధారములుపఠితకును, కావ్యగతకవీశ్వరాత్మీయతకును మధ్య నవరోధము కల్పించును. ఏలయన బాహ్య చర్యలు మానవుని భౌతిక మానసిక రీతులనే స్పష్టపఱచును. గాని రచన లాతని యంతర్బుద్ధిని, తార్కిక శక్తిని గుర్తింపఁజేయును. నిజమున కివియే మానవ నిజ స్వరూపము. ఇవి పరిగ్రహణ, పరిగణన పటుత్వము కలవి. 'విలియం హెర్బర్టు' లేక 'హెన్రీరిత్స్లే' కొఱకో, లేక తనకొఱకో షేక్స్పియర్ తన గేయములను రచించియుండవచ్చునను విషయమును, షేక్స్పియర్ ప్రేమించినది షేరీ ఫిట్టనునామెనో లేక మరియొక యువతినో! లేక యసలే ప్రేమింపలేదో! యను విషయమును, అతని భాష యతిశయోక్తులతో గూడినదో లేక యుద్రిక్తమైనదో! యను నకేక విషయములు బుసుపోకకును, ఆత్మాధిక్యము కొఱకును నుపయోగించు నేమోకాని, కవిత్వావగాహనమునకు మాత్రము నిష్ప్రయోజనములు. షేక్స్పియరు తాను పద్యములు వ్రాయఁబూనినపుడు సంప్రదాయోచితము, నాలంకారికము నగు భాష వ్రాసెను వాఁడను విషయము చారిత్రక సత్యమైన కావచ్చును. కాని యంతమాత్రముచే, మన కాతనిని గూర్చి కల్గు వికాస మేమియును లేదు. అది కేవల భౌతిక, మానసిక సంబంధవిషయమే. హైందవు లీ స్థితిని 'అన్నమయకోశము' 'మనోమయకోశము' నందురు.

షేక్స్పియర్ బుద్ధియు, నాతని యంతరాత్మయు నాతని సజీవరచనాముఖముననే ద్యోతకమౌను. సజీవరచన కాతని జయాజయములు, నుదాత్త ప్రేమ సద్భావములు, మానసిక ప్రేరణలు కారణములౌను. కావుననే యాతని రచనలు ప్రపంచము మన్ననల నందుకొన్నవి. మానవుఁడు సహజముగ నిట్టి భావోద్రేక జీవి. ఆ యుద్రేకము గతి జీవితానుభవసంకలితము కావచ్చును. ఇట్టి యీ యుద్రేకశక్తియే కవితావ్యక్తిత్వము నేర్పఱుచునది. కాని, చారిత్రిక విషయములను, పఠితకును నీ కవితావ్యక్తిత్వమునకును మధ్య నిలువనిచ్చినచో, కావ్యానుభూతియు, నానందోత్సాహములు, తాదాత్మ్యస్థితియు నందుకొనవలయు నను నంతరాత్మ కాఘాతము కల్గును. భౌతిక విషయగవేషణుఁడు దన సహృదయ శక్తిని వ్యర్థపరచు నా పాఠకునిపట్ల కొంత సానుభూతి గూడ గల్గును. ఈ రీతిగా షేక్స్పియర్ ఆత్మీయతయు, నాతని కవిత్వానందమును బఠిత కనుభవనీయముకాక వ్యర్థమైపోవును. చారిత్రిక విమర్శనములోని ప్రధాన దోషమిది. ఈ విమర్శన పద్ధతిని బురస్కరించుకొనియే "జాన్సన్" పండితుని రచనలలోఁ బ్రతిబింబించు నాతని యాత్మీయతకన్న, "బాస్వెల్" క్రోడీకరించిన యాతని దైనందిన సంభాషణలు మన మన్ననలకుఁ బాత్రములగుచున్నవి. "బైరన్" లేఖలు గూడ నాతని కవిత్వముతో సమాన ప్రాతినిధ్యము వహించినవి. దైనందిన చర్యలయందు సామాన్య మానవ మనః ప్రవృత్తులే కానవచ్చును. మహాకవులు కారయిత్రీ శక్తి ప్రభావ విలసితులు. అది వారి యంతరంగమునుండి స్వచ్ఛందముగాఁ జెల్లుబుకును. సహృదయ పాఠకునకు దాని సమగ్ర స్వరూప మా మహాకవుల కావ్యములయందు సాక్షాత్కరించును. వారి నిత్యకృత్యములయందు తల్లే

తీము మాత్రమే గోచరించును. ఈ తారతమ్యము నను సరించియే ప్రసిద్ధేతిహాస పాత్రలకంటెను, రూపక పాత్రలు మనకు సుపరిచితములుగా నుండును. కాళిదాసు కేవల మహాకావ్యకర్తకాక, యుత్కృష్ట నాటక కవీశ్వరుఁడు. అతని "కుమార సంభవ" మహాకావ్య మందలి శివపార్వతు లక్షరరమ్యముగఁ దీర్చిదిద్దఁబడిన చిత్రములవలె ప్రత్యక్షమూదురు. కాని శకుంతలా దుష్యంతులు, ఊర్వశీపురూరవులు, మాళవికాగ్ని మిత్రులు, అనసూయాప్రియంవదలు, చిత్రలేఖ, ధరణి, ఇరావతి మున్నగువారు సజీవపాత్రలై మన పరిచయ సౌభాగ్యమునందిన ప్రియమిత్రుల భాతి ప్రవర్తిల్లుదురు. ఆత్మావిష్కారకమగు భావను బట్టియు, తులనాత్మకమగు నుచితానుచిత ప్రవర్తనను బట్టియు, శ్రవ్యదృశ్య కావ్యముల కీవిభేద ముప్పతిల్లును.

రూపకసృష్టితో సరితూగగల మహేతిహాసములు రామాయణ మహాభారతములే. ఇందలి కథాశిల్ప మాధునిక నవలను బోలినది. ఐరోపియనులు భావించు నితిహాస కవిత్వముకంటె నిందలి కవిత్వము భిన్నమైనది. నాటకీయపద్ధతు లిందిమిడియున్నవి. అందుచేతనే యిందలి యనేక సూక్ష్మవివరణములు, తుణికోద్రేక పరులగు నైరోపియనులకు విసువుపుట్టించును. పాశ్చాత్యేతిహాసములు తత్కాల సాంఘిక ప్రవృత్తుల ప్రభావ మునకు లోగినవి. ఈ రీతిగా పరిసరప్రభావ పరిగణనము విమర్శనవిధానమునందును నతిశయింపఁబడెను. సాంఘికచరిత్ర, సారస్వత చరిత్రవలె ప్రాముఖ్యము వందుకొనెను. కాని చరిత్ర, విమర్శనము కానేరదు. సారస్వత చరిత్రలో నెంతి నిశిత పాండిత్యము గలవానికైనను, విమర్శనా దక్షత లేకపోవచ్చును. అధునిక కాలమున సారస్వత చరిత్రకారుల సంఖ్య హెచ్చు పెరిగినది. ఇది మహాప్రమాదము. వీరు విపరీత భార వాహకులు. వీరి కొక్కొక్కరి కొక్కొక్క సిద్ధాంతము, ఒక్కొక్క దృక్పథము నుండును. కాని వీర లత్యద్భుత భావయిత్రీ తేజఃపుంజముతో నలరారు విమర్శక వరేణ్యులు మాత్రము కాకపోవుట శోచనీయము. తమతమ కాలములకు ప్రాతినిధ్యము వహించు ననేకకవుల విషయము కూడ నిట్లేయున్నది. తమకాలములకు ప్రాతినిధ్యము వహింపలేని మఱి కొందఱు కవులవిషయమున సాంఘిక పరిస్థితుల ప్రభావము సన్నగిలినది. హోమర్, షేక్స్పియర్, కాళిదాసుల సాంఘిక జీవితములు, వారివారి కవితోపాసన కుపకరించువఱకు మాత్రమే మనకవసరము. వారి సాంఘిక ప్రవృత్తులు వారి కావ్యముల నుండియే విశేషముగ గ్రహింపనగును. అంతేకాని తత్కాల చరిత్రాంశములు పఠిత మానసమును సంచలన మొనరించి, కావ్యరస చర్వణమునందు తప్పుడు త్రోవలు దీయును. అట్లని చారిత్రిక విషయములవలన ప్రయోజనమే లేదని భావింపరాదు. అవి కేవల సామాన్యాంశములు. తత్త్వ ప్రతిపాదకములు కావు. చారిత్రిక పద్ధతి కావ్యమును గూర్చి కాక, కవిని గూర్చియు, నాతని భౌతిక జీవిత సంబంధమును కావ్యమునుగూర్చియుఁ దెల్పును. అందువలననే యిది నిష్ప్రయోజనకరమగు పద్ధతి. ఇందు విమర్శకునిదృష్టి యప్రధానవిషయములయందు సమాహితమూను. ఇందు ప్రధానవిషయము లప్రధానములౌను. అప్రధానవిషయములు ప్రధానము లౌను. ధిషణాధురంధరులైనవారి కీ సాంఘిక విజ్ఞానము కావ్యరస చర్వణమునం దవరోధము కాకపోవచ్చును. కాని సామాన్య మేధావుల కీయవరోధ మనివార్యమే కాదు: అపకారకారకముకూడను. ఈపద్ధతి కవిత్వమునుండి కవినికాక కవినుండికవిత్వగ్రహణమునకు బంధించును. కవిత్వమూలమున కవి యాత్మీయతను స్మరించుటే యుత్తమమార్గము. సాంఘికప్రవృత్తు లన్నియు కవిపై ప్రభావమును జూపఁజాలవు, కవి మనః ప్రవృత్తులను సర్వతోముఖముగఁ బ్రతిబింబింపజేయువ దాతని కావ్యదర్పణము.

బాల్యదశయందు 'షేక్స్పియర్'పై 'మార్లో' 'కిడ్' అనువారల ప్రభావ మెక్కువయని యాంగ్ల సారస్వత చరిత్ర తెల్పుచున్నది. ప్రథమ, ద్వితీయ శ్రేణికిఁ జెందిన కవీశ్వరులుకూడ, సాధారణముగా, వారి వారి బాల్యదశలయందు, తక్కువ జాతికిఁజెందిన కావ్యప్రభావములకు లోనాదురని స్థూలముగా జెప్పవచ్చును. కాని యంతమాత్రమున ప్రమాదము వాటిల్లదు. వారి మానసములు పరుసవేదుల వంటివి. అవి హీనకావ్యములనే కాదు, మఱి యెట్టి వస్తువులనైన నపరంజిగా మార్పగలవు. అల్పమేధావులైన ఛందకవులు మాత్రమే విపరీతముగ స్వోపజ్ఞకుఁ బ్రయత్నింతురు. సారస్వత చరిత్ర మన సత్త్వశాస్త్రము మానవమేధా సంజనిత శాస్త్రములుగా నేఁడు మిక్కిలి యభివృద్ధిగాంచినవి. ఇవి స్వోపజ్ఞ కెక్కువ గౌరవము నిచ్చుచున్నవి. కాని

విమర్శనము వలన దీనివలనగల్గు ప్రయోజనము విశేషముగానుండదు. "మార్లో" 'కిడ్' అనువారలు మనకును షేక్స్పియర్‌కును మధ్య నిల్చి షేక్స్పియర్ కావ్య పఠన సమయమున మన హృదయములపైఁ బహుభావ ముద్రలను మసగ రొనర్తురు. కావున మన కర్తవ్యమే మన, కవికిని, మనకును మధ్య నిల్చిన యావ్యక్తుల ఛాయలను బరిహరించి, కవితో ముఖాముఖిని నిల్చి, యద్వైతానందము ననుభవింప యత్నింప వలయును.

చారిత్రిక విమర్శనము తడబాటు కల్గించును. దోషభూయిష్టమగు మానసికముద్రలు వేయును. సారస్వత ప్రత్యయమును నశింపఁ జేయును, పఠితలను నీరసభావోపేతులను గావించును. సూక్ష్మ పరిశీలనా విరహితమైన చరిత్ర పఠనమువలన నేర్పడిన కతిపయ పూర్వాభిప్రాయముల ననుసరించి "ఎలిజబత్" యుగము వైభవోపేతమైనదనియు, నుత్తమ గుణ రత్నముల కాకరమైనదనియు నేమేమో భావించి, తత్కాల సారస్వత పఠనమునకుఁ గడచిన, నాదినుండి యంతిమువరకును నా పఠనము ప్రశంసాత్మకముగనే పరిసమాప్తమగును. అదియునుగాక తఱచుగా కొందఱి పఠనము, విధ్యుక్త ధర్మముగ కొనసాగును. తమ పఠనమున కాధిక్యత గల్గించుట కొఱకును లేనిపోని ప్రశంసలు గావింతురు. మఱికొందఱు, తాము రేయింబవళ్ళు కష్టించి సముపార్జించిన యీ విజ్ఞానముపట్ల తప్పనిసరిగా సానుభూతి ప్రదర్శింతురు. లేనిచో వారి పరిశ్రమము వ్యర్థమైనట్లు చింతింపవలసి యుండును. మానవశీలమును, సంపూర్తిగా గ్రహింపవలయునన్న కొంత సానుభూతియు, నభిమానమును గావలయును. విద్వేషము, హ్రస్వదృష్టిని కల్గించును. దురభిమాన మంధభూతులను గావించును. కావున అసత్య విమర్శనము ప్రజా వివేకమును వక్రమార్గమున నడిపించును. సారస్వత సంబంధమగు విలువలను దారుమారొనర్చును. వర్తమాన సారస్వతముపై నేవగింపు గల్గించును. సరియైన భావుకుడీ విమర్శలకు లొంగడు. సత్యము చెప్పవలయునన్న, చారిత్రిక విమర్శన పద్ధతి పూర్తి భావనాస్వాతంత్ర్యములేని యల్ప శ్రేణికిఁ జెందిన కవులపట్ల మాత్రమే యుపకరించును. తమ కావ్యములకన్న నీకవుల జీవితవిశేషములే, పఠితల కాసక్తి గల్గించును. కాని యిప్పట్లను నసంఖ్యాకులగు సామాన్యకవులను గూర్చిన పొగడ్తలు ప్రతిమించినవి; ఇవి పరిశోధనలను పెద్దనామముతో నాధునిక కాలమున చెలామణియగుచున్న యాధునిక విమర్శనములు. సూక్ష్మముగాఁ బరిశీలించిన, ఈ విమర్శన విధానముచే, రమ్య కవితారామములోనికి శాస్త్రము తన వ్యత్యస్త పాదములతో నడుగుపెట్టినది. ఇట్లనుట శాస్త్రము నగౌరవించుటకాదు, భూతము కూడ నొక పెద్దమనిషియేయని షేక్స్పియరంతటి వాఁడు గౌరవ మొసఁగెను. భూతము కేవలము పెద్దమనిషియేకాదు. అంతకన్నను నధికమైనది; యత్యంత ప్రయోజనకారియు, ననివార్యమునైనది. అట్లే శాస్త్రముకూడ, బహుముఖ మానసికవ్యాపార వృత్తమునకుఁ జెందిన యొక బృహచ్ఛాఖ. రాక్షసునకు స్వర్గమందు స్థానములేనట్లే, శాస్త్రమునకుఁ గూడ నీకవితోద్యానమున నడుగిడుపనిలేదు. విషయ సేకరణముగావించి, సాధారణీకరించుట శాస్త్ర విధి. దాని దృష్టిలో సర్వము సమానము. దైవసదృశుఁడగు మానవుఁడైనను, మత్కుణమైనను, విత్తనమైనను, విరియైనను దానిదృష్టిలో నొక్కటియే.

విమర్శనమునం దిట్టి పద్ధతి ప్రవేశించుటచే విషయసాంద్రతయెక్కువైనది. సారస్వత రంగమున ప్రధాన వ్యక్తులకు ప్రాధాన్యమేర్పడును. ఆ వ్యక్తుల ప్రాధాన్యచరిత్రసంబంధియైన కావచ్చును. సారస్వత దృష్టితోఁ జూచిన, వారు చైతన్యరహితులే. కాని యీ పద్ధతివలన వీరే సారస్వతేయులుగాఁ బరిగణింపఁబడు దురదృష్టముగూడ వాటిల్లును. శాస్త్రీయమైన చరిత్ర, యేరీతిగా వ్యక్తిప్రాధాన్యమును రూపణచి, యుద్యమ ప్రాముఖ్యము నుద్ధరించినదో, యట్లే యీ విమర్శన విధానమును కావ్య విశిష్టతను పర్యుదాస మొనర్చి, కవి సాంఘికప్రవృత్తులకే పట్టము గట్టుచున్నది. అందుచేతనే యాధునిక కవులు, విశ్వజనీనభావముల నాదరించుటకు మారుగా, వాస్తవిక విషయములను, ప్రాంతీయ తాత్కాలిక నైతిక పతనములను, స్వకీయ మనఃప్రవృత్తులను, వైచిత్ర్యములను గావ్యవస్తువులు గావించుకొనుచున్నారు. ఇట్టి యల్పాల్ప విషయములు కావ్య వస్తువులుగా స్వీకరింపఁబడుట క్షీణయుగ లక్షణము. ఇది భావ దారిద్ర్యయుగమగును. తనకుఁబూర్తిగా బోధపడని విషయభారముతో నీ యుగ మాడంబరత్వమునకు, పాండిత్య ప్రకర్షకు గురియగుచున్నది. కవితా సృష్టి కలాపమునకు సామర్థ్యము చేకూర్చు శక్తులతో నీ యుగ మనుబంధమును ద్రెంచుకొనుచున్నది. ఇట్లు క్రమక్రమముగా నీయుగము మనఃపూర్తిగా నిజ పతనమున కొడిగట్టుకొనుచు, సారరహిత స్థాయికి దిగజారినది. ఏతత్కారణముచేతనే 'కాలిమాకస్', 'అపోలోనియస్', 'రోడ్సు', 'సిమొనైడ్సు' లు అపర 'హోమర్లు'గా పరిగణింపబడిన యుగమునకును, 'టెనిసన్' అపర 'షేక్స్పియరు' గను 'కిప్లింగ్' అపర 'మిల్టన్'గను బరిగణింపఁబడి గౌరవభాజను లగుచున్న యుగములకును నశుభదాయకమగు సామ్యములు సరిపడుచున్నవి. ఇంతకన్న పతన మింకేమి యుండును? కావున సారస్వతమున చారిత్రిక విమర్శ బహుళ ప్రమాదభూయిష్టము. ఇది పరిహరణీయము.

# కీ ల క ము

## శ్రీ సూరంపూడి భాస్కరరావు

ఏపి వెన్నెలలోన విరిసేవు! మురిసేవు!
దక్షిణానిలములో తక్కేవు తారేవు!
ఏటికే మైమరచి యాటలాడేవు?
ఎవరికొఱకే నీకు ఇట్టి యాగడము?

రా కుసుమసుందరీ! రమ్ము నాయెడకు
నీరహస్యము నీకు నే చెప్పగలను
విశ్వసత్యమ్ము నే విడదీయగలను.

తొలివసంతమునాటి తొగరు చివురులు మెసవి,
లేమావిగున్నలో మోమోట పడిదాగి,
ఏటికే మైమరచి పాటబాడేవు?
ఎవరి కొఱకే నీకు ఇంత గానమ్ము?

రా గండు కోయిలా! రమ్ము నాయెడకు
నీరహస్యము నీకు నేచెప్పగలను
విశ్వసత్యమ్ము నే విడదీయగలను.

చెలిమికత్తెల చీరచెరగునీడల నిలిచి
చిరునగవు తొలకరిని సిగ్గుమొగిళులదాచి
ఏటికే మైమరచి మాటలాడేవు?
ఎవరికొఱకే నీకు ఇన్ని పోకడలు?

రా! భావనిర్ఝరీ! రమ్ము నాయెడకు
నీరహస్యము నీకు నే చెప్పగలను
విశ్వసత్యము నేను విడదీయగలను!

# 18 వ శతాబ్దంలో తెల్లనవాబులు

శ్రీ వాసిరెడ్డి పార్థసారధి

పదునెనిమిదవ శతాబ్ద ప్రవేశమప్పటికి, భారత భూమంతా నివురుకప్పిన నిప్పువలెనున్నది. ఔరంగజేబుపాదుషా రాజ్యాన్ని చాలా విస్తరించాడు. దక్షిణమున కొంతరాజ్యమును కలుపుకున్నాడు. మహారాష్ట్రులను కొండలలోనికి తరిమాడు. రజపుత్రులను మాట్లాడకుండా చేశాడు. బైటికి దేశము సుస్థిరంగా ఉన్నట్లు కనిపించింది. రోహిణికార్తె సూర్యుని వేడి వల్ల భూమి బీటలువారినట్లు దేశమంతా ఉన్నది. అక్బరు పాదుషా రాజ్యమంతా, హిందూ మహమ్మదీయుల స్నేహమనే పునాదులమీద కట్టబడ్డది. ఔరంగజేబు జిజియాపన్ను వేశాడు. హిందూమతాన్ని వత్తిడి చేయటం ప్రారంభించాడు. ఈ వేడిచే దేశమంతా కుతకుతలాడిపోతున్నది. ఔరంగజేబు చనిపోయిన తర్వాత, అంతశక్తివంతుడు రాజ్యానికిరాలేదు. అందుచే గాలిదుమారమునకు బలంలేని మానులన్నీ విరిగిపడిపోయినట్లు పడిపోతున్న సమయ మాపదునెనిమిదవశతాబ్దము.

ఈశతాబ్దములో ఆంగ్లేయులు రెండుదశలనుభవించారు. ప్రథమార్థములో వారు నావికులుగాను, వ్యాపారులుగానే ఉన్నారు. ఇప్పటికింకా వారికి రాజ్యాహంకారము తలకెక్కలేదు. ద్వితీయార్థములో వారు వ్యాపారులు, రాజ్యస్థాపకులుగా ఉన్నారు.

ప్రథమార్థములో వారు నాలుగుపట్టణములలో ఉంటుండేవారు. సూరతు, బొంబాయి, మద్రాసు, కలకత్తా. సూరత్తు మహమ్మదీయుల క్రింద వున్నది. కనుక ఆంగ్లేయులు ఇక్కడ అస్వతంత్రులుగానే వున్నారు. వీరు ఇక్కడ చర్చి కట్టుకున్నారు. కాని మహమ్మదీయులకు కోపం వస్తుందోమోనని, వారిమతచిహ్నములను, బొమ్మలనుకూడా అందులోపెట్టలేదు. వీరు మహమ్మదీయులతో కలిసిమెలసి వుంటుండేవారు. బొంబాయి చాలాకాలము వృద్ధికిరానేరాలేదు. దీనికి అనేక కారణాలున్నవి. పైన సూరతురేవు వున్నది. క్రింద పోర్చుగీసుల రేవు లున్నవి. పక్కన మహారాష్ట్రుల భయంవున్నది. వీటికన్నిటికితోడు, అది అనారోగ్యస్థలమైనది. నేల మహాచెమ్మగావుండేది. చుట్టూచేపలకంపు వుండేది. అందువల్ల బొంబైలో ప్రవేశించినతోడే రోగగ్రస్తులైయేవారు. ఇందువల్లే అప్పుడు బొంబైకి ఆంగ్లేయుల శ్మశానవాటికని పేరుండేది. మద్రాసు అప్పుడు అభివృద్ధిలోకి వస్తూన్నది. ప్రతివారు మద్రాసు చేరకోరుకునేవారు. మొఘలుల, మహారాష్ట్రుల తాకిడి భయంవుండేది, కాని, పిట్ అనే గవర్నరుక్రింద మద్రాసు చాలావృద్ధిలోకి వచ్చింది. అప్పటికే మద్రాసు చూడటానికి ముచ్చటగా వుండేది. దివ్యమైన, కంటికింపైనభవంతు లుండేవి. వాటిచుట్టూ పెద్దకాంపౌండు గోడలుండేవి. లోపల ఉద్యానవనముండేవి. వీటిమధ్య భవంతులు అందంగా తొంగిచూస్తుండేవి. ఇవి అనేకరకాలుగా వుండేవి. బజార్లు దీర్ఘముగా, వెడల్పుగావుండేవి. పక్కలందు నడచుటకు రాతితో పేర్చబడ్డ బాటలు వుండేవి. బండ్లు పోవుటకు, మధ్యన ఇసుకరోడ్డు వుండేది. రోడ్లపక్కలందు వున్నతములైన వృక్షములుండేవి. వేసవిలో ఇవి పాంథునికంటికి ఆనందమును, వంటికి చల్లదనము ఇచ్చేవి. అయిదుగేట్లుండేవి. (1) సముద్రము, (2) సెంటుథామస్ కు, (3) నీటికి, (4) సత్రమునకు,

# 18 వ శతాబ్దంలో తెల్ల నవాబులు

ముఖ్యగేట్లువుండేవి. సత్రంగేటు, సెంట్ థామస్ గేటు రాత్రులందుకూడా తెరువబడివుండేవి. అనుమానంలేని ప్రయాణీకుని ఎప్పుడైనా పోనిచ్చేవారు. తిరిమ్మాళ్ల మూడుగేట్లలో సాయంత్రము ఆరు గంటలు దాటినతర్వాత పోనిచ్చేవారు కాదు. టౌన్ హాలు, సెంటుమేరీ దర్చి, కాలేజీ నూతన గృహము, ఆసుపత్రి, ఫోర్టులోని గవర్నరు నివేశములు పబ్లికు బిల్డింగులు. ఇక్కడివారు ఇంగ్లండులోవలె సంపూర్ణంగా ఆరోగ్యవంతులై వున్నారు. వేసవి కొంత కష్టంగా వుండవచ్చు. అప్పుడు చన్నీటి స్నానము, తడిగుడ్డలూ కొంత వుపశమనం ఇచ్చేవి. వాకిండ్లకు వట్టివేరు తడికలు కట్టుకుని, నీరు కొట్టేవారు. చుట్టూ గొప్పవృక్షములు చల్లదనాన్ని ఇచ్చేవి. ఈ వేడి వుపశమనమునకు పండ్లు వుండేవి. ఇదంతా మధ్యాహ్నము, నాలుగు గంటలుండేది. తర్వాత సముద్రపు చల్లగాలి కొట్టేది. ఇక్కడ నిమ్మ, ద్రాక్ష పెరిగేవి. పట్నము మూడు భాగాలుగా వుండేది. ఆంగ్లేయులకు ఫోర్టు. దక్షిణాన పడవవాళ్ళకు మాక్కువాటౌన్. దేశీయ వర్తకులుండేది బ్లాకుటౌన్.

ఆంగ్లేయులు కలకత్తాలో 1690 లో ప్రవేశించారు. ఆంగ్లేయులూ, ముఘలుల ప్రజలమీద ఎన్నో దోపిడీలు ఖూనీలు చేశారు. ముఘలులు వీటన్నిటిని క్షమించి, హుగ్లీనదిమీద పట్నం కట్టకొనుటకు అనుమతి నిచ్చారు. స్థలము అనారోగ్యమైనదైనా, దివ్యమైన నీడనిచ్చే చెట్లున్నందున ఇక్కడవారు పట్నమును కట్టుకున్నారు. ఆ కాలంలో, ఈశాన్యవాయువులు వచ్చినప్పుడు చేపల కంపు కొట్టేది. పట్నమంతా ఒక పద్ధతిలో కట్టబడలేదు. వారి వారి వీలునుపట్టి ఇళ్లు కట్టుకున్నారు. చుట్టూ పెద్దతోటలను ఏర్పరచుకున్నారు. ఆంగ్లేయులు నది పక్కన ఇళ్ళు కట్టుకున్నారు. దేశీయులు లోభాగంలో కట్టుకున్నారు. విలియంఫోర్టుకు యాభయిగజాల దూరంలో చర్చి కట్టారు. వ్యాపారుల దానధర్మగులతో ఈ చర్చిని కట్టారు. సూరత్ లోవలెగాక, ఇక్కడ రోమన్ కాతలిక్కులు, వారి చర్చిలలో ఏసు, మరియా విగ్రహాలను పెట్టుకునేవారు. ఫోర్టులో గవర్నరు ఇల్లు వున్నది. ఇది చాలా అందమైనఇల్లు. ఫోర్టులో వుద్యోగులకు కూడా ఇళ్లున్నవి. కంపెనీ గోడౌనులూ ఇక్కడే వున్నవి. ఆయుధాగారమూ ఇక్కడే వున్నది. గవర్నరుగారికి చేపలకై ఇక్కడ చెరువులో చేపలను పెంచెదరు. ఆసుపత్రి వున్నది. కాని ఆపరేషన్ చేయించుకొనిపోయిన రోగి, తిరిగిరావటం చాలా అరుదు!

సాహైటే పెద్ద గవర్నరు. ఇతనిని ప్రెసిడెంటు కూడా అని అంటారు. పదునెనిమిదవ ప్రథమార్ధంలో ఇతని పని వ్యాపార లాభం చూచుకొనుట, అల్లరులు లేకుండా కనిపెట్టి వుండుట, పెద్దలతో వ్యవహరించుట. ఇతనికి సహాయంగా కౌన్సిలుండేది. వీరంతా, సీనియరు వర్తకులు. ఈ పదవులన్నీ సీనియార్టీనిపట్టి వస్తవి. ప్రతి సీనియర్ వర్తకుడు గవర్నరు కావలెనని ప్రయత్నించేవాడు. బయటి నుండి గవర్నరును నియమించుట బహుసకృతు. గవర్నరు పిట్ వంటివారిని మాత్రం ఎప్పుడో అత్యవసరములందు నియమించేవారు. కౌన్సిలు మెజార్టీనిబట్టి, తీర్మానములు చేసేవారు. గవర్నరుకు ప్రత్యేకమైన అధికారములు లేవు. ఒక్క క్యాస్టింగు ఓటు వుండేది. కౌన్సిలు తీర్మానమే శాసనము. సివిల్ క్రిమినల్ అధికారమంతా ఈ కౌన్సిలుదే. 1726 వరకు వురిశిక్ష అధికారం లేదు. తర్వాత ఈ అధికారం కూడా వచ్చింది. వీరు కంపెనీ వ్యాపారమును చేస్తూండేవారు. వీరు స్వంత వ్యాపారం కూడా చేసుకుంటుండేవారు. వీరిలో ఎక్కువ తక్కువలు అపరిమితంగా వుండేవి. డిన్నర్లలోగాని, చర్చిలలోగాని ఎవరు ఎక్కడ కూర్చోవాలో అని ఎప్పుడూ తగూగా వుండేది.

పట్టణ వ్యవహారములను చూచుటకు 12 మంది ఆల్డరుమన్ లుండేవారు. వీరంతా నామినేషన్వల్ల ఏర్పరచబడుతారు. వీరంతా కలసి మేయరును ఎన్నుకుంటారు. మేయరు ఎన్నిక ప్రతి సంవత్సరం వుంటుంది. లండన్ మేయర్ల, కౌన్సిలర్ల ఆచార వ్యవహారములనే వీరు ఆచరించేవారు. వారివలెనే అలంకరణలు చేసేవారు. ఊరేగింపులు వారివలెనే చేసేవారు. వీరికి సివిల్ క్రిమినల్ అధికారములుండేవి. వీరి తీర్పుపైన, గవర్నరు కౌన్సిలుకు అప్పీలు చేసికోవచ్చు. వీరుకూడా తగూలాడుకుంటుండేవారు.

ఈ కౌన్సిలర్ల తర్వాత, సీనియర్ వర్తకులు, జూనియరు వర్తకులు వుంటారు. వీరితర్వాత పురోహితులు, సర్జన్లు వస్తారు. నేను ఎక్కువంటే నేను ఎక్కువ అనీ, ఈ పురోహితులు, సర్జనులలో తగూ

వుంటుండేది. పురోహితుని పై కుర్చీమీద, సర్జను భార్య కూర్చున్నదని గొప్ప దుమారం రేగింది. స్థానములకు గొప్ప పోటీ వుండేది. తరగతి కక్షలు, మతకుల కక్షలను మించేవి.

ఆంగ్లేయులువచ్చింది వ్యాపారమునకు. ఇక్కడ స్థిరపడ్డ తర్వాత, వీరి అవసరాలకోలది అనేక రకాల ప్రజ చేరింది. చావులకు పెండ్లిండ్లకు పురోహితులు కావలసివచ్చారు. రోగం సెప్పలు మాన్పను వైద్యులు కావలసివచ్చారు. సహచర్యమునకు స్త్రీలు కావలసి వచ్చారు. మొదట ఆంగ్ల స్త్రీలు చాలా తక్కువ. అందువల్ల ఏ ఆర్మీనియనో, పోర్చుగీసో, లేక ఏ దేశీయ క్రిస్టియను స్త్రీనో పెళ్ళాడేవారు. బలం చేకూరిన తర్వాత ఆంగ్ల స్త్రీలు ప్రవేశించారు. మొదటిలో వీరూ జనానా ఆచరించారు.

శతాబ్దారంభములో భగవద్భక్తి గల పురోహితులే వచ్చారు. వారికి మంచిగౌరవం కూడా వుండేది. గవర్నరు తర్వాత గౌరవనీయులు వీరే. హెబర నే బిషప్ కలకత్తా వచ్చినప్పుడు, అక్కడి బ్రాహ్మణులలో గొప్ప అలజడి కలిగింది. చివరకు క్రిస్టియనులలోని మహాత్ముడొకడు కనిపించాడని అనుకున్నారు. వీరిని చూచివచ్చుటకు ఒకర్ని పంపారు. ఈ వెళ్ళిన వానికి, అక్కడ గొప్ప భవంతులు, గుఱ్ఱబ్బగ్గీలు, అనేక మంది సేవకులు, అట్టహాసం కనిపించింది. ఇతను బైటికి వచ్చి చూచినదానిని చెప్పాడు. వీరంతా కలసి అక్కడ మహనీయుడు లేడని, హిందూమతము అపాయంలో వున్నదని అభిప్రాయపడ్డారట. మొదటిలో, ఈ క్రిస్టియన్ మతకర్తలందరికి గోవా స్థానంగా వుండేది. రోమన్ కాథలిక్ లే ఎక్కువగా వుండేవారు. జసూట్లు ఎక్కువ ప్రచారంచేశారు. వారి నాయకుడు రాబర్టు డినోబిలి. ఇతనిని తెల్లబ్రాహ్మణుడనేవారు. ఇతను సంస్కృతం చదివాడు. అచ్చం బ్రాహ్మణుని వలె వ్యవహరించి, మాట్లాడేవాడు. 1698 సంవత్సరములో ఒక శాసనం చేయబడ్డది. ప్రతి 500 టన్నుల ఓడలో ఒక పురోహితుడుండాలి. డైరెక్టరు దీని బాధనుండి తప్పించుకొనుటకు 499 టన్నుల ఓడలనే పంపేవాడు. కాని డైరెక్టర్లు వారి సేవకుల ఆధ్యాత్మిక, నైతిక విషయములందు ఎక్కువ శ్రద్ధ చూపేవారు. ఇందుకై బైబిలు పంపి, అది చదువునట్లు చేస్తుండేవారు. వీరు తేనిషు పురోహితులనే ఎక్కువగా ఏర్పరచుకునేవారు. వీరికి ఖర్చు తక్కువ. ప్రథమంలో పురోహితునికి సంవత్సరమున కొక వందపౌనుల నిచ్చేవారు. దీనికి తోడు వీరికి భత్యం ఖర్చుల నిచ్చేవారు. పల్లకీ కూడా ఇచ్చేవారు. వీరు దారివెంట వెళ్ళేటప్పుడు ఒకరు వీరికి ఛత్రముకూడా పట్టుకునేవారు. వీరంతా రోజుకు రెండు సార్లు ప్రార్థనలు జరపాలి. ఆదివారములందు రెండు సార్లు బోధచేయాలి. చావులకు పెళ్ళిళ్ళకు వెళ్ళి ఆ తంతులు నడపాలి. వీరిలో కొందరు, నిర్దయులు కూడా వున్నారు. రెవరెండు, జె. బ్రౌన్, అతని సేవకుని కొట్టగా, ఇరవై అడుగులయెత్తు మేడనుండి, దెబ్బలను తప్పించుకొనుటకు క్రిందపడ్డాడు. ప్రారంభములో క్రిస్టియన్ పాదిరీలు, హిందూ కులాచారములను అవలంబించారు. బ్రాహ్మణులను మతంలోనికి చేర్చుకొనుటకు వున్న చర్చీలలో, అంత్య కులస్థులను చేర్చుకునే వారు కాదు. వారికి వేరు చర్చి, వీరికి వేరు చర్చీలుండేవి. బాప్టిసం తంతు 30, 40 రోజులు జరిపేవారు. గురుశిష్యులుగా జరిపేవారు. బంగారపు జందెమును కూడా వేసేవారు. ఇందులో మూడు పోచ లుండేవి. ఈ మూడు త్రిమూర్తిత్వాన్ని తెలుపుతవి. ఇవిగాక ఇంకా రెండు వెండిపోగులు కూడా వేసేవారు. ఇవి రెండు క్రీస్తుప్రభుని దైవ మానవ ప్రకృతులను తెలుపుతవి. మతం పుచ్చుకున్నవారు ముఖాన బొట్టుపెట్టుకోవచ్చు. ఆడంగులు ఆభరణములను, తాళిబొట్టు ఉంచుకోవచ్చు. తాళిబొట్టులో ఒకవైపున సిలువగుర్తు ఉంటుంది. క్రిస్టియన్ దేవుళ్లను రథాలమీద కూర్చోబెట్టి వూరేగించేవారు. తప్పెట్లుతాళాలతో, హిందూ ఉత్సవాలతో పోటీ చేసేవారు. కొంతకాలంతర్వాత ప్రొటెస్టంటు మిషన్ వచ్చింది. అప్పుడు పద్ధతులు మార్చుకున్నారు.

సర్జన్ల పనంత బాగుండేది కాదు. గౌరవము తక్కువే. రాబడీ తక్కువే. కొన్నిసార్లు ఉద్యోగం వదిలిపోతుండేవారు. వైద్యము కూడా చాలా మోటుగా వుండేది. మత్స్యమాంసములు తినడంవల్ల కలరాలు తగులుతుండేది. ఇందుకు, కాలిమడమ మీద వాతలు పెట్టేవారు. త్రాగుడు ఎక్కువౌటచే, లివరు జబ్బులు వచ్చేవి. ఇందుకు వాంతులు చేయించేవారు. తర్వాత రక్తభస్మం వాడేవారు. చంద్రుని క్షయ వృద్ధులవల్ల, సముద్రము ఆటుపోటులవల్ల రోగాలకు కూడా హెచ్చు తక్కువ లుండేవని నమ్మేవారు.

పాముకాటుకు తాయత్తులను కట్టుకునేవారు. వాటిని బంగారపు రేకులో ఉంచి, మెడలో వేళ్ళాడకట్టుకునేవారు.

మద్రాసు దుబాషువలె, కలకత్తాలో బనియాలుండేవారు. బనియాలు బెంగాలీ హిందువులు. సామాన్యంగా బ్రాహ్మణులే. ఆంగ్లేయులకు వీరియందు భయభక్తులుండేవి. వ్యవహారములన్నీ, ముఖ్యంగా డబ్బుఅంతా వీరి చేతులలో వుండేది. నూతనంగా వచ్చిన ఆంగ్లేయుడు అప్పులకై వీరిని ఆశ్రయించాలి. బనియాలు జీతం తీసుకోరు. ప్రతిదానిలో కమీషన్ తీసుకుంటారు. రూపాయికి అర్ధణా వీరికివ్వవలసిందే. సేవకులంతా వీరి చేతులలోనే ఉంటారు. వ్యాపారం వీరి చేతులలో వుంటుంది. ఆంగ్లేయుల స్వంతభాష వీరు మాట్లాడగలరు. వీరి వసతి, మాట బహు ప్రియంగా యుక్తిగా యుక్తంగా ఉండేవి. బనియాల తర్వాత గుమాస్తాలుంటారు. వీరిని దరోగా అనికూడా అంటారు. ఇతడు పనుల అజమాయిషీ చేస్తూంటాడు. ఇతను తీసుకునేది కమీషనే. ఇంటి నౌకర్లలో పల్లకీ బోయీలుండేవారు. వీరి నాయకుడు జమేదారు. ఇతను పల్లకీ వెంట వుంటాడు. అధికార్ల రహస్యాలన్నీ ఇతనికి చెప్పుతుంటారు. ఇతను నమ్మదగ్గ వృద్ధసేవకుడై వుంటాడు. వీరితో చోపుదారు ఉంటాడు. ఇతని చేతిలో వెండిబెత్తము వుంటుంది. రాజదండము కూడా ఇతడే పట్టుకుంటాడు. వంటకు ఒకడుంటాడు. భోజనాల సమయాలలో పక్కనుండుటకొకడుంటాడు. ఇతనిని కిట్ మగారంటారు. హుక్కా ఏర్పాటుకు హుక్కా బర్దారను ఒక జీతగాడుకూడా ఉంటాడు. ఇంకా నీళ్లు తెచ్చేవాడు, తోటమాలి, కావలివాడు, చాకలి, మంగలివాళ్లు వుంటారు. తెలివిగల బనియాలు చిన్న పనికికూడా ఒక సేవకుని నియమించి డబ్బు ఖర్చు పెట్టేస్తూండేవారు.

ఆంగ్లేయుల అనుగ్రహం సంపాదించుటకు ఖర్చుపెట్టేవారు దేశీయులు. ఖరీదైన విందులు చేసేవారు. అప్పుడు మేడరియా వైన్ ఎక్కువ ప్రఖ్యాతి. విందులలో దీనిని వాడేవారు. విందులు కుడిచిన తర్వాత భోగం మేళాలను ఏర్పరచేవారు. ప్రతి ఆంగ్లేయుడు ఈ నృత్యమును చూచి ఆనందిస్తూండేవాడు. అందులో వీరు హిందువుల వలె తమలపాకులను కూడా నమిలేవారు. ఈ సత్కారము చేసేవారు నవాబులైతే అనేక వినోదాలు ఏర్పాటుచేసేవారు. ఏనుగుల పోట్లాటలను, పెద్దపులి దున్నపోతు పోట్లాటలను, ఏనుగ చిరుతపులి పోట్లాటలను, రెండు ఒంటెల పోట్లాటలను ఏర్పాటుచేసేవారు. వీటికితోడు వేటలనుకూడా ఏర్పరచేవారు. భోగమువాళ్ళతో ఊరేగింపులు చేసేవారు. ఆ కాలపు ఆంగ్లేయులు దేశీయులతో కలిసి మెలిసి వుండేవారు. వారి పద్ధతులు కొన్ని వీరు నేర్చుకున్నారు. వసులు చౌక్కాలు హిందువుల వద్ద నేర్చుకున్నవే. హిందువులతో కలిసివుండుటచే పర్షియా భాష బాగా నేర్చుకున్నారు. అందులో కొన్ని గ్రంథాలు కూడా చదివేవారు. దీనికితోడు సంస్కృత భాషకూడా నేర్చుకున్నారు. హిందూ .మతగ్రంథములను కూడా చదివారు. రాజ్యాహంకారము తలకెక్కిన తర్వాత, దేశీయులు తక్కువ తామెక్కువ అనే అభిప్రాయం బలిసింది. దీనితో ఆంగ్లేయులు దేశీయులకు దూరమైపోయినారు. ఈ శతాబ్దమున్లా పల్లకీలు వాడేవారు. చిన్న ప్రయాణానికి, పెద్ద ప్రయాణానికి వీటినే వాడేవారు. ఇంగ్లండునుండి వచ్చిన ప్రతివాడు ఒక పల్లకీని కొని వుంచుకునేవాడు. దీ:లో దిండ్లను ఉంచేవారు. రోడ్లు బాగుపడ్డ తర్వాత వీటి వాడకం తగ్గింది. తరవాత బండ్లు వుపయోగించేవారు. మొదట ఎడ్లబండ్లనే వాడేవారు. వీటిని బాగా తోలితే, గంటకు ఎనిమిది మైళ్లు పోయేవి. శ్రమ తీర్చుకొనుటకు కొంతసేపు నిలపెట్టవలసి వచ్చేది. గుర్రాలను హిందూ శ్రీమంతులు వాడేవారు. వేగానికివి శ్రేష్ఠముగా నుండేవి.

హుక్కా ఆంగ్లేయులందరూ వాడేవారు. ఇది పర్షియాదేశంనుండి వచ్చింది. సూరత్‌లో దీనిని నార్గిల్స అనేవారు. కలకత్తాలో పల్లకీలో పెట్టుటకు వీలుగా వుండే చిన్న హుక్కా వుండేది. దీనిని గూగీరీ అంటారు. ఈ శతాబ్ద మస్యలో, ఇది అందరికీ అలవాటైంది. స్త్రీలుకూడా హుక్కా త్రాగేవారు. డిన్నర్లలో హుక్కా లిచ్చేవారు. అతిథులు హుక్కా బర్దారును కూడా తీసికువెళ్ళాలి. హుక్కా తాడును తగిలించుట, నిప్పుచేయుట పొగాకు వగైరాలు వేయుట మొదలైన పనులు ఇతను చేస్తుంటాడు. తాగే హుక్కాను పక్క స్త్రీలకు ఇచ్చుటొక మర్యాదైనది. తాగేవారు కొయ్యనాళము తీసి ఇస్తారు. ఆ మహిళ వేరే నాళికను దానికి తగిలించుకుని, హుక్కా పీలుస్తుంది.

ఈ శతాబ్దపు అంతంలో హుక్కా తగ్గుముఖం పట్టింది. ఈ ఖర్చు భరించలేని ఆంగ్లేయులు సిగర్లు త్రాగుట ప్రారంభించారు. ఇది గౌరవానికి తక్కువ. కాని తప్పక త్రాగారు. కాలక్రమేణ ఈ సిగర్లలో మత్తు ద్రవ్యాన్ని కలిపివాడారు. అప్పటినుండి హుక్కా చాలా ఖర్చుని తగ్గించడం ప్రారంభించి, పెద్దలు కూడా సిగర్లు త్రాగారు.

ఆ నాడు ఆంగ్లేయుల జీవితము బహు జల్సాగా వుండేది. అందుకు, బెంగాలు నివాసియైన ఆంగ్లోఇండియన్ దినచర్య ఒక ఉదాహరణ.

ఉదయము 7 గంటలకు దర్వాను ఇంటితలుపు తెరుస్తాడు. జమేదారు 8 గంటలకు దొరగారి పడకగదిలో ప్రవేశిస్తాడు. అప్పుడు ఒక యువతి దొరగారిని వదిలి వెళ్ళుతుంది. దొరగారు కాళ్ళక్రింద పెట్టేటప్పటికి, సేవకులు వంగివంగి సలాములు చేస్తారు. ఒక అరగంటలో దొరగారి వంటిమీదవున్న రాత్రిదుస్తులు వూడదీస్తారు. వాటి స్థానములో, పగటి దుస్తులు అలంకరిస్తారు. ఒక శిలా విగ్రహంవలె అతను కూర్చుంటాడు. కాళ్లకు బూట్సులు తొడుగుతారు. తర్వాత మంగలి వచ్చి క్షురకర్మ చేస్తాడు. గోళ్ళు కత్తిరిస్తాడు. చెవులు శుభ్రం చేస్తాడు. ఒకడు ముఖంమీద చేతులమీద నీరుపోసి కడుగుతాడు. తుండుగుడ్డతో తుడుస్తాడు. తర్వాత ఆ దొర వేస్టుకోటుతో ఉదయపు ఆహారమునకు బల్లవద్ద కూర్చుంటాడు. ఒక రొట్టెను ఇచ్చి టీ పోస్తాడు సేవకుడు. వీటిని సేవిస్తుండగా, తలదువ్వే అతనువచ్చి, అతని పనిలో నిమగ్నుడౌతాడు. హుక్కా బర్దారు వచ్చి హుక్కా గొట్టం అందిస్తాడు. దొరగారు ఈలోగా రొట్టె కొరుకుతూ, టీ చప్పరిస్తూ హుక్కా పీలుస్తూ వుంటాడు, అప్పుడు బనియా గాని ఇంకా ఇతరులుగాని వస్తారు. పెద్దలైతే కుర్చీ చూపుతారు. లేక పోతే నిలబడి మాట్లాడుతారు. ఈ తంతు 10 గంటలకు ముగుస్తుంది. జమేదారు వచ్చి పల్లకీవద్దకు తీసుకు వెళ్ళుతాడు. పల్లకీ ఎక్కిన తర్వాత, చోపుదార్లు, గుమాస్తాలు, సేవకులు పెద్దహంగామాతో, బైలుదేరుతారు. దొరగారు మాట్లాడవలసినవారి ఇంటికి వెళ్లి మాట్లాడుతారు. మిత్రుల ఇళ్లయందు మధ్యాన్నము 2 గంటలకు భోజనపుబల్ల దగ్గర కూర్చుంటారు. హుక్కా బర్దార్లు హుక్కా తెస్తారు. స్నేహితులతోను ప్రియురాళ్లతోను కులాసాగా భోజనం ముగుస్తుంది. మళ్ళీ రాత్రి భోజనాలకు వచ్చే ఏర్పాటుతో పల్లకీ ఎక్కుతాడు. 4 గంటలకు ఇంటికి వచ్చి దుస్తులను తొలగించి వేరే దుస్తులను వేసుకుని పడకగది చేరుతాడు. 7 గంటవరకు, పండుకుని నిద్రపోతాడు. 7 గంటలకు లేవటంతోనే, పైదుస్తులను మార్చి, వేరేదుస్తులను తొడుగుతారు. అప్పుడు బల్లపక్క కూర్చుంటాడు టీఇస్తారు. టీ సేవిస్తూండగా తలదువ్వే నౌకరువచ్చి అతని పని నెరవేరుస్తాడు. మంచికోటును ధరించి, ప్రియురాళ్ళను దర్శించుటకు వెడతాడు. తిరిగి 10 గంటలకు అంతా ఒకచోట చేరుతారు. అప్పుడు తింటూ. తాగుతూ, కబుర్లుచెప్పుకుంటూ నడిజాముదాటేదాకా కాలక్షేపంచేస్తాడు. రాత్రి 1 గంటకు తన ఇంటికి చేరి, పడకగదిలో ప్రవేశిస్తాడు, రాత్రల్లా అతనిని సంతోషపెట్టుటకు ఒకయువతి అక్కడ వుంటుంది మళ్లీ ఉదయము 7 గంటలకు లేస్తాడు. ఈవిధంగా కంపెనీవారి లాభాలను అనుభవిస్తుంటారు నవాబులవలె వీరు!

ఈ ఆంగ్లేయులు, భారతభూమిలోని అన్ని పట్టణాలలోను, పైజీవితవిధానమునే అనుసరిస్తుంటారు. భారతీయుల సొమ్ము అనేకవిధాల, కొల్లలుగా ఆర్జించారు. కష్టంలేకుండా వచ్చినధనాన్ని, ఈవిధంగా కులాసాగా అనుభవించారు. ఇందువల్లనే ఆంగ్లేయులకు పదునెనిమిదవశతాబ్దములో నబాబులని పేరుండేది. భారతభూమినుండి, ఆంగ్లదేశమునకు, సంచులనిండా ధనమును తీసుకువెళ్లి, అక్కడా ఇట్లే జీవించేవారు. గొప్పభవంతులను కొని, అందులో మహారాజభోగాలు అనుభవిస్తుండేవారు. ఆంగ్లదేశంలో కూడా వీరిని నబాబులనే పిలిచేవారు. వీరు సంచులు విప్పి పార్లమెంటుసభ్యత్వంకూడా సంపాదించేవారు.

క్లాడ్ మార్టిక్ వంటివారి జీవితమును చూచిన యోధుల ఆనాటి సంపాదన, జీవితసుఖాలు, కులాసాలు తెలుస్తాయి.

క్లాడ్ మార్టిన్ 1735 లో లైంస్ నగరంలో పుట్టాడు. ఇతను 1752 లో పుదుచ్చేరి వచ్చాడు. 1761 లో ఈపట్నం ఆంగ్లేయులచేతిలో పడ్డది. 1761 లో అప్పుడు ఇతను ఆంగ్లేయసేనలో చేరాడు. తర్వాత అయోధ్యనవాబు ఆయుధాగారం ఉద్యోగంలో ప్రవేశించాడు. ఇతను కెప్టెన్ జీతంమీద,

# 18 వ శతాబ్దంలో తెల్ల నవాబులు

1795 లో మేజరు జనరలైనాడు. ఇతను 1800 లో చనిపోయినాడు. అప్పటికి ఖర్చుపెట్టినదిపోగా ముప్పయిమూడులక్షల ఆస్తివున్నది. ఇతని సంపాదన అనేకరకాలు. నవాబు ఇతనికి నెలకు 1860 రూపాయలిచ్చేవాడు. జీతంగాక తయూఖాగారంలోనికి కొనేవాటి అన్నిటిమీద, కమీషన్ తీసుకొనేవాడు. నీలిమందు వ్యవసాయంమీద కొంత సంపాదించాడు. నవాబుగారి కోర్టులో పనివున్నవారంతా ఇచ్చే బహుమతులతో కొంతవచ్చేది. భాగ్యవంతులు ఇతనివద్ద కొన్ని వస్తువులు దాచుకునేవారు. వీటిమీద నూటికి 12 వంతున వసూలుచేసేవాడు. జూదముల మూలకంగా కూడా సంపాదించాడంటారు. ఇతను గోమతీనది వడ్డున ఒక గొప్పభవంతి నిర్మించాడు. ఇది బహు విచిత్రమైనది. ఖరీదైనది, విలాసమైనది. వేసవిలో చల్లదనానికి వీలుగావుండేట్లు నిర్మించాడు. నదికి నీరు వచ్చినప్పుడు క్రిందిగదులలో నీరు ప్రవేశించేది. అప్పుడు అందులోనివారు పైగదులలోనికి వెళ్లేవారు. క్రిందిగదులలోని నీరు తీయడంతోనే ఆగదిని బాగు చేయించేవారు. ఇంటి క్రిందుగానే, పడవలు వెళ్ళుతుండేవి. దొరలు, దొరసానులు కూర్చునే రెండు లున్నవి. ఇది అంతా మయసభవలె వుంటుంది. ఇందులో వలభైమంది కూర్చోవచ్చు. గదులనిండా అద్దాలు, చిత్రములతో అద్భుతంగా వుంటుంది. భూమిమీదనుండి ఓగజము ఎత్తుపైన గోడఏమీ కనుపించదు. పదిఅడుగుల పొడవుగల రెండుఅద్దాలున్నవి. ఈ అద్దాలువగైరా వలభైవేల రూపాయిల ఖరీదౌతవి. సాయంత్రములందు నృత్యములుంటవి. నది అవతల బాణాసంచా కాల్చేవారు. ఇవి చూడముచ్చటగా వుండేవి. ఇతనికి నలుగురు యూరోపియన్ ఉంపుడుస్త్రీలుండేవారు. పైగా కొజ్జాలు, బానిసలు వుండేవారు. ఇతను డబ్బు ఎట్లా సంపాదించేవాడో, అట్లే ఖర్చుపెట్టేవాడు. ఇతని డిన్నరుపార్టీలు చాలా పేరుమోగినవి. ఇతను లాటిన్, ప్రెంచి, ఇటలీ, ఇంగ్లీషు, పర్షియా, సంస్కృతి గ్రంథాలు సంపాదించాడు. ఇవి నాలుగు వేలున్నవి. 150 నూనెచిత్రములున్నవి. ఇతను అనేకమంది దిక్కులేని పిల్లలకు సహాయం చేశాడు. తన పేరిట అనేక పాఠశాలలను లక్నో, కలకత్తా, లయన్సులలో నిర్మించాడు.

ఇటువంటి జీవితాలు నాడు చాలావున్నవి. వీరుచేసిన సంపాదనలు కూడా విపరీతమే. ఆర్కాటు నవాబుకు, ఎంతడబ్బు ఇచ్చి, ఎంతకు ప్రోనోట్లు వ్రాయించుకున్నారో యెంతవడ్డీలు గుంజారో ప్రపంచానికి తెలిసిందే.

ఆంగ్లేయులలో అనేకమంది మంచివారూ వున్నారు. కాని, ఈ శతాబ్దపు ఉత్తరార్థమందు, వారికంటికి రాజ్యాహంకారము పట్టింది. దానితో వారు అనేకమైన అమానుష కృత్యాలు చేశారు.

ఇటువంటి రాక్షసులలో విలియం ఆర్చిహంటర్ అనే ఒకాయన వున్నాడు. ఇతను మిర్జాపూరులో వుంటుండేవాడు. ఇతనిమీద 1796 లో ముగ్గురు ఆడపిల్లలను హింసించాడని కేసుపెట్టబడ్డది. గవర్నమెంటు రికార్డులో అతనిమీద నేరము ఈవిధంగా వ్రాయబడి వున్నది. 'ముగ్గురు ఆడపిల్లలతలలు గొరగబడ్డవి, ముక్కులు చెవులు కోయబడ్డవి. ఈపిల్లలలో ఒకామె నాలుక కూడా కోయబడ్డది. వారికాళ్లకు సంకెళ్ళు వేయబడ్డవి. సుఖవ్యాధులు కూడా సంక్రమించినవి. అందులో, ఒకతె నవారీమీద మేజస్ట్రేటు వద్దకు తీసికువచ్చిన తర్వాత చనిపోయినది. వీరందర్నీ హంటరు బలవంతాన మానభంగం చేశాడన్నారు. ఈబాధలు భరించలేక అందులో ఒకామె భావిలో పడవలెనని ప్రయత్నించింది. హంటరు ఈ నేరాలను కాదనక తన బీబీమీదకు నెట్టాడు. గవర్నరు జనరలు ఈ రాక్షసకృత్యము నమ్మలేక కలకత్తాలో పేరవిచారణ చెయించాడు. 1797 జనవరి 10 వ తేదీన ఇది ఋజువు చేయబడ్డది. తర్వాత కోర్టువారు ముద్దాయీలతో రాజీపడుటకు హంటరుకు అనుమతి ఇచ్చారు. ప్రతిపిల్లకు వెయ్యి సిక్కారూపాయీలిప్పించారు. హంటరు బీబీల మీద అయిన ఋజువుకు నామమాత్రపు శిక్షలు విధించారు. హంటరుకు నూరు రూపాయీల జరిమానా మాత్రము వేశారు. బీబీకి ఆరునెలలు జైలుశిక్ష, ఒక రూపాయి జరీమానా వేశారు.

ఈ శతాబ్దఆరంభములో ఇక్కడ వైనులు దొరికేవికావు. కల్లుత్రాగేవారు దొరలు. తర్వాత పర్షియా, మడీరియా వైన్లు వచ్చినవి. కొందరు ఈ సారా దుకాణాలుపెట్టి ఇతరులను త్రాగించి, పరస్త్రీలను తార్చి డబ్బు ఆర్జించేవారు. 1787 లో జాన్‌తామస్ అనే ఆయన ఇట్టిపనులనే చేశేవాడు. ఇతనిని విచారించి వెంటనే ఇంగ్లండు పంపారు. జూదగృహాలు కూడా పెట్టేవారు. మద్రాసులో దొరలు రాత్రులందు

తమ వారికి కనుపించకుండా వెళ్లి త్రాగి, జూదాలాడే వారు. వీరిబాధలను తొలిగించుటకే జూదము నేరమనే శాసనము చేశారు.

హిక్కీ జర్నలు అనే వార్తాపత్రిక పత్రికలలో ప్రథమ పత్రిక. ఇది వున్నది వున్నట్లు వ్రాసేది. అందు వల్ల 1782 లో హేస్టింగ్సు ప్రభువు దీనిని రద్దుచేశాడు.

1746 లో ఫ్రెంచివారు మదరాసును పట్టుకున్నారు., 1756 లో ప్లాసీయుద్ధము వచ్చింది ఈ రెంటితో ఆంగ్లేయుల విధానములు మారినవి. ఇంత వరకూ వ్యాపారమే వారి దృష్టి. ఈ రెండు దెబ్బలతో వారు సేన, బలము, రాజ్య ప్రాబల్యముల మీదకు దృష్టి మరల్చారు. అంతవరకు వారి గుమాస్తాలకు, సేవకులకు ఆయుధాలిచ్చేవారు. మొదటిలో ఈ సేనకు డప్పెట్లు, దేశీయవాద్యా లుండేవి. కొన్ని రోజులైన తర్వాత బ్యాండు వాద్యాలు వచ్చినవి. 1759 లో సేనకు యూనిఫారములనిచ్చారు. వీరికి ఎర్రటి తేలిక చొక్కాల నిచ్చారు. నెత్తికి నీలిరంగు తలపాగా. దీనికి ఒక కుచ్చు వ్రేలాడుతుండేది.

ఆంగ్లో ఇండియన్ అనేది 1769 లో వచ్చింది. వీరిని బెంగాలులో సూపర్వయిజర్లుగా ఏర్పరచారు. 1772 దివానీ అధికారం వచ్చింది. ఈ అధికారంతో వీరికి కలెక్టర్లు అని పేరు పెట్టారు. వీరు మొదటలో స్వంత వ్యాపారం చేసికోవచ్చు నన్నారు. వ్యాపారం తోపాటు రివిన్యూ అధికారాలన్నీ వుండేవి. అందుచే వీరికి ధన సంపాదన, అధికారము కలిసివచ్చేవి. 1787 లో కారన్‌వాలిస్ ప్రభువు స్వంత వ్యాపారం చేసుకునే పని తొలిగించాడు. వీరంతా, దేశీయులతో పనులుండుటచే వారిలో కలిసి మెలిసి తిరుగుతుండేవారు. నవాబు భోగాలు అనుభవించారు. వీరి భోగాలు, భాగ్యాలు అందరు నిరసించే అంతవరకు వెళ్లాయి. 1771 లో ఫూట్, అనే ఆయన 'నవాబు' అని నాటకం వ్రాశాడు. ఈ నాటకము వీరిని తూర్పారపట్టింది.

ఆ కాలములో ఆంగ్లేయులు హిందువులను మూఢనమ్మకాలు నమ్మతారని హేళనచేసేవారు. మహమ్మదీయులను దుర్మార్గులు (Profligates) అనే వారు. భారతీయులు, ఆంగ్లేయులను త్రాగుబోతుల నే వారు.

1760 నుండి ఆంగ్లేయులు ఇక్కడికి రావటం ఎక్కువైంది. వీరితో స్త్రీలుకూడా వచ్చారు. విడదీసి పరిపాలన చేయటమనే సూత్ర మవలంబించి ఈశతాబ్దం అంత్యమందు గొప్ప రాజ్యమును స్థాపించారు. దీనితో పాటు అధికారాంధత వచ్చింది. దేశీయులంతా తక్కువవారు, పాలకులు కనుక తాము ఎక్కువ అనే భావం బలిసింది. దీనితో దేశీయులకు కనుపించుటకూడా లేకుండా పోయింది.



---

* టి. జి. పి. స్పేర్ గారి గ్రంథము, ఇతర ప్రయాణీకుల గ్రంథముల ఆధారంతో వ్రాయబడ్డది.

# సీతాపతి

సంపత్కుమార

★ చరిత కందనట్టి సందుల మణగిన వీరులందు సీతాపతి ఒక వైశ్వానర జిహ్వాక. ఈయనకు 'షితాబుఖాను' అనే బిరుదనామం ఉన్నది. దానితోనే ఎక్కువగా వ్యవహృతుడు. భోగివంశానికి చెందినవాడు. 1504 లో గోలుకొండ 'కుతుబ్‌షా' వంశ స్థాపకుడయిన 'కులీఖుతుబ్‌షా' పిడికిలినుండి తన పరాక్రమంతో ఓరుగల్లు దుర్గాన్ని సాధించిన వాడీయన. కృష్ణానదికి ఇరువైపులా ఉన్న ఓరుగల్లు, గుంటూరు మండలాలను పాలించిన రాజు సీతాపతి. 1512 లో గోలుకొండ నవాబులతో జరిగిన రాజ్యకాంక్ష యుద్ధంలో శత్రువుల కుత్సితానికి ఎర అయి వీరస్వర్గం పొందినాడు. ఈయన పరిపాలనాకాలం చాలా కొద్దిదే అయినా ఆ కొద్ది సమయంలోనే అనేక దానధర్మాలు చేసినాడు. శిథిలమైన పాంచాలేశ్వర (కృష్ణ) మందిరాన్ని పునరుద్ధరించటం, పాకాల చెరువు (వరంగల్లు దగ్గరి సాగరంలాంటిదిది) మరమ్మత్తులు చేయటం ఈయనవల్లనే జరిగినవి. చిత్రభారతాదులలో ఈయనను గూర్చిన ప్రశస్తి విపులంగా ఉన్నది. ఓరుగల్లు కోటలో ఈయన వేయించిన శాసనాన్ని మొదటగా చూచి 'సీతాపతి' అనే వీరుణ్ణి లోకంలో వెల్గించినవారు చిరస్మరణీయులు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు.

ఎవరామూర్తి! మహేంద్రశైల శిఖర హ్రీంకారి రూపమ్ము, శౌ
ర్య విలాసోద్ధత పూర్ణపూరుష మహోహంకార రూపమ్ము, పూ
ర్వ వదాన్యాంధ్ర ధరాతలేశ్వరమహః ప్రౌఢత్వ రూపమ్ము, ది
వ్య విశాలైక శిలాపురీ ప్రథిత సౌభాగ్యస్వరూపమ్మునున్.

సీవేనా! భవదీయ కంఠమున కంఠేకాల ఢక్కాధ్వని
శ్రీ వైశద్యము శౌర్యసీమలను నర్తించున్, భవన్నేత్ర వీ
ధీవైశ్వానర జిహ్వాకాచయము వర్తించున్ బరశ్రేణియం
దో వేలాలిగతాత్మనిశ్చయ! స్వజాత్యుత్థాన! సీతాపతీ!

ఉద్యన్నందక మోహకమ్ము, శివహస్తోత్తాల శూల ప్రహా
సద్యుత్సంగ్రథనమ్ము వైరిదళపక్షచ్ఛేదికౌక్షేయక
మ్ము, ద్యోగాంగ తరంగ రూపిత యశః ప్రోద్ఘాటమున్ బాణిలో
విద్యోతింపగ నిల్చియుండితివి హం వీరా! మహాశ్రీధరా!

ఒకనా డాంధ్ర మహావిసారులగు రాహుత్తుల్ శిరస్సెత్తిగ
ర్వకులై నిల్వగజేయు నోరుగలు దైవద్రోహి హస్తమ్ములన్
దుకతుక్కాడగ జూచి సైపకను మండుం బ్రొద్దువోలెన్ మహో
గ్ర కృపాణమ్మొకడైన తోడుగొని యోర్గల్ శృంఖలల్ ద్రెంచితో.

తత్కృష్ణాద్వితటప్రసారితము - నాంధ్ర శ్రీ ప్రదేశమ్ము, ని
ర్యత్కోలాహలమై, తురుష్కజన దౌష్ట్యప్రగ్రహాబద్ధమై
ధూత్కారింపబడన్ - జ్వలించు నిను సాధుధ్యేయ సంబుద్ధి యు
ష్మత్కౌక్షేయక మెక్కి వచ్చెగద హస్తమ్మందు కాలాహియై.

వారల్ బహ్మనిజాతులొక్కవయిపై వార్ధిజ్వలద్వాడబ
శ్రీరమ్యాకృతి నీవు నొక్కవయిపై చిచ్చుల్ వెలార్చన్ జయ
ప్రారంభంబులు నిన్ను జేరినవి—శౌర్యశ్రీ మహామూర్తి, నాం
ధ్రీరక్షాకృతి, దేశభక్తు నినుకాదే నెవ్వరిన్ జేరెడున్.

గుంపుల్ గుంపులు తెల్గువీరులు మహోగ్రున్ నిన్ను వెన్నంటి, ని
ష్కంపుల్ వైరిదళమ్ములం దరిసి వీక్షా ప్రస్ఫురత్ బాణులై
శంపాకారితఖడ్గముల్ విసరి, విష్వక్ప్రౌఢతల్ సూపి, నై
లింప శ్రీ గొని తెచ్చినారు - ప్రథితాంధ్రీసద్యశః పేటికా!

ఆ రేడేడులెచాలు. నీ మగతనమ్మాచంద్రతారార్కమై
పేరున్ బెంపును నిల్ప - దత్సమయమే పెంపొంది సౌఖ్యాకృతిన్
హేరాళమ్ముగ నృత్యముల్ సలిపెనోయీ! ఓరుగల్ ప్రాంతమం
దో రజ్య న్మహదాంధ్రభూషణపురీవ్యోమాధ్వజైవాతృకా!

పాంచాలేశ్వర మందిరమ్ము శతధా భ్రష్టమ్ముకాన్, దద్గత
ప్రాంచత్ శిల్పములున్ దురుష్కగృహశోభాకారకమ్మౌచు గా
రించన్ నిన్ను, మరిన్ బునా రచన నెంతే శ్రద్ధగావించి-ఉ
చ్చంచత్ పుణ్యసమార్జితావని మహేశా! నిల్పితో సంస్కృతిన్.

## సీతాపతి

రాత్రుల్ రాత్రులు చుట్టుముట్టి పురదుర్గమ్మున్ మహానీచరా
మాత్రుల్ గుత్సితరీతి యుద్ధమున సంప్రాప్తించి నీదాశ - నీ
నేత్రమ్ముల్ గని, హేతినిన్ గనుచు మన్నిల్వాండ్రై వచ్చి ని
ష్పాత్రుల్ దాపదులౌచు శత్రువులు నిన్ బాధించిరిన్, జంపిరిన్.

ఈనా డేకశిలాపురిన్ గనుదు నేనీ - దుష్టతాధూత మాం
ద్రీ నైపుణ్యము గుండెలో పొడుచు, నెంతే నీ పవిత్రస్మృతుల్
నానారీతులు లోచనాంతముల సంధానించెదున్-శోష్ణబా
ష్పానంతత్వము-భోగివంశమణి! శౌర్య శ్రీ జగత్ చిత్ ఘృణీ!

చరితన్ దాగినమూర్తి! ఆంధ్ర భువన స్వారాజ్య నిర్మాత! 'సం
గరపార్థా'! నిను దల్చి తల్చి దురితౌఘమ్ముల్ నివారించు కొం
దుర! వీరస్మరణమ్ము సేయుటలు - నున్నాత్మత్వముల్ జాతిలో
విరజిమ్ముల్లుగ నెంతు - నిర్మితుల భావిశ్రీలు - సీతాపతి!

# విక్రమాదిత్యుని ఆముదాలపాటి తామ్రశాసనము

శ్రీ గడియారం రామకృష్ణ శర్మ

నేనిటీవల ప్రకటించిన 'వినయాదిత్యుని పల్లెపాడు తామ్రశాసనము'ను చదివి ప్రస్తుతము వనపర్తిలో ఉన్న వకీలు శ్రీ నారాయణరెడ్డిగారు తమదగ్గర భద్రపరచబడియున్న ఈ తామ్రశాసనమును నా మిత్రులు శ్రీ దుంపలి రామిరెడ్డిగారిద్వారా పంపిరి. వారికీ శాసనము లభించిన విషయమును గూర్చి వారివల్లనే క్రింది సంగతులు తెలిసినవి :

"శ్రీ నారాయణరెడ్డిగారు అలంపూరు తాలూకా (ఆముదా)అమిదేలపాటిలో పెండ్లిచేసికొన్నారు. వారు సుమారు 20 సంవత్సరముల క్రిందట తమ అత్తవారి కూరుకు పోయిఉండగా అచట ఈ తామ్రశాసనము యొవరి ఇంటనో పడియుండెనట. వీరు అందలి విషయములను తెలిసికొను కుతూహలముతో దానిని తమవెంట తెచ్చుకొనిరట. ఇంతవరకు తమ ఉద్దేశము నెరవేరనందున నిరుత్సాహముతో ఉండి నేను పై శాసనమును ప్రకటించినతరువాత నా దగ్గరకు పంపి అందలి విషయములను తెలుపగోరిరి." ఇంతకంటె యీ శాసనమును గురించిన వివరములు తెలియలేదు. పశ్చిమాంధ్ర చరిత్రకు అందునను అలంపూరు ప్రాంతముల చరిత్రకు మిగుల ముఖ్యమైన ఈ శాసనమును భద్రపరచి అందజేసిన శ్రీ నారాయణరెడ్డిగారికి మిగుల కృతజ్ఞుడను.

ఆకృతి :—సాధారణముగా బాదామి చాళుక్యుల శాసనము లన్నిటివలెనే యిదియూ నున్నది. ఇందు నాలుగు రేకులు వరాహముద్రగల కడియములో గుది గ్రుచ్చబడియున్నవి. రేకులు సమాన పరిమాణములో ఉన్నవి కాని సమమైన తూకమున నుండక కొన్ని దళసరిగను కొన్ని పలుచగను ఉన్నవి. వినయాదిత్యుని శాసనమునకువలె దీనికి అంచుకట్టు తీర్చబడలేదు. ప్రమాణమున నివి విక్రమాదిత్యుని గద్వాల శాసనముకంటె చిన్నవి. కొలతలో ఒక్కొక్క రేకు $7\frac{1}{8}$ అంగుళముల పొడవు $2\frac{1}{4}$ అంగుళముల వెడల్పు ఉన్నవి. మొదటి, నాలుగవ రేకులపై నొక ప్రక్కను రెండవ, మూడవ రేకులపై ఇరువైపులను అక్షరములు చెక్కబడినవి.

లిపి :—మామూలుగా ప్రాచీన చాళుక్యుల కాలపు శాసనములలో కనబడు తెలుగు కన్నడ లిపిలోనే ఇది చెక్కబడినది. ఇతని గద్వాల శాసనమున ఉన్నట్లే అక్షరములు అందముగా ఉండక పెద్దవిగ, అక్కడక్కడ ఎగుడు దిగుడుగ ఉన్నవి. లేఖకుడు 'వ-చ'లకు 'స-య'లకు భేదములేనట్లు చెక్కియున్నాడు. చివరి రేకులో ఉపధ్మానీయమును ≍ప అను దానిని తక్కిన శాసనములవలెనే చిత్రముగ చెక్కినాడు. అక్కడక్కడ కొద్ది తప్పులున్నను మొత్తముమీద ఈ శాసనము ఎక్కువ తప్పులు లేనట్లు జాగ్రత్తగా చెక్కబడినదనవచ్చును. చివరి రేకు రెండవ పంక్తిలో 'సింహ' అనుచోట 'సిజ్హ' అని చెక్కుట విచిత్రము. ఈ శాసనపు చివరి రేకులోని మూడవపంక్తి చివరి మూడక్షరములును, కడపటి పంక్తి చివరి అక్షరములును స్పష్టముగా లేవు.

భాష:—శాసన భాష సంస్కృతము. ప్రకృత శాసనమునందలి మొదటి రెండు పుటలును గద్వాల శాసనపు రెండు పుటలతో సమానముగా ఉన్నవి.* అందలి మూడవపుటలో నుండిన విక్రమాదిత్య ప్రశస్తిగల ఆరు శ్లోకములలో మొదటిదైన 'రణశిరసిరిపు నరేంద్రాన్' అను ఒకశ్లోకము మాత్రమే ఇందు చెక్కబడినది. దాన విషయము తప్ప, తక్కిన శాసనాంత్య శ్లోకములు రెంటింటిలో సమానము. ఈ శాసనమునందలి మన్నూరు, వంగూరు వాటి విషయము, ఈపలుంకల్లు అను గ్రామనామములును, గొల్లభట్టి, భోయిశర్మ, బాటిశర్మ, తాతశర్మ అను వ్యక్తుల పేర్లును తెలుగు పదములుగ కానవచ్చుచున్నవి. సంధులు నియమముతో పాటింపబడినవి.

శాసన విషయము:—శాసనారంభమున స్వస్తి వాచకము లేదు. రాజముద్రా సూచకముగ వరాహస్తవముతో నిది మొదలైనది. తరువాతి గద్యలో చాళుక్యవంశ ప్రశస్తి, మొదటి పులకేశి, కీర్తివర్మ, (రెండవ

* EP. IND. Vol X P. 100.

పులకేశి) సత్యాశ్రయుల ప్రశంస కలవు. ఆ సత్యాశ్రయ పృథివీ వల్లభమహారాజునకు ప్రియతనయుడును అనేక యుద్ధాలలో చిత్ర కంఠమనుపేరుగల అశ్వము నెక్కి శత్రు రక్త జలమును పీల్చుగల ఖడ్గధారచే భూభారమును వహించిన వాడును, ఆదిశేషునివంటి భుజములచే శత్రువులను జయించిన వాడును, స్వీయ కవచముకలన శత్రువుల దెబ్బలను సహింపగలవాడును, ముగ్గురు రాజులు లోబరచుకొన్న పిత్రియమైన మహా రాజ్యమును స్వాధీనము చేసికొని తన అధికారము నెర పిన వాడును, ఆ మూడురాజ్యములందు నష్టమై యుండిన దేవబ్రాహ్మణ వృత్తులను ధర్మయశోభి వృద్ధికై పునరుద్ధరించిన వాడును, అన్ని దిక్కుల యందున్న శత్రువులను జయించి పితృరాజ్యమును పరమేశ్వర, అనివారిత బిరుదములతో పొందిన వాడును అయిన విక్రమాదిత్య సత్యాశ్రయ శ్రీ పృథివీ వల్లభ మహారాజాధిరాజ పరమేశ్వరుడు అందరి నిట్లా జ్ఞాపించుచున్నాడు. మీకు తెలియును గాక, మేము ఈ జరుగుచున్న అయిదవ నిజరాజ్య వర్షమునందు నాకు, నా తలిదండ్రులకు పుణ్యము, కీర్తి కలుగుటకై వంగూరువాటి విషయము లోని మణ్ణూరు గ్రామనివాసి అయిన సుదర్శనాచార్యు లకు శివమండల దీక్షలో గురుదక్షిణగా వైశాఖ పౌర్ణమి నాడు ఈ పలుంకల్లు అను పేరుగల గ్రామమును అన్ని అధికారములతో దానమిచ్చితిమి. దానినే సుదర్శనా చార్యులుగూడ బ్రాహ్మణులకు దానము చేసినాడు. ఈ దానము కాశ్యపగోత్రుడగు రుద్రశివ, కౌండిన్యస గోత్ర గాయత్రిశివ, హారీతగోత్ర శివస్వామి, భార ద్వాజగోత్ర గొల్లభట్టి, పరమశివ, కౌశికగోత్ర, వామన స్వామి, కేశవస్వామి. మైత్రేయగోత్ర కోకిలస్వామి, కాశ్యపగోత్ర నారాయణ, వామన, సాంకృత్యాయన గోత్ర దేవశర్మ, కాశ్యపగోత్ర రుద్రశర్మ, దేవశర్మ, ఆదిత్యశర్మ, తాతశర్మ, భరద్వాజగోత్ర భీమశర్మ, దుర్గశర్మ, భోయిశర్మ, చాటిశర్మ, కౌండిన్యగోత్ర నాగ శర్మ, భారద్వాజగోత్ర బ్రహ్మశర్మ, శాండిల్యగోత్ర ఆదిత్యశర్మ, కాశ్యపగోత్ర రవిస్వామి, కౌశికగోత్ర శ్రవణసింహ, భలందనసగోత్ర దామస్వామి, కాశ్యప దామోదరస్వామి, మొదలైన ప్రతిగృహీతలకు ధారా దత్తము చేయబడినది.

చివర మూడు వ్యాసగీతా శ్లోకములున్నవి. కడ పట 'శ్రీ సుదర్శనస్య భాస్కర' అని కలదు. బహుశః ఇది లేఖకుని పేరుగావచ్చును. దీనితో శాసనము ముగిసినది.

విశేషములు :—ఇంతవరకు ప్రకటింపబడిన విక్రమాదిత్యుని హైదరాబాదు, కర్నూలు, గద్వాల శాసనములలో కానవచ్చు విషయములే ఇందును తెలుప బడినవి. ఒక దాన విషయముమాత్రమే నూతనాంశము. ఇతర శాసనములలో ఉల్లేఖింపబడుచున్న శకవర్షము గాని, విక్రమాదిత్యు డెచటినుండి ఈ దానము చేసెనో ఆ స్థలముగాని ఇందు కానరాదు. తనకును, మాతాపి తరులకును పుణ్యయశములు లభించుటకై శివమండల దీక్షలో గురుదక్షిణగా ఈ దానము చేయబడినది. ఆ శివమండల దీక్ష ఎట్టిదో? అది ఎచట జరిగెనో తెలి యుటలేదు. శివమండలదీక్షకు సుదర్శనాచార్యులు అధ్వర్యము వహించుట గమనింపదగిన అంశము. మరల ఆచార్యుడు ఆ దానగ్రామమునే అదే దినమున కొందరు బ్రాహ్మణులకు దానమిచ్చుటకూడ విశేషము. ప్రతి గృహీతల నామముల చివర 'శివ' పదము చేర్చబడుట వలన వారు పాశుపత శైవబ్రాహ్మణులు కావచ్చును. బాదామి చాళుక్యులకాలములో పాశుపతమీ ప్రాంత మున ప్రచారమున నుండిన దనవచ్చును.

కాలము:—ఈ శాసనమున శకవర్షములు లేవు. విక్రమాదిత్యుని విజయరాజ్య పంచమవర్షమున వచ్చిన వైశాఖ పౌర్ణమి దివసమున నీ దానము చేయబడినది. ప్రభవాది వర్షములు సాధారణముగ ఈ వంశీయుల శాసనము లన్నిటిలో పేర్కొనబడక పోయినను శక వత్సరమునుబట్టి సరియైన కాలనిర్ణయము చేయుటకీలుం డెనిది. ప్రకృత శాసనమున నదియు లేనందున సరియైన కాలనిర్ణయము చేయుట కష్టము. ఇంతవరకు చరిత్ర కారులు విక్రమాదిత్యుని రాజ్యవర్షము క్రీ. శ. 655 సం॥ ఆరంభమయ్యెనని తెల్పియున్నారు. దాని ఆధారమున ఇందు సూచింపబడిన అయిదవ రాజ్య వర్షము క్రీ. శ. 659–గాని 660 గాని కావచ్చును. ఆ వర్షములలో వచ్చిన వైశాఖ పూర్ణిమనాడు ఈ దాన మొసగబడినది. సంవత్సరము ఇదమిద్ధముగ తేలనందున తిథినిగూర్చి ప్రయత్నించుట వ్యర్థమని వదలివేయ బడినది.

స్థలనిర్దేశము :—శాసనమున పేర్కొనబడిన వంగూరువాటి విషయమునందలి మణ్ణూరు, ఈపలుం కల్లు గ్రామములు ఎచటివో పరిశీలింతము. ప్రస్తుతము

కొల్లాపురము తాలూకాకుచేరి కృష్ణానదీతీరమున చిన్న—పెద్ద మఱ్ఱూరు గ్రామములు రెండున్నవి. వానికి 10 మైళ్ళ దూరములో ఇప్పుడు పెపనగండ్ల గ్రామ మొకటున్నది. మఱ్ఱూరులకు సుమారు 40 మైళ్ళ దూరమున కల్వకుర్తి తాలూకాకు చేరిన వంగూరు గ్రామమున్నది. అచట ఒకశిథిలదుర్గ మున్నట్లు మిత్రుల వలన తెలిసినది. వీనినిబట్టి చూడగా పై వంగూరు ఒకప్పుడు చారిత్రక ప్రాధాన్యము చెందియుండెన దనియు, ఆ వంగూరు విషయమునకు చేరిన పై మఱ్ఱూరులలో నొకటి సుదర్శనాచార్యులకు నివాసమై యుండెననియు, దానగ్రామము ఈ పలుంకళ్లు పైపీసనగండ్లయే అనియు తేలుచున్నది. ఈ కొల్లాపురం, కల్వకుర్తితాలూకాలు అలంపూరు తాలూకాకు పొరుగునయుండి మహబూబ్‌నగరం జిల్లాలో చేరవట్టివి. ఈ శాసనము లభించిన అమిడేలపాటి గ్రామమునకు ఈశాన్యముగ 9 మైళ్ళ దూరములో మఱ్ఱూరు గ్రామములున్నవి. చిన్నమఱ్ఱూరులో నేటికిని విశాలమైన శిథిలదుర్గము కలదు. కావున శాసన మీ ప్రాంతములకు సంబంధించినదనియే నిశ్చయింపవచ్చును.

ఇంతవరకు అలంపూరులో విజయాదిత్య వినయాదిత్యుల శాసనములు లభించినవి. అదే తాలూకాలో ఈ విక్రమాదిత్యుని శాసనము లభించుటవలనను, అలంపూరు ఆలయములు ఈ వంశీయులచే కట్టించబడి యుండుటవలనను విక్రమాదిత్యుడు తప్పక అలంపూరు క్షేత్రమును దర్శించియుండునని భావింపవచ్చును. ఇచటి ఆలయములు, శాసనములనుబట్టి ఆనాడు బాదామి చాళుక్యులకు అలంపూరు ప్రాంతము ముఖ్యకేంద్రమై యుండెనని చెప్పుటకు వీలున్నది. విక్రమాదిత్యుని అగ్రసోదరుడగు ఆదిత్యవర్మ కర్నూలు శాసనమునుబట్టి గూడ ఈ ఊహ బలపడుచున్నది.

విక్రమాదిత్యుడు:—బాదామి చాళుక్యులలో ఒకటవ విక్రమాదిత్యుడు వీరాగ్రగణ్యుడని కీర్తింపబడినాడు. ఇతనినిగూర్చిన వివరములు నా వినయాదిత్యుని శాసనమున తెలుపబడినవి. ఈశాసనము వేయునాటికి విక్రమాదిత్యునకు 'పరమేశ్వర, అనివారిత' బిరుదములు మాత్రమే ప్రాచుర్యము వహించియుండవచ్చును. ఇంతవరకు లభించిన ఇతని శాసనములలో ఇదే ప్రాచీనమైనది. అష్టకష్టముల ననుభవించి పౌరుష పరాక్రమములతో పల్లవుల నోడించి పిత్రియమైన రాజ్యపీఠము నెక్కిన మొదటి వత్సరములలో విక్రమాదిత్యుడు శత్రువులచే వినష్టమైన దేవస్వబ్రహ్మస్వములను పునరుద్ధరించుటలో గడపినా డనవచ్చును. తరువాత మరల పల్లవులు తలయెత్తగా నిరంతర యుద్ధయాత్రలు చేసియుండును. తండ్రిని చంపిన పగ దీర్చుకొనుటకై కాంచీపల్లవరాజులగు నరసింహవర్మ, మహేంద్రవర్మ, పరమేశ్వర వర్మలను వరుసగా తలయెత్తనట్లు అణచివేసిన ఇతని వీరవిహారములు తరువాతి శాసనములలో విశేషముగ వర్ణింపబడినవి. ఇతడు అవనిపతిత్రితయాంతరితమైన స్వీయరాజ్యమును స్వాధీనము చేసుకొనెనని వ్రాయబడినది. ఈ అవనిపతిత్రయము చోళ-పల్లవ-పాండ్యులు కావచ్చునేమో?

శాసనలేఖకుడు:—సాధారణముగ ఈ చాళుక్యుల శాసనము లన్నియు మహాసంధివిగ్రహిచే వ్రాయబడుచుండును. వినయాదిత్యుని కాలమునుండియు రెండవ కీర్తివర్మవరకు వీరి శాసనములను పుణ్యవల్లభ వంశమునకు చెందిన 'శ్రీరామ, నిరవద్య, అనివారిత, ధనంజయు లనువారు వ్రాసినట్లు కనబడుచున్నది. విక్రమాదిత్యుని గద్వాలశాసనము మహాసంధివిగ్రహి జయసేనునిచే వ్రాయబడినది. ఈ శాసనము చివరనున్న సుదర్శనస్య భా[స్క]ర అనునది లేఖకుని పేరైనచో ఈనాటికి మహాసంధివిగ్రహి లేఖక బాధ్యత వహింపలేదని ఊహింపవచ్చును.

## శాసనపాఠము

### మొదటి రేకు - రెండవ ప్రక్క

౧. జయత్యావిష్కృతం విష్ణో ర్వారాహం
క్షోభితార్ణవం దక్షిణోన్నత దం
౨. ష్ట్రాగ్రవిశ్రాన్త భువనం వపుః । శ్రీమతాం
సకల భువన సంస్తూయమా
౩. న మానవ్యస గోత్రాణా(ం) హారితీ పుత్రాణాం
సప్తలోక మాతృభి స్సప్త
౪. మాతృభి రభి వర్ద్ధితానాం కార్త్తికేయ పరి
రక్షణ ప్రాప్తకల్యా
౫. ణ పరంపరాణాం భగవన్నారాయణ ప్రసాద
సమాసాదిత
౬. వరాహలాఞ్ఛ నేక్షణ క్షణ వశీకృతాశేష
మహీ భృతాం
౭. చలిక్యానాం కుల మలఙ్కరిష్ణో రశ్వమేధావ
భృథస్నాన ప

# విక్రమాదిత్యుని అముదాలపాటి తామ్రశాసనము

రెండవరేకు - మొదటి ప్రక్క

౮. వి(త్రీ)కృత గాత్రస్య శ్రీ పొలికేశి వల్లభ
మహారాజస్య
౯. ప్రపౌత్రస్య పరాక్రమాక్రాన్త వనవాస్యాది
పర నృపతి మణ్డల
౧౦. ప్రణిబద్ధ విసుద్ధ కీర్తేః శ్రీ కీర్తి వర్మః
పృథివీ వల్లభ మ
౧౧. హారాజస్య పౌత్ర స్సమర సంసక్త
సకలోత్తరా పథే శ్వ
౧౨. ర శ్రీ హర్షవర్ద్ధన పరాజయోపలబ్ధ
పరమేశ్వరాపర
౧౩. నామధేయస్య సత్యాశ్రయ శ్రీ పృథివీవల్లభ
మహారాజా
౧౪. ధి రాజ పరమేశ్వరస్య ప్రియ తన(య)ః
ప్రతీతానేక సమ

రెండవరేకు - రెండవ ప్రక్క

౧౫. ర ముఖేషు చిత్రకణ్ఠాఖ్య ప్రవర తురంగ
మేనైక నైవ రిపు నృ
౧౬. పతి రుధిర జలాస్వాదన రసనాయమాన జ్వల
దమల నిశి
౧౭. త నిస్త్రింశ ధారయా వన్యృతి ధరణి భర(ః)
భుజగభోగ సదృశ
౧౮. నిజ భుజ విజిత విజిగీషు రాత్మ కవచా వ
ను గ్నా నేక
౧౯. ప్రహార స్స్వగో (శ్రియ) మవనిపతి
త్రితయా న్తరితా మా
౨౦. త్మ సాత్కృత్య కృతైకాధిష్ఠిత శేష రాజ్య
భరః తస్మిన్ రా
౨౧. జ్యత్రయే వినష్టాని దేవస్వ బ్రహ్మ దేయాని
ధర్మాయ
౨౨. లోభివృద్ధయే స్వ ముఖేన స్థాపితవాన్ (।)
రణ శిరసి

మూడవ రేకు - మొదటి ప్రక్క

౨౩. రిపు నరేన్ద్రా న్దిశి దిశి జిత్వా స్వవంశజాం
లక్ష్మీం (।) ప్రాప్య చ—పరమేశ్వరతా మ
౨౪. నివారిత విక్రమాదిత్యః (।।) విక్రమాదిత్య
సత్యాశ్రయ శ్రీ పృథివీ—వల్లభ మహా
౨౫. రాజాధిరాజ పరమేశ్వర స్సర్వా నాజ్ఞాపయతి
విదితమస్తు వో స్మా[illegible]
౨౬. ప్రవర్ద్ధమాన విజయరాజ్య పఞ్చమ సంవత్సరే
ముట్టూర గ్రామాధి వా

౨౭. సకః కంగూరవాటి విషయే మాతాపిత్రో రాత్మ
నశ్చ పుణ్య యశో
౨౮. వా ప్తయే శివమణ్డల దీక్షి(తా)యాం సుదర్శనా
చార్యాయ గురుద
౨౯. క్షిణార్థం వైశాఖ పౌర్ణమాస్యా మీ పలుం
కల్మామ గ్రామః సర్వ
౩౦. పరిహార ముదకపూర్వ్వం దత్తః ఆచార్యే
ణాపి బ్రాహ్మణేభ్యో
౩౧. దత్తః

మూడవ రేకు - రెండవ ప్రక్క

౩౨. రుద్ర శివాచార్య కాశ్యపగోత్ర కౌణ్డిన్య
గోత్ర గాయత్ర శివ హా
౩౩. రీతగోత్ర శివస్వామి భారద్వాజ గోత్ర గొల్లభట్టి
తద్గోత్ర పరమ
౩౪. శివ కౌశికగోత్ర వామనస్వామి తద్గోత్ర కేశవ
స్వామి మై
౩౫. త్రేయ గోత్ర కోకిలస్వామి కాశ్యపగోత్ర
నారాయణ వామన
౩౬. ద్వయం చ సాంకృత్యాయనగోత్ర దేవశర్మః
కాశ్యప
౩౭. సగోత్ర రుద్రశర్మః దేవశర్మః అదిత్యశర్మః
తాతశర్మః
౩౮. భారద్వాజ(స) గోత్ర భీమశర్మః గుణ (గణ)
శర్మః భోయిశర్మః
౩౯. బాటిశర్మః కౌణ్డిన్య గోత్ర నాగశర్మః

నాలుగవ రేకు - మొదటి ప్రక్క

౪౦. భార(ద్వా)జ గోత్ర బ్రహ్మశర్మః దో(కౌ)
ణ్డిల్య గోత్ర అదిత్యశర్మః
౪౧. కాశ్యపగోత్ర రవిస్వామి కౌశికగోత్రస్య శ్రీవణ
సిజ్ఞ శర్మణో భాగద్వయం భలన్దనస
౪౨. గోత్రో దామస్వామి కాశ్యపగోత్రో దామో
దరస్వామి భరద్వాజ గోత్రో -స్ఫ-న్దదా (।।)
౪౩. స్వన్తాతుం సుమహచ్ఛక్యం దుఃఖ మన్యస్య (।)
దానం
౪౪. వా పాలనం చేతి దానాచ్ఛ్రేయోనుపాలనం
(।।) బహుభి ర్వసు
౪౫. ధా భుక్తా రాజభిస్సగరాదిభిః (।) యస్య యస్య
యదా భూ
౪౬. మి స్తస్య తస్య తదాఫలం (।।) స్వదత్తాం పర
దత్తాం వా యోహరే
౫౭. త వసున్ధరాం (।) షష్టివర్ష సహస్రాణి విష్ఠా
యాం జాయ
౪౮. తే క్రిమిరితి శ్రీ సుదర్శనస్య భా(స్క)ర

# కలగూరగంప



## కశ్మీరమా? కాశ్మీరమా?

శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి

సంస్కృతి నిఘంటువులలో కశ్మీరము, కాశ్మీరము అను 2 పదములు కన్పించుచున్నవి. కశ్మీరశబ్దము పుంలింగము. దాని యర్థము కశ్మీరదేశము. 2-వ దగు కాశ్మీరశబ్దమున కర్థము కశ్మీర సంబంధమైనదని. మహాభారతమున ఉపాయన పర్వములో కూడ ఈ యర్థములోనే ప్రయోగింపబడినది. కాశ్మీరశబ్దము విశేషణముగా నుపయుక్తమైనది. 'కాశ్మీరాః కుదమానశ్చ, పౌరకాః హంసమాయనః' (మహాభారత ముపాయన పర్వమున 13 శ్లో.)

పాణినీయ అష్టాధ్యాయిలో, కచ్ఛాదిభ్యశ్చ అను సూత్రముక్రింద కచ్ఛ, సింధు, వర్ణు, గాంధార మొదలైన శబ్దముల తరువాత దేశార్థమున కశ్మీరపద ముల్లేఖింపబడినది. పాణిని దేశార్థముననే కశ్మీర పద ముపయోగించుట స్పష్టమే.

అమరకోశములో కుంకుమకు పర్యాయపదములు చెప్పు శ్లోక మిట్లున్నది. 'కశ్మీరజ న్మాగ్నిశిఖం, వరం వాహ్లీకపీతనం, రక్తసంకోచ పిశునం, ధీరలోహిత చందనం' ఈ శ్లోకమువలన అమరకోశ కర్తకూడ దేశార్థముననే కశ్మీరపద ముపయోగించినట్లు స్పష్టమగుచున్నదికదా!

మహాభాష్యము రచించిన పతంజలికూడ దేశము అను అర్థములో కశ్మీరమే ప్రయోగించినాడే కాని కాశ్మీరము ఉపయోగించలేదు.

కశ్మీర సంబంధముగా మిక్కిలి ప్రాచీనమైన నీలమత పురాణమను గ్రంథము నీలమునిచే రచింపబడినదికలదు. ఈయన కశ్మీరదేశీయుడు. నీలమతపురాణములోని ఈ శ్లోకములు చూడుడు:

"యైవ దేవీ ఉమా సైవ | కశ్మీరా నృపపుంగవ
ఆసీత్ సరఃపూర్ణజలం | సురమ్యం సుమనోహరం
కః ప్రజాపతిరుద్దిష్టః | కశ్యపశ్చ ప్రజాపతిః
తేనేదం నిర్మితం దేశం | కశ్మీరాఖ్యం భవిష్యతి"

నీలమునికూడ దేశార్థములోనే కశ్మీరపద ముపయోగించినట్లు పై శ్లోకములవలన తెలియుచున్నది. ఈ నీలమత పురాణమువలన కాశీ మొదలగు విద్యాకేంద్రములవలె కశ్మీరముకూడ ప్రసిద్ధ విద్యాకేంద్రముగా వర్థిల్లినదని స్పష్టమగును.

కల్హణుడు రాజతరంగిణిలో దేశార్థములో కశ్మీర పదమే ప్రయోగించినాడు. రాజతరంగిణిలో ప్రథమ తరంగములో 'కశ్యపేన తదంతస్థం ఘాతయిత్వా జలోద్భవం నిర్మమే తత్సరోభూమౌ కశ్మీరా ఇతిమండలం' అని కలదు. అనగా కశ్యపముని జలోద్భవుడను రక్కసుని చంపి కశ్మీరమండలము నిర్మించినాడు.

ఈ సందర్భమున కశ్మీరదేశమును గూర్చిన పౌరాణిక గాథ వ్రాయుట అప్రస్తుతము కాదు. ఇప్పటి కశ్మీర ప్రదేశమున పూర్వము సతీ సరస్సను సరస్సుండెడిదట. ఆ సరస్సులో లెక్కలేనన్ని పిశాచములు యక్షులు నివసించువారట. వారికి రాజు జలోద్భవుడను భయంకర రాక్షసు డుండువాడు. బ్రహ్మపౌత్రుడును, మరీచిపుత్రుడును నగు కశ్యప మహర్షి యారాక్షసుని చంపి కశ్మీరమండలము నిర్మించెను. పై నుదహరించిన కల్హణుని శ్లోక మీ గాథనే చెప్పినది.

మరియొక పౌరాణిక గాథ ననుసరించి కశ్యపుడు చాలకాలము ఘోర తపస్సుచేయగా త్రిమూర్తులు చివరకు తపమునకు మెచ్చిరి. తరువాత శారికాదేవి జలోద్భవ రాక్షసుని జంపినది. ఆ రాక్షసుని కంకాళమే యొక పెద్ద పర్వతమంతయైనది. దానినే ఇపుడు హారిపర్వతమని పిలుచుచున్నారు. తరువాత సతీసరస్సులోని జలము పెద్ద బిలములోనికి ప్రవహింపజేయబడినది. నీరు పోయిన తరువాత కశ్యపుడిప్పుడు భూనిర్మాణ మొనరించెను. ఆకశ్యపుని పేర ఆప్రదేశము

కశ్యపమారమని ప్రసిద్ధి చెంది కాలక్రమముగా కశ్యపమీర్, అయి అదే కాశ్మీరమైనది. పూర్వపు యూనానీ ప్రజలు కశ్మీరును కశ్పీరియాయనువారు. యూనానీ చరిత్ర కారులు కొందరు కశ్యపాత్రేస్, అనియు, మరికొందరు కశ్యపవిరాస్, మరియు, కశ్యపాపిరాస్ అనియు కశ్మీరును పేర్కొనిరి. ఒక పరిశోధకుడు తన గ్రంథములో కశ్మీర శబ్దమును వ్యాఖ్యానించుచు సంస్కృతములో 'క' అనుదానికి జలము అర్థము. శమిరమనగా సుఖింప చేయుట. అనగా జలము తొలగించి వాసయోగ్యము చేయబడిన ప్రదేశమే కశ్మీరము కాని శమిర శబ్దమునకు సుఖింప చేయుట అను వర్థమేయాధారమున చెప్పబడెనో స్పష్టము కాలేదు. భూగర్భశాస్త్ర పరిశోధకులు కూడ అక్కడి భూభాగములను బాగుగా పరిశీలించి అతి ప్రాచీనకాలమున కశ్మీరభూమి జలమయమై యున్నదని నిర్ధారణచేసిరి. అందుకు తగిన యాధారములు వారు చూపిరి. ఈ పై చర్చ తరువాత దేశార్థమున కశ్మీరమని వాడుట శ్రేష్ఠతమమని తోచకమానదు.

* * *

# ఆంధ్ర కవయిత్రులు - మొల్ల

"నరసింహం"

అత్యంత ప్రాచీనకాలమునుండియు పురుషులవలె స్త్రీలుకూడ సమస్తవిద్యలయందు దారితేరి విశ్వమున పెంపొంది విఖ్యాతి వార్జించుకొనియున్నారు. వేదకాలమున ఋషివాటికలలో శిష్యులతోఁబాటు శిష్యురాండ్రుకూడ నుండెడివారని వినికిడి. గార్గి, మైత్రేయాదులీ శాఖకుఁ జెందినవారే. ఆనాటి స్త్రీలు వేదములను పఠించెడివారు. పురాణేతిహాసములు రచించినవారు, ఉపనిషత్తులను వ్యాఖ్యలొనర్చినవారు కవయిత్రులలో ననేకమంది గలరు. శీలాదేవి, ప్రభుదేవి, గంగాదేవి, ప్రియంవద, లీలావతి, మధురవాణి, జ్ఞానసుందరి—ఇత్యాదు లెందఱో సంస్కృత సారస్వతమున కవాల్యమైన కావ్యముల నొడగూర్చి కవితా సామ్రాజ్యమునం దొక విశిష్టస్థానము నలంకరించుకొనిరి. గంగాదేవి 'మధురా విజయము'ను నొక కావ్యమును రచించెను. ఈమె కవికులగురువగు కాళిదాసు సాదర్శముగాఁ గైకొని యచటచట కాళిదాసు కవితకు సంబంధము మెఱుంగులు దిద్దిన మేటిమెలఁత. ఉదాహరణము: "ససేనాం మహతీం సేనాం వ్యగుచ ద్వీర కుంజరః; పయోదమాలా మాకర్షన్, పౌరస్త్య ఇవ మారుతః" (మధురావిజయము)

ఈ శ్లోకమున కాధారభూతమగు కాళిదాస శ్లోక మిది:

"ససేనాం మహతీంకర్షన్, పూర్వసాగరగామినీమ్,
బభౌహరజటాభ్రష్టాం గంగామివ భగీరథః"

(రఘువంశము)

ప్రియంవద శ్లోకము లతిమనోహరములు, ఉదాహరణకు:

"కాళిన్దీపులినేషు కేళికలనం కంసాది దైత్యద్విషం
గోపాలీభిరంభీప్సితం వ్రజవధూనేత్రోత్పలై రర్చితమ్
బర్హాలంకృత మస్తకం సులలితై రక్తైస్త్రిభంగంభజే
గోవిన్దం వ్రజసున్దరంభవహరం వంశీధరంశ్యామలం"

దీని నన్నిఁటి నాలోకించినచో వేదకాలము నుండి స్త్రీలు మంజుల కవితాగానము చేయఁగలవారనీ మిక్కిలి చతురభాషిణులనీ తెలియుచున్నది.

ఇట్లు కవయిత్రుల కవనము మధురకవిత్వ మగుటచేఁ గవులుకూడ నచ్చటచ్చట కవయిత్రుల గ్రంథము నుండి పాదములకుఁ బాదములు తీసికొని తమ గ్రంథములం దిముడ్చుకొనిరి. ఇట్లు చేఁబట్టినవారిలోఁ జేమకూర వేంకటకవి యొకఁడు. ఈతఁడు తాళ్లపాక తిమ్మక్క సుభద్రాకళ్యాణమునందు కొన్ని పాదములనుఁ గైకొని తన విజయవిలాసమునందు పొందుపఱచినాఁడు.

"ఎగు భుజమ్ములవాడు మృగరాజ నడుము నడచి పుచ్చుకొను వెన్నడుములాగను" (సుభద్రాకళ్యాణము)

"ఎగు భుజమ్ములవాడు మృగరాజ మధ్యంబు పుడికి పుచ్చుకొను వెన్నడుమువాడు" (విజయవిలాసము)

కాఁగా స్త్రీలు చదువుకొనుట, కవనము చెప్పట ఇత్యాదులు నేడు నూతనముగా గల్పింప బడినవి కావని ఘంటాపథముగా జెప్పవచ్చును.

రఘునాథ, విజయరాఘవ నాయకులాస్థానము నందనేక సంస్కృతాంధ్ర కవయిత్రు లున్నట్లు చరిత్రలవలన స్పష్టపడుచున్నది.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి కృషి ఫలితముగా మొన్న మొన్నటివరకు ప్రథమాంధ్ర కవయిత్రిగాఁ బేరెన్నిక గన్న మొల్ల నేఁడు ద్వితీయ కవయిత్రిగా పరిగణింపబడుచున్నది. కందువ మాటల నందముగాఁ గవిత సెప్ప నేర్చిన యీద్వితీయ కవయిత్రిని గూర్చి యించుక నారయుట ప్రస్తుతాంశము.

మొల్ల ఆంధ్ర కవయిత్రులలో ముఖ్యముగ నెన్నదగినది. ఈమె కృతి రామాయణము. కృతిభర్త శ్రీరామచంద్రుడు. జగజ్జెట్టి, పూత హృదయుఁడు, పుణ్యశ్లోకుడునగు శ్రీరాముని చరితమే యిందలి యితివృత్తము. ఈమె కులాలవంశ సంజాత. ఇంటిపేరు ఆత్మకూరివారు. వంగడమునుబట్టి "కుమ్మరి మొల్ల" యని విశ్వమున వ్యవహరింపబడుచున్నది. ఈమె జనకుడు 'కేతనసెట్టి'. గ్రంథావతారికలో నాదికవి స్తుతియందు శ్రీనాథుని స్మరించి యుండుటచే నీమె శ్రీనాథుని తరువాత కాలమున నుండినదని తెలియుచున్నది. చరిత్ర పరిశోధకులీమె కాలమును 1525సం॥ ప్రాంతమని నిర్ణయించి యున్నారు. అవివాదగ్రస్తమై నేఁడు మనకు లభించు యీకవయిత్రి గ్రంథము రామాయణ మొక్కటియే. ఈగ్రంథమే ఈమె యశశ్చంద్రిక నాచంద్రతారార్కముగా నుంచగలిగినది. ఈకావ్యమునుబట్టి యీమె రామభక్తురాలని తెలియుచున్నది. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు తమ ఆంధ్ర కవయిత్రుల గ్రంథమునందు మొల్లను గూర్చి చెప్పుచు "బాల వితంతువగుట గ్రంథమునం దెచ్చటను భర్తృవంశ కథనము కనబడదు" అనివ్రాసిరి. ఇట్లు చెప్పుట సాహసము. భర్తృవంశక్రమము లేమిచే యీమెను బాల వితంతువనుటకంటె "ఆజన్మ బ్రహ్మచారిణి" యని చెప్పుటయే సమంజసముగా దోచుచున్నది. గణితశాస్త్ర కావ్యకర్త్రియు, భాస్కరాచార్యుని కుమార్తెయు నగు లీలావతి నవివాహితగానే చాలమంది పేర్కొనిరి. అట్లే రామాయణకర్త మొల్లగూడ "బ్రహ్మచారిణి" యని యూహించుటయే లెస్స. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు తమ గ్రంథమున నించుమించుగాఁ దొలితరములలోని కవయిత్రుల నందఱను యీ విధముగ బాల వితంతువులుగనే పేర్కొనిరి. భర్తృ నామములు చెప్పకుండుటచే వారి నందఱను బాల వితంతువులుగఁ బేర్కొనుటంత యుక్తియుక్తము గానేరదు.

గ్రంథావతారికనుబట్టి యీమె తక్కిన కవయిత్రులకువలెనే గురువునొద్ద విద్య నభ్యసింప లేదనియు, గోపవరపు శ్రీకంఠ మల్లేశు కృపను కవిత్వమును చెప్ప నేర్చినదనియు తెలియుచున్నది. ఈమె కావ్యలక్షణాదికముల నేమియు నెఱుంగక పోయినను నన్నయ తిక్కనాది కవుల గ్రంథములను మాత్రము క్షుణ్ణముగ చదివినదని యీమె పద్యముల తీరు నడకలనుబట్టి చెప్పవచ్చును. ఈమెపై పోతన కవితా ప్రభావ మెక్కువగాఁగలదు. "పలికెడిది భాగవతమట, పలికించెడివాఁడు రామభద్రుండట..." అని పోతన చెప్పిన మాదిరిగనే యీమె రామాయణమునందు "చెప్పుమని రామచంద్రుఁడు, చెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నెల్లప్పుడు నిహపరసాధన,మిప్పుణ్య చరిత్ర, తప్పులెంచకుఁడు కవుల్" అని పల్కినది.

సర్వగుణాకరుఁడగు శ్రీరాముని చరితము నెందఱెన్ని విధముల రచన గావించినను నవ్యతగలిగి వీనుల విందై, యమృతపు సోనలపొందై యలరారుచుండుట తానీ గ్రంథమును చేపట్టుటకు కారణమని చెప్పినది. మఱియు నట్టి మహాత్ముని చరితమును కందువ మాటల నందముగాఁగూర్చి పఠితలకు శ్రోతలకు విందొనగూర్తునని ముందంజ వేసినది. గ్రంథమునంతను చెప్పిన రీతిని నడిపించి ధన్యురాలైనదీ మొల్ల. తెనుఁగున సంగ్రహ రామాయణముల రచించిన వారిలో నీమె యొకర్తుక. శిల్ప చాతుర్యమునందు మొల్లరామాయణమునకే విమర్శకు లెక్కువ గౌరవము నొసంగుచున్నారు.

గ్రంథావతారికయందుఁ జెప్పఁబడు విషయముల విషయమున నీమె పూర్వ కవుల సంప్రదాయము నే యనుసరించినది. కావ్యారంభ మయోధ్యాపుర వర్ణనముతోఁ బ్రారంభమై, దశరథుని పుత్రకామేష్టి, శ్రీరామచంద్రుని జనన మాదిగా రావణవధానంతరము ముగియుచున్నది.

ఇట్లీమె పూర్వరామాయణమును స్పృశించి గ్రంథమును ముగించినదే కాని యుత్తర రామాయణమును స్పృశింపనే లేదు. భక్తురాలగు నీమె తన దైవతములగు సీతారాముల వియోగమును భరింపలేక పోయెనేమో!

సాధారణముగఁ గవులు (ప్రకృతి) వర్ణనాదులందు జటిలమై, సుదీర్ఘమైన సమాసముల నొడగూర్చి తమ పాండిత్యప్రకర్షను జూపింతురు. శబ్దాడంబర

మునకుఁ బ్రాధాన్యమిచ్చు ప్రబంధ యుగమున బుట్టియు మొల్ల శబ్దాడంబరమునకు లోనుగాక యలఁతి యలఁతి పదములతోనే తన రచనను సాగించి యాచంద్రతారార్కముగ నాంధ్రుల మన్ననలను బడయుచున్నది. ఈమె గావించిన వర్ణనల నొక్కసారి చవిచూడుఁడు.

"నారదులైరి సన్మునులు నాక
మహీజములయ్యె భూజముల్
శారదలైరి భామినులు శం
కర గోత్రములయ్యె శైలముల్
పారము వైరి నీరధులు పన్నగ
నాయకులైరి నాగముల్
వారిజ వర్గమెల్ల సితవర్గము
లయ్యెను పండువెన్నెలన్".

"పగలు ప్రాగ్భాగమునుండి గగనవీథి
చరమ దిక్కున కేగగా శ్రమముదోప
చెమటబట్టిన స్నానంబు సేయ నరుగు
కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె".

చిన్ని గీతములలో పెద్ద భావముల నిముడ్చుట నీమె సహజగుణము. "జడలు ధరియించి తపసుల చందమునను, దమ్ముఁడును దాను ఘోరందురమ్ములందు కూరగాయలు కూడుగాఁ గుడుచుచుంటి, రాముఁ డేరీతి లంకకు రాఁగలండు."

పదబంధమునం దీమెకు చక్కని నేర్పుగలదు.

"రాముని పంపున వచ్చితి
రాముని సేమంబు నిందు రంజిల్లెడి, యా
రాముని సతి శోధించితి,
రామునికడ కేగుచుంటి రాజసవృత్తిన్.

దీనిని చదివినపుడు -

"రాజుల నీరాజనములు
రాజుల జలగమనములును రాజిత లక్ష్మీ
పూజలు దేవోత్సవములు
రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా" అను పోతన గారి పద్యము తలఁపునకు వచ్చును.

ఉద్దండ పండితులచేఁ జేకొనఁబడు విరోధాభాసాద్యలంకారములనుగూడ నీమె చేకొని కడు సమర్థతతో నిర్వహించెననిన యామె కళా వైదగ్ధ్యము వేఱుగ చెప్పనక్కరలేదు. ఉదాహరణము "ప్రకటాకురాగ సంపన్నులాదురుగాని రమణీయరుక్కౌర్యకులుగారు" — ఇట్టివి యెన్నియో యీమె గ్రంథమునఁ గానవగును.

తిక్కనవలె మొల్లయు పాత్రలను కండ్లకుఁ గట్టునటుల చిత్రింప గలదు. హనుమంతుఁడు సముద్రమును దాటునపు డామె యా ప్రాంతము నుండి చూచినది కాఁబోలు: ఆసముద్రోల్లంఘన మెంత సత్యసముపేతముగా వర్ణించినదో గాంచుఁడు.

"మొగము బిగించి, పాదముల మొత్తముగానట
మూదిత్రొక్కి, నీ
టుగ మొగమెత్తి భీకర కఠోర రవంబున నార్చి
బాహుల
త్యగణితలీలనూచి, వలయంబుగ వాలము ద్రిప్పి
వ్రేయుచున్
నగము సగంబు క్రుంగ గపినాథుఁడు నింగికి
దాటె రివ్వునన్"

కవిత్వమున నీవిధముగ నుండవలెనని మెకాలె నిర్వచించియున్నాఁడు.

We mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination - the art of doing by means of words what the painter does by means of colours."

యుద్ధ వర్ణనల సందర్భమున నీమె నిజముగ యుద్ధములు చూచెను కాఁబోలు ననిపించును.

"కూరాటి తేరులు," 'కంటిలో నెరసు చందము' "చెవినిల్లుకట్టుకొని" మొదలగు జాతీయములు, నుడికారములు నెన్నియోగలవు. 'కోసుక' మొదలగు వ్యాకరణ విరుద్ధ ప్రయోగములు గూడ గలవు. ఇవి గ్రంథమున కేమాత్రము న్యూనత నాపాదింపవు.

నిసర్గ కవితాధారతో నత్యంత మనోజ్ఞముగ సీతారాముల చరితమును కవితాగాన మొనరించి సారస్వతలోకమున చక్కని స్థానమలంకరించుకొని కవులెల్లరచే మన్ననలు బడయుచున్న మొల్ల యెంతయు ధన్యురాలు. ఆంధ్ర స్త్రీ లోకమున... గాదు. కవితా లోకమున నెంతయు ధన్యురాలు.

# నన్నెచోడుని కాలము డేగలమూడి శాసనము

శ్రీ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఏబది సంవత్సరముల క్రిందట బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడ రచితమైన కుమారసంభవమను నాంధ్రప్రబంధము ప్రకటించిరి. "నన్నెచోడుడు నన్నయకు పూర్వుడు-సుమారొక శతాబ్దము ముందువాడు. క్రీ॥ శ॥ 940 లో రణనిహతుడయ్యె" నని రామకృష్ణకవిగారు ప్రకటించిరి; కాని శ్రీ కం. వీరేశలింగముగారు, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, జయంతి రామయ్యపంతులుగారు మొదలగు ఉద్దండ పండితప్రకాండు లందుకు ఒప్పుకోలేదు. నడకుదిటి వీరరాజుగారు, వెంపరాల సుబ్రహ్మణ్యంగారు లోనగు విమర్శకులు నన్నెచోడునికి తిక్కనాటివాడు నన్నయ్య యనుటకు సమ్మతింపలేదు; కొందరు తిక్కన తరువాతివాడు, నన్నెచోడుడనిరి; మరికొందరు నన్నయకు తిక్కనకు మధ్యకాలమువాడు కుమారసంభవకర్త అనిరి.

ఇటీవల దేవరకొండ వెంకటకృష్ణారెడ్డిగారు, నన్నెచోడుడు నన్నయకు ఇంచుమించుగా సమకాలీనుడని నిర్ణయించి చక్కని ఉపపత్తు లిచ్చిరి. మొన్న నెల్లూరివారిచే గండపెండేరముతో సత్కరింపబడిన యువకమిత్రులు-శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారుకూడ శ్రీ రెడ్డిగారి అభిప్రాయముతో ఏకీభవించినట్లే చెప్పిరి.

ఇట్లుండగా ఈ మధ్య నా ప్రాత నోటుబుక్కులోని పేజీలు ఎందుకో తిరగవేయుచుండగా 1919 సం॥ మే, జూన్ నెలలలో నేను ఎత్తి వ్రాసుకొనిన ప్రాత శాసనమొకటి నా దృష్టి నాకర్షించినది. ఓరియంటల్ లైబ్రరీలో 15-6 26 సంఖ్యగల పాత బైండు పుస్తకమునుండి ఇది ఎత్తి వ్రాయబడినది.

గుంటూరు జిల్లా యిందాకా—మా గుంటూరు తాలూకాలో చేరిన — డేగలమూడి— పడమర వేంచేసియున్న శ్రీ మల్లిఖార్జున స్వామివారి ఆలయంలో పాతివున్న స్తంభంమీద వ్రాసిఉన్న శాసనం—ఇది; నాగాభరణంవున్నది. నందీశ్వరుడు వున్నాడు.

## శాసన వివరములు

"స్వస్తి శ్రీ శక వర్షంబులు 1002 అగు శేఖర పరాంగనపుత్ర శ్రీ నన్ని చోడ మహారాజులు, తమ తండ్రి శ్రీ భువనమల్లిచోడ మహారాజులకు తల్లి మాచాని (?ల?) దేవులకు ధర్మముగాను త్రిభువన మల్లిఖార్జున మహాదేవరకు కమ్మనాటిలోన కొట్టిదోన తూర్పున డేగలమూడిమలభియ్యా అంగరంగభోగాలకు నాచంద్ర తారార్కముగా నిచ్చితిని. కొట్టిదొన దక్షిణాన మల్లెపిగడల కావు నైవేద్యానకు యిస్తిమి, ఆచంద్ర తారార్కముగా॥ స్వదత్తం పరదత్తం వా యో హరేతి వసుంధరా షష్టిర్వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః॥ స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥ డేగలమూడి గ్రామాలు తమాయిండ్లు అమరిసాటి సుంకములేదు"

తేల్చవలసిన సంగతులు :

(1) కాలము శా. శ. 1002 అంటే క్రీస్తుశకం 1080 అగును. (2) ఇందలి నన్నిచోడ మహారాజును, పల్లిచోడ మహారాజును ఒక్కరే యగుదురా? (3) తల్లి మాచాదేవియును ఒకరియేనా? చాని - వి తప్పా, లేక సరియగునా? (4) త్రిభువన మల్లిఖార్జున దేవర జంగమ మల్లిఖార్జునుడా (నన్నెచోడుని గురువా? కీ శే వీరేశలింగముగారు కవులచరిత్ర (Revised) ప్రథమ భాగము నందలి 195 పుటలో ఇచ్చిన Archaelogy Report of 1915-16 లో No 363 శాసనముతో ఏమైనా అన్వయించునా?

మన సారస్వతమునందును చరిత్రయందును అభిమానము గలవారు—విమర్శక శిరోమణి శ్రీ కోన వెంకటరాయశర్మగారు డేగలమూడి సమీపస్థులు ఈశాసనము పరిశీలించి—సరియైన పాఠము నిచ్చి శ్రీ రెడ్డిగారి సిద్ధాంతమును బలపరుపగలరని కోరుచున్నాను; లేక శ్రీ రెడ్డిగారే శ్రమచేసి దీనిని పరిశీలింపవచ్చును. ఆంధ్రు లందరకును పూజ్యుడు స్మరణీయుడునైన కుమారసంభవకర్త కాల నిర్ణయమును గూర్చిన నిస్సందేహమైన సాక్ష్యమును ప్రోగుచేసి సత్యమును స్థిరపర్చుట అందరకు కావలసినదే కదా?

# పలనాటి వీరగాథ ప్రచురణ

వ. గోపీచంద్

వాఙ్మయము జాతిలోని ఒక అంతర్వాహిని. అనగా, జాతి లేనిదే వాఙ్మయముండదని భావము. విశ్వ వాఙ్మయము వివిధ జాతులకు ముకురము. వాఙ్మయము దేహము; జాతి జీవము. ఈ రెంటికి నవినాభావ సంబంధమున్నది. ఎట్టి అలౌకిక కావ్యమునందైన జాతిశక్తి ప్రభావము గోచరింపక మానదు. తత్కావ్యస్రష్ట జాతి సంబంధియగుటయే దాని హేతువు. ఉదాహృతికి: భారతము వంటి యితిహాసమును రచియించు నన్నయ; అర్జునుని దేశాటన సందర్భమున వేఁగి దేశమును ప్రత్యేకముగ నొక సీసపద్యమున నభివర్ణించి యున్నాఁడు. కవికి తన జాతిపైగల అధిక ప్రీతియే యిట్లు ప్రతిఫలించును.

ఆంధ్రజాతి ప్రాచీన భారతదేశ చరిత్రపుటలలో సృజించిన చరిత మద్భుతమైనది. మన వాఙ్మయమున వెలసిన వివిధప్రక్రియలు చక్కనైనవి. కానియొక్కటే లోపము కలదు. ఆంధ్రావళి పురోభివృద్ధికి దోహదకారియైన జాతిశక్తిని ప్రతిబింబింపజేయు వీరచరిత్ర కావ్యములు పురాణేతిహాసప్రబంధాదుల వలె పండితాదరముఁ బొంది వాఙ్మయసీమయందు విశిష్టస్థానము సంపాదించుకొనకుండుట మన దురదృష్టము.

కాటమరాజుకథ, బొబ్బిలివీరగాథ, పలనాటి వీరచరిత్ర, అల్లూరి సీతారామరాజుకథ వంటి వీరుల గాథలు పామరజనుల నాలుకలపై నాట్యమాడుచు చిరముగ నిల్చిపోయినవే కాని, వానికి ఇతిహాస గౌరవము సాహిత్యరంగమున లభింపలేదు.

"పలనాటి వీరచరిత్రము" పలనాటి వీరగాథలోని యొక భాగము. దీనిని మంజరీ ద్విపదచ్ఛందమున శ్రీనాథుఁడు సంతరించెను. అదియును స్వతంత్ర రచనమని చెప్పవీలులేదు. శ్రీనాథుని నాఁటికి తెలుగు సీమలో పిచ్చుకుంట్ల వంటి సామాన్య ప్రజానీకము నడుమ పాటగా ప్రవహించు ఈ వీరగాథ నే యాతడు సంస్కరించి యుండనోపును. "పలనాటి వీరగాథ" చాల పెద్ద రచన. దానిలో వీరరస మంగిఁగగల యుద్ధఘట్టమును మాత్రమే శ్రీనాథుఁడు స్వీకరించినాఁడు. ఇతర భాగములను మల్లయ్య, కొండయ్య అనువారు రచించిరి. ఐనను, అది నిర్దుష్టమైన రచన మన వీలు లేదు. పై మువ్వురు రచించిన భాగములనో, గలిసి మొత్తము రచన పెక్కు పాఠాంతరములతో, అనేక దోషములతో నిండి యున్నది.

అనేక క్షుద్రగ్రంథములను వెలుగులోనికి దెచ్చు నేటి యాంధ్రులు, ఎన్నడో జరిగిన కురుక్షేత్ర మహాసంగ్రామముతోఁ దుల్యమై, "అభినవ భారత"మన దగిన మన "పలనాటి వీరగాథ"ను చిన్న చూపు చూచుట శోచనీయము. మనకుఁ బ్రత్యేక రాష్ట్రము వచ్చిన యీ తరుణమున, తెలుగుజాతి చరితలో మరపురాని మూర్తిని తెలుఁగువారి హృదయములపై ముద్రించుకొనిన యీ "పలనాటి వీరగాథను" నిర్దుష్టముగఁ బరిష్కరించి చక్కని కావ్యముగఁ బ్రచురింపవలెను. దేశములోని పెక్కు తాళపత్ర ప్రతుల సహాయమున, ప్రభుత్వ సహకారముతో నేదేని ప్రసిద్ధ సాహిత్య సంస్థ యిట్టి గురుతర బాధ్యతను నిర్వహింపవలెనే కాని యొకరిద్దరు ఇట్టి భారమును వహింప జాలరు.

త్వరలోనే యీ పరిష్కరణమును ప్రభుత్వ, సాహిత్య సంస్థలు వ్యయప్రయాసముల కోర్చియైన నిర్వహించి, మన జాతికిఁ గొంతయైన వాఙ్మయ రూపమున మేలొనర్చినట్లు భావించినచో తెలుగువారి జాతి చరిత్రకొక ప్రకృష్ట స్వరూపమున్నటుల తెలియ గలదు. వాఙ్మయమునఁ జక్కని 'వీరచరిత్ర కావ్యములు' కనిపింపని లోటు కూడఁ దీరఁగలదు.

# గ్రంథ విమర్శనము

## శ్రీ వసిష్ఠ గీత

[ప్రథమభాగము]

అనువాదకులు : శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి; ప్రకాశకులు : శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి : వెల : మూడురూపాయలు.

అనువాదకులు ఉపోద్ఘాతంలో ఇలా తెలియజేస్తున్నారు:

'వాల్మీకిరామాయణమనియు, వాసిష్ఠ మహారామాయణమనియు, ఆదికవి వాల్మీకిమహాకవి రచించెను. అందు మొదటిది యగు వాల్మీకి రామాయణము 24 వేల శ్లోకములతో గూడినదియు, రెండవదియగు వాసిష్ఠ మహారామాయణము 32 వేల శ్లోకములతో గూడినదియునై యొప్పుచున్నది. వాసిష్ఠ మహారామాయణమునకే శ్రీ యోగవాసిష్ఠమనియూ పేరుగలదు. ఈ యోగవాసిష్ఠముయొక్క సారమే శ్రీ వసిష్ఠ గీత. 32 వేల శ్లోకములతో గూడిన మూలగ్రంథమునుండి ముఖ్యమగు తత్వభాగమును గ్రహించియు, బాహుళ్యమును కుదించియు, ప్రధాన విషయమును వదలివేయకయు, సాధకులకు అత్యంతోపయుక్తములగునట్టి 8 వేల శ్లోకములను ఏరి, అధ్యాయములుగ విభజించి తెనుగు తాత్పర్యమును జేర్చి ఈ వసిష్ఠ గీతా గ్రంథరూపమున ప్రకటింపబడినది. అందు ప్రథమభాగముమాత్రము ముద్రింపబడి పాఠకుల కందజేయబడినది'—

పై వాక్యాలలో శ్రీ స్వామివారు ఈ గ్రంథాన్ని సంఘటించిన విధానమేమిటో విస్పష్టమౌతూ వుంది.

యోగవాసిష్ఠమనే పేరా, జ్ఞానవాసిష్ఠమనే పేరా విఖ్యాతి వంగుకున్న గ్రంథం భారతీయ తాత్వికరంగంలో అత్యంత ప్రధానమైనది. 'భగవద్గీతకు' గల శాస్త్రీయతను తాత్వికులు దీనికి అంగీకరింపకపోయినా యీ గ్రంథాన్ని పరిశీలన చేయనిది భారతీయ తాత్వికజ్ఞానం సమగ్రంగా లభించదు. అనంతరదశలో అనేకమంది మంత్ర తాంత్రికాది సిద్ధాంతాలవారు అనేక ప్రక్షిప్తాలను ఇందులో చేర్చివేయటంతో మూలగ్రంథానికి గల శాస్త్రీయతను కొంత దెబ్బతీసినట్టు తోస్తుంది. ఇది వాల్మీకి రచనగా చెబుతున్నారు. భాషావిషయకంగా పరిశీలనచేస్తే రామాయణ రచనకూ ఈ రచనకూ పొంతనకుదరటం కష్టం. ఇది భాషాతత్వవేత్తలు నిర్ణయించవలసిన విషయం.

ఈ గ్రంథంలో అర్జునోపాఖ్యాన ఘట్టమొకటి వుంది. దాన్లో వసిష్ఠులు శ్రీరామచంద్రునకు, ద్వాపరయుగాంతంలో శ్రీ కృష్ణార్జునుల యిరువురి మధ్యా జరుగబోవు 'భగవద్గీత' సంవాదమును గురించి వివరించి తెలియజేశారు. ఆ సందర్భంలో భగవద్గీతలోని శ్లోకాలు యథాతథంగా గ్రంథంలో ఉటంకించబడినై. ఇదంతా విభ్రాంతికరంగా వుంటుంది. ఈ గ్రంథం గీతారచనకు అనంతరం జరిగినట్టు మనం ఆశంకించవలసి వస్తుంది. అంతేగాక ఈ గ్రంథంనిండా భగవద్గీత పోలికలు ఎన్నో కనుపించుతున్నాయి.

ఇంతేగాక యీ గ్రంథంలో అనేక కథలు విన్యాసం చేయబడినై. వాటిలో ప్రాచీనకాలానికి సంబంధించిన అనేక సాంఘిక, చారిత్రక విషయాలు అవగతం కావటానికి వీలుంది. ఉదాహరణకు: 'హైందవ'శబ్దం సింధునదినిబట్టి వచ్చిందనీ యవనులు దీన్ని 'ఇండస్' అనే వారనీ అదే 'హిందూ' హైందవ శబ్దాలుగా రూపొందిందనీ చరిత్రకారులు పరమ విశ్వాసంతో వున్నారు. కాని ఇందులోవున్న ఒకకథనుబట్టి చూస్తే ఇది భ్రమయేమోననిపించుతుంది.

పూర్వం కశ్యపుని వంశంలో జనించిన 'ఇందు' అనే బ్రాహ్మణు డొకడుండేవాడు. ఆ బ్రాహ్మణునకు సంతానంలేదు. అందుచేత ఆ దంపతులిద్దరూ తపస్సుచేసి శివునివరంవల్ల పదుగురు కొడుకులను కన్నారు. ఆ సంతానమే ఐందవులు. మాతాపితృవియోగం కారణంగా ఈ ఐందవులకు విషాదంకలిగి కైలాస పర్వతంచేరి కొంత చింతనచేసి అనంతరం యోగసాధనచేసి ఆత్మబ్రహ్మసాక్షాత్కారం పొందుతారు. 'సింధు'నది నుంచి 'ఇందు' శబ్దం పుట్టిందనేకంటె ఈ 'ఇందు' 'ఐందవ' శబ్దాలనుంచే 'హిందు' 'హైందవ'శబ్దాలు పుట్టాయనటం మరింత సమంజసంగా వుండదా? ఇలాంటి వాదాన్ని అంగీకరించితే ప్రాచీనార్య చరిత్రనుగురించి మనకున్న దృక్పథమే మారిపోవలసి వుంటుంది. భాషాశాస్త్ర

# గ్రంథ విమర్శనము

వేత్తలు, చారిత్రక పరిశోధకులు ఈ విషయాన్ని పరిశీలించి తుది నిర్ణయం చేయగలరని ఆశించుచున్నాము. 32 వేల శ్లోకాలు గల ఆ మహాగ్రంథంలో బ్రహ్మోపాసననుంచి విషూచిమంత్రాల వరకూ అనేక విషయాలు జొప్పింపబడి వున్నాయి. నవీన దృక్పథంతో సమగ్రమైన పరిశోధన జరుగ వలసిన గ్రంథం యోగవాసిష్ఠము.

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు ఈ దృష్టితో పరిశీలించి ఈ 'వసిష్ఠగీత'ను సంఘటించలేదు. వారి దృక్పథం వేరు. బ్రహ్మజ్ఞాన సాధనవారి పరమావధి ముముక్షుజన ప్రయోజనార్థం ఈ గ్రంథాన్ని ఇలా సంఘటించారు. శ్రీ స్వామివారి అనుభవం ప్రకారం ఈ శ్లోకాలకు సుబోధక మైన తేటతెనుగులో తాత్పర్యం వ్రాయబడివుంది. యోగవాసిష్ఠంలో గల 32 వేల శ్లోకాలను చదివి అర్థం చేసుకుని, దాన్లోనుంచి సిద్ధాంతరూప మైన ఒక పరమార్థాన్ని గ్రహించటం, సంస్కృతం రానివారిమాట అటుంచి సంస్కృతం చదువుకున్నవారికికూడా దుష్కరమైన పనే. అందుచేత సర్వాంధ్ర ప్రజానీకానికి అందుబాటుగా ఈ గ్రంథాన్ని సంక్షేపించి తాత్పర్యంతో అందజేస్తున్న శ్రీ స్వామివారి కృషి ప్రశంసనీయమైనది. ఆంధ్ర ప్రజల ఆదర ప్రోత్సాహములతో మిగతా భాగములు కూడా త్వరలో వెలువడగలవని ఆశించుచున్నాము.

## కనకధారా స్తవము

అనువాదకులు: శ్రీ కొలకుల నారాయణరావు: ప్రాప్తిస్థానము రచయిత, నెల్లూరు వెల 0-4-0.

శంకరాచార్యులవారినిగురించి అనేక కథలున్నాయి. అలాగే ఆయన పేర అనేక కావ్యాలున్నాయి. కనకధారా స్తవము అనే ఈ కృతి శంకరాచార్యులవారిదిగా చెప్పబడుతున్నది. ఈ కృతికి సంబంధించిన ఒక కథవుంది.

'శ్రీ శంకరులు ఒకనాడు భిక్షార్థమై బయలుదేరారు. ఒక పుణ్యవతి యింటిముందుకు వెళ్ళి నిల్చున్నారు. ఆ యిల్లాలు చాలా బీదదికావటంచేతనూ, ఇంట్లో యేమీ లేకపోయిన కారణంచేతను భిక్ష వేయలేక పోయింది. కాని ఆమహాపురుషునితో లేదని చెప్పటానికి నోరు రాలేదు. అందుచేత ఒక ఉసిరికాయ తీసుకువచ్చి పాత్రలో ఉంచింది. భగవత్పాదులు ఆవిడ పేదరికాన్ని వెంటనే గుర్తించి చాలా చింతించారు. అప్పుడు లక్ష్మీదేవిని స్తుతించగా, లక్ష్మీదేవి సువర్ణామలకములు వర్షించింది. ఆనాడు చేసిన స్తవమే ఈ కనకధారా స్తవం. ఈ శ్లోములను శ్రీ నారాయణరావుగారు తెలుగులోకి పద్యానువాదం చేశారు. అనువాదకులకు సంస్కృతాంగ్లములలో మంచి ప్రవేశంవుంది. పద్యనిర్మాణం కూడా దక్షతతో చేయగలరు. లోగడ వీరు ఇతర సంస్కృత కృతులనేకం తెలుగు చేశారు. అనువాదాలతో పాటు మూల శ్లోకాలను కూడా పొందుపరిచారు. ఇది ముచ్చటైన లక్ష్మీస్తోత్రం. మచ్చుకు:

> నమోస్తు హేమామ్బుజ పీఠికాయై
> నమోస్తు భూమణ్డల నాయికాయై
> నమోస్తు దేవాది దయాపరాయై
> నమోస్తు శార్ఙ్గాయుధ వల్లభాయై.

దీనికి శ్రీ నారాయణరావు గారి అనువాదం:

> స్వర్ణవారిజాసనకును వందనములు
> భూవలయ నాయికకును కేల్మొడ్పులెపుడు
> అరయదేవాది సత్కృపాపరకు నతులు
> ప్రణుతు లివ్వె శార్ఙ్గాయుధవల్లభకును.

## ఋతుసంహారము

కాళిదాసు రచనగా చెప్పబడుచున్న ఋతుసంహార కావ్యానికి తెలుగు సేత: అనువాదకులు శ్రీ కొలకుల నారాయణరావు: మూలశ్లోకములు, ఆ శ్లోకములకు శ్రీ నారాయణరావుగారి తెలుగు పద్యములు ఆ తెలుగు పద్యములకు శ్రీ భట్టారం మల్లికార్జునంగారి టీకాతాత్పర్యములు ఈ గ్రంథంలో సంపుటీకరింపబడివున్నాయి. ద్వితీయ ముద్రణ. ప్రచురణ కర్తలు: జయలక్ష్మి అండ్ కో, నెల్లూరు. వెల రు 2-0-0.

## ఆంధ్ర నాటక కర్తలు

[మొదటి భాగము]

వ్యాస సంపుటి ప్రచురణ: ఆదర్శ సాహిత్య మాల, (17-5-350 out-side Dabbirpura) హైదరాబాద్—2. వెల 1-2-0

'ఆంధ్రభాషలో అసలు నాటకాలెక్కడున్నాయి' అని కొందరు తెలిసీ తెలియని ప్రబుద్ధులు వాకొనుచుండటం మనం వింటూనే వుంటున్నాము. వీరికి ఆంధ్రనాటకచరిత్రతో గాని ఆంధ్ర నాటక

వాఙ్మయంతో గాని తగిన పరిచయం లేకపోవటం కారణం. ఈ దశలో, 'ఆంధ్రనాటక కర్తలు - ప్రథమ భాగం' అంటూ ఒక గ్రంథం వెలువడటం, ఇంకా అనేక మంది ఆంధ్రనాటక కర్తలను గురించి మరికొన్ని సంపుటాలు వెలువడ నున్నట్లు 'ప్రథమభాగం' అనటంలో ధ్వని వినిపించుతూ వుండటం ముచ్చటగా లేదా?

ఈ ప్రథమభాగంలో ఆంధ్రనాటక రచనా పితామహులనదగిన 5 గురు మహాపురుషులను గురించి వ్యాసాలున్నాయి.

(1) శ్రీ ధర్మవరము రామకృష్ణమాచార్యులు
వ్యాసకర్త : శ్రీ దివాకర్ల వేంకటావధాని

(2) శ్రీ కోలాచలం శ్రీనివాసరావు
వ్యాసకర్త: శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిరావు

(3) శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి
వ్యాసకర్త: శ్రీ దివాకర్ల వేంకటావధాని

(4) శ్రీ పానుగంటి లక్ష్మీనృసింహము
వ్యాసకర్త : శ్రీ పోలంగి శ్రీరామఅప్పారావు

(5) శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము
వ్యాసకర్త: శ్రీమాన్ చలమచర్ల రంగాచార్యులు.

వ్యాసకర్తలు విశేష కృషిజేసి ఆయా మహాపురుషులనుగురించి అనేక విషయాలను సేకరించారు. నిజానికి శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారిని గురించి యిప్పటి తరం వారిలో బహుకొద్ది మందికి తెలుసు. వారిని గూర్చి వారిపాండిత్యవిశేషాలను గురించీ అనేక విషయాలు ఇందు సేకరింపబడివున్నవి. అవశ్యం ఆంధ్రప్రజల ఆదరాభిమానము లందవలసిన గ్రంథం. ప్రకాశకుల ఉద్యమం జయప్రదం కాగలదని ఆశించుచున్నాము.

## శ్రీ అరవిందుల యోగసమన్వయము

అనువాదకులు : శ్రీ కమలాకర వెంకటరావుగారు. వెల రు. 3-0-0 కృష్ణా స్వదేశీప్రెస్, మచిలీపట్నం.

అరవింద యోగిగూర్చి వినని భారతీయులుండరు. ఆ మహనీయుడు తొలుదొల్త ఒక విప్లవవాదిగను, పిదప నొక రాజకీయవేత్తగను, అనంతర మొక యోగిగను, గొప్ప రచయితగను పిదప నొక సిద్ధాత్మగను వెలుగొందినవారు. వీరు శాస్త్రములలో నిరూపితములయిన అనేక విషయముల ననుభవమున యథార్థములని ఎరిగి ఎరుంగజేయ దొరకొనిన మహనీయులు. రామకృష్ణ పరమహంస మొదలగు మహనీయులు శాస్త్ర సిద్ధాంతముల నెఱుగకయే యోగసిద్ధి నందిన యోగులు. అరవిందాదులు శాస్త్ర సిద్ధాంతముల నాచరణ సాధ్యములుగా చేసినవారు. అరవిందుల రచనలలో నిరూపితములగు విషయములు శాస్త్ర దృష్టములేగాక యాచరణసాధ్యములు గూడ. అందువలన వీరి రచన లత్యుత్తమ స్థాయికి చెందినవి. అరవింద యోగి "The Synthesis of Yoga" అని ఇంగ్లీషులో రచించిన దానిని కమలాకర వేంకటరావుగారనువాదరూపమున తెలుగుబాసయందు వెలువరించారు. గురవగాహమైన శాస్త్రవిషయముల నెంతియో జాగరూకతతో సులభశైలిలో వీరనువదించిరి. వేదాంత పరిశ్రమ, వేదాంత విజ్ఞాన మొక్కించుకగల్గి అందలి నిగూఢరహస్యముల నెఱుంగగోరు జిజ్ఞాసువులకిది యత్యంతోపకారకము.

ఈ గ్రంథమున 6 ప్రకరణములున్నవి. (1) సాధన చతుష్టయము, (2) ఆత్మనివేదనము, (3) ఈశ్వరాధీన కర్మయోగ సాధనము, (4) యజ్ఞము—త్రిమార్గము—యజ్ఞేశ్వరుడు, (5) యజ్ఞారోహణము, (6) యజ్ఞారోహణము 2.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

# అమృతాంజనము

''ఏనుగు తలనొప్పుల'నుకూడా

క్షణంలో
ఉపశమింపజేస్తుంది



లక్షలాది ప్రజలు 1893 నుంచి
దేశమంతటా అమృతాంజనాన్ని వాడు
చున్నారు. అమృతాంజనము బెణుకులు,
వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు,
దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.




అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.



అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1. కలకత్తా-7.

AL 56.5